శ్రీరస్తు.

శ్రీగణాధిపాయనమః.

అనేక పుణ్య కథాంతర్భూతంబును

శ్రీ స్కాంద పురాణాంతర్భూతంబును

నగు

# సేతురామేశ్వరమాహాత్మ్యము.

—(*)—

ఇందు తీర్థముల మాహాత్మ్యము,

పుణ్యకాల వివరము, మహా సంకల్పము, మాఘస్నాన,

సముద్రస్నాన, క్షేత్రపిండ, దశదానవిధులుచేర్చి

యాత్రాపరులకు సులభోపాయంబుగా

దెలియు నటుల వచనరూపంబుగ

వ్రాయబడి,

పండితులచే బరిష్కరింపఁబడి,

—(*)—

రామేశ్వరం బుక్కుషాపు

మ. నాగలింగంపిళ్లగారిచే,

—(*)—

చెన్నపురి.

శ్రీపద్మనాభవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపఁబడియె.

1912 - వ సం॥ వెల, 10 అణాలు.



---



శ్రీ ర స్తు.

శ్రీ మహాగణాధిపతయేనమః.

—*—

# శ్రీ సేతు రా మే శ్వ ర మా హా త్మ్య ము.



వచనకావ్యము.

శా॥ నిగమములెన్నజాలవట నిశ్చయబుద్ధినిజూడజాలక।
య్యగణితసుప్రభావమహిమాబ్ధిగుఱించివరించు నెవ్వడీ।
జగములబోవిలీలగుణసంగతిసాంగతలక్ష్మిగూడున।
య్యగుణుభజింతుమాధవుని యంబుజనాభుని రక్షణక్షముః॥

——(*)——

వ॥ అవధరింపుడు శౌనకాదిమునులొకనాడు వ్యాసపుత్రుండును నిఖలపురాణకథకుండునునగు సూతుండువేంచేయబూజించి సుముఖుంజేసి సేతుమాహాత్మ్యంబడిగిన సూతుండిట్లనియె.

పూర్వకాలంబున శ్రీరామచంద్రులచే సేతువు బంధించ బడిన దక్కడ స్నానంబుజేసి శ్రీరామనాథ స్వామిని దర్శించినవారికి జన్మరాహిత్యంబని చెప్పిన సూతా యీకథాక్రమం బుపక్రమించి సక్రమంబుగా జెప్పవలయునని ప్రార్థించిన.

మునీంద్రులారా సేతుయాత్రా ప్రకారంబు లనేకవిధంబులు తాము యాత్రసలిపి సేతుదర్శనంబుజేసి స్నానదాన తర్పణాదులు జరిగించె నేని పాపంబులచేబాయు జన్మరాహిత్యంబు గలుగును. యాత్రావరునకు సహాయంబుజేసి తనశక్తికొలది ధనంబిచ్చి పంపించినవారికి పాపక్షయం

బునకు సందేహంబులేదు. యాత్రబోవలెనని ప్రయత్నంబుజేసి మనో వాక్కాయ కర్మంబుల సేతు స్నానాసక్తిగలిగనేని వాడు పవిత్రుండగు సేతువులో శ్రాద్ధంబుజేసి పిండప్రదానంబుజేసిన వతనిపితృదేవతలుబ్రహ్మ లోకంబుజేరుటకు నిస్సందేహంబు సేతుస్నానం బొనరించినవాడు వైతరణి, శ్వభక్షు, కాలసూత్ర, తప్తశూల, పురీష, హ్రాద, శిలావృష్టి, మూత్రపాన, రేతకిపాన, తప్తపాషాణభోజనాది, మహా నరకంబులలో బాధ నొందడు.

మరియు సేతుదర్శనంబు జేసినవారలు మార్గచ్ఛేది, గృహదాహి, స్వార్థపృథక్పాకి, బ్రాహ్మణదూషక, వేదవిక్రేతా, భోజనప్రతిబంధి, జలపానప్రతిబంధి, స్వర్ణస్తేయీ, సురాపాయీ, బ్రహ్మద్రోహీ, మిత్రద్రోహీత్యాది మహాపాతకులైన పావనులగుదురు, మునులారా యీసేతు మాహాత్మ్యంబు స్కంద పురాణంబులో విస్తారంబుగా జెప్పబడి యున్నది మీరు సకలయాత్రాచరిత్రలు విన నిశ్చయించినవారు గనుక సకలకథా విస్తారంబులు సూక్ష్మంబులుగా ముఖ్యంబుగ వినుపింతును తథాచ స్కందపురాణే॥

శ్లో॥ సేతుస్నానేన ధర్మస్స్యా త్సేతుస్నానాదఘక్షయః।
సేతుస్నానంద్విజశ్రేష్ఠా స్సర్వకామ ఫలప్రదం।
సేతుస్నానేనసర్వేషాం నశ్యంతేపాపనాశయః।
వర్ధంతేధర్మరాశిశ్చ శుక్లపక్షేయథాశశీతి॥

సూక్ష్మంబుగా సూచించితిసేతుస్నాన మాహాత్మ్యం బద్భుతంబు బుద్ధిమంతులు సేతు స్నానంబుజేసి తరింతురని తలచెదననిన సూతా సేతు బంధనం బెందుకయ్యె తత్ప్రకారంబు వినగోరెదమని యడిగిన సూతుం డిట్లనియె.

—* సేతుబంధనచరిత్రము. *—

కృతయుగంబున దశరథమహారాజు బహుకాలము రాజ్యంబుజేసి పుత్రసంతానంబు లేమింజేసి పుత్రకామేష్టిచేసి యాగ పాయసంబును భార్యాత్రయంబగు కౌసల్యాసుమిత్ర కైకల కొసంగిన రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను నలుగురు పుత్రులుదయించిరి. వారు బాల్యావస్థ యందు లీలావిలాసులుగానుండునప్పుడు విశ్వామిత్ర మహర్షి జేయు సత్రయాగంబును రాక్షసులు బాధించి జెరుచుచుండ యోగ దృష్టివలన నామహర్షి శ్రీమహావిష్ణు ముందుదశరథునకు శ్రీరాములను పేరనవతరించి రాక్షసులను నశింపజేయుదునని వరమొసగియుండె. ఇప్పుడాయన యవత రించి దశరథునింటనుండె. నేనిప్పుడాదశరథునికోరి శ్రీరాములను తీసు కొని రావలయునని వచ్చి దశరథుని జూడ సమ్మతించి శ్రీరా ములను విశ్వామిత్రునితో నంపిన వచ్చి విశ్వామిత్రుని యాగమును సాం గోపాంగముగువరకు రాక్షసబాధలేకుండ కాపాడిరి. అప్పుడువిశ్వామిత్రు డు సంతసించి శ్రీరాములకు అనేకములయిన దివ్యాస్త్ర ప్రయోగంబు లుపదేశించె.

అంతజనకమహారాజు తనపుత్రియగు శీతాదేవికివైవాహికప్రయ త్నంబాచరించి స్వయంవరంబు చాటించిన నా స్వయంవరంబునకు శ్రీరా ములు పోయి జనకమహారాజునకు శివుడొసంగిన విల్లును వచ్చిన రాజులు నెక్కువెట్టకనేయుండ రాఘవుండవలీలగా నావిల్లునెక్కువెట్టి మత్స్య యంత్రంబును దెగవేశి శీతను పెండ్లియాడి అయోధ్యను సుఖస్థితి నుండు నప్పుడు దశరథుండు తనకు వృద్ధాప్యంబు వచ్చిన దని కుమారునకు బట్టంబు గట్టునటుల మంత్రి సామంతులతో అలోచించి ముహూర్తం నిశ్చయంబొనర్చి బట్టణాలంకారంబు జేయ నియమించె.

అట్టిప్రయత్నాదుల పదంపడి కైకదాసియగు మందర విని కైక దగ్గిరకుపోయి యోయమ్మా, దశరథుండు నీపైవిశేషప్రీతి గలవాడనియు

రెండువరంబులు నీకునొసంగెదనియు జెప్పుచుంటివే యిప్పుడు రాములకు పట్టాభిషేకం బొనరింప బ్రయత్నంబగుచున్నది, ఇక నీ కుమారుండును నీవును నాయన యాజ్ఞాబద్ధులయిన వారుగ నుండవలె యట్టి బ్రతుకు బ్రతుకే.

ఈసమయంబునదశరథుని నిర్బంధించి నీకొసంగిన రెండువరంబులకు నొకటికి రాముని నరణ్యంబునకు బంపుటయు రెండవదానికి నీకుమారుం డగు భరతునికి పట్టాభిషేకము సేయుటయు నేర్పాటు జేసుకొనుమని ప్రోత్సాహపరువ నామె భర్తను నాప్రకారము కోరగా దశరథుండు విఫలమనోరథుండై జీవన్మృతుండువోలె యుండె.

అంత పట్టాభిషేకంబున కాయత్తంబగుడు. దశరథుండు రామిం జూచి ఋష్యాదులు రాఘవుం బోయి నిజకునిం దోడ్కొనిరమ్మని యంప రాముండు తండ్రిసమీపంబునకు వచ్చి నడచిన సంగతి విని పితృవాక్య పరిపాలనకై తానరణ్యాగమనోద్యోగుండైన సీతాలక్ష్మణులు వెంటనంటిరి. అంత గొంతకాలంబునకు దశరథుండు పరలోక గతుండైన భరతుండు రాము పాదుకలు నందిగ్రామంబున బూజించుచు రాజ్యం బేలుచుండె.

అట్లు శ్రీరాముండు సోదర భార్యా సమేతుండై పంచవటీ తీరంబున పర్ణశాలయందు వశించునపుడు రావణుండా సీతను దోడుకొని పోయెను. అనంతరముభార్యాన్వేషణకు బయలు వెడలి బంపాతీరంబు జేర వచ్చుటకు సుగ్రీవుని బంటగు నాంజనేయుండువచ్చిన రాముండు సంతోషిత స్వాంతుండై నీవెవ్వండ వేమిటికొచ్చితివనియడిగిన యాంజనేయుండుసుగ్రీవుని వృత్తాంతంబంతయుంజెప్పి యేనతనిభృత్యుండ భవత్సఖ్యంబుగోరి నన్నంపిన వచ్చినాడ ననియె.

రాఘవుండు లక్ష్మణసహితుండై యావానర శ్రేష్ఠుని వెంటంబోయిప్రమాణికంబుగావాలివధ ప్రతిజ్ఞుండయ్యె. సుగ్రీవుండు సీతాన్వేషణ

పరుండయ్యె. అంత సుగ్రీవుండు వాలితోఁ బోరాడుసమయంబున భేదా భేదంబులం దెలియజాలక రాముండూరకుండిన సుగ్రీవుండుపలాయనుండై రాములనిందించిన మరుసటిదినంబున పూవులమాల ధరించుకొని యుద్ధంబుజేయ నియమించి రాఘవులు యేకశరంబున వాలిఁగూల్చి సుగ్రీవునకు బట్టంబుగట్టె, తదుపరి శీతాన్వేషణంబునకై వానర శ్రేష్టుల నలుమూలలకు బంప నందు నాంజనేయుం డంగదాది సమేతుండై లంకాపురాశోకవనంబున వైదేహింగాంచి లంకయంతయుదహించి శ్రీరాములానవాలుగా నిచ్చిన యంగుళీయకము భూమిజ కిచ్చి యామె చూడామణిం దెచ్చి శ్రీరాముల కొసంగె. నంత లక్ష్మణ సుగ్రీవాంగద హనుమదాది వానర సమేతుండై మహేంద్రపర్వత సమీపస్థిత చక్రతీర్థోపాంతంబున నివశించు నపుడు రావణానుజుండగు విభీషణుండు మంత్రిచతుష్టయంబుగా రాముల శరణొందిన సుగ్రీవాదులు శంకించుచుండినను యభయంబొసంగి రాక్షస రాజ్యంబున కభిషిక్తుంజేసి యిట్లనియె.

ఓవానరశ్రేష్ఠులారా నీసముద్రము మహా భయంకరంబు నొందించుచున్నది. మనలకుత్రోవనీయనట్లున్నది యని సంశయించుచుండ విభీషణుం డేతెంచి.

ఓరఘువీరా! ఈరత్నాకరుండు యుష్మద్వంశ సముద్భవ సగరతనయ సమూహాన్వితుం డగుటంజేసి సాగరుండను బ్రసిద్ధినొందె. కాన శరణంబువేడ నస్మత్కార్యానుకూలుండగు ననిన నంగీకరించి ఓకపివరులారా నతిభీషణంబగు నీసముద్రంబు ప్లవాదులు దరింప నశక్యంబు విభీషణోక్త ప్రకారంబున మార్గసిద్ధింగోరి వరుణాలయంబు నుపాశించెద. ఏ నుపాసించినం దుర్మనుండగునేని దహించెదనని సౌమిత్రిసహితుండై యాచమనంబు చేసి దర్భశయనంబున స్వహస్తంబు దలగడగ నిడికొని దర్భశయనంబున శయనించె.

ఇవ్విధంబున త్రిరాత్రంబులు సకలధర్మవేదియు నియమ సమన్వితుండునగు రామచంద్రుండు యథార్హంబుగా ననేకవిధంబుల వేడినం

దుర్మదుండగు సాగరుండు దర్శనం బొసంగకపోయె. నంత నృపోత్తముండు లక్ష్మణుంగాంచి, సౌమిత్రీ యీసముద్రుండు క్షమాయుక్తుండగు నన్నసమర్థుంగాదలంచె నాశీవిషోపమంబులగు బాణంబులనొసంగుము నితని నమోఘాస్త్రంబులచే శోషింపంజేసి నిర్జలుండగునట్లు గావించెద. వానర సమూహంబులు పాదంబులచే గృతగమను లగుదురని ధనుర్ధారియై క్రోధపర్యాకులేక్షణుండగుచుం ద్రిపురాంతకుం బోలె ధనురాకర్షణము గావించి సమస్తజగంబులు కంపంబునొంద నుగ్రంబులగు బాణంబులం బ్రయోగించె. నంత రామప్రేరితంబులయిన బాణంబులు తోయంబులం బ్రవేశింప సాగరుండు పాతాళోద్ధతుండును నతిభీతుండును కంపమాన దేహుండు ననన్యశరణుండును కృతాంజలియగుచు కైవల్య పదకారణుండగు రాఘవు శరణంబునొంది యిట్లని స్తుతించె.

ఓరఘునాయకా నీవు తాటకాంతకుండవు కౌశికయాగరక్షకుండవు మహాదేవశరాసనవిదారివి భక్తాభీష్టఫలప్రదాయకుండవు దేవకార్యార్థివి. రఘువంశసముద్భవుండవు, మహానుభావుండవు, నిన్నుఁగొనియాడ నాతరంబగునే నీకనేక వందనంబులొనరించెద శరణార్థియగు నన్ను గావుము, కోపంబుపసంహరింపుము, క్షమింపుము భూమ్యాదులు పరమేష్ఠికల్పితంబులగు స్వగుణంబుల నెట్లువిడువ దట్లయేను నగాధంబగు మత్స్వభావంబుమాననేర మన్నింపుము. యుష్మత్సేనావతరణంబునకుం దగిన సాహాయ్యంబు చేసెదనని విన్నవించిన సంతసించి రామచంద్రుండు ఓ రత్నాకరా మత్సైన్య సమూహంబులకుంబోవలయుంగాన శోషణంబు నొందుమనిన సముద్రుం డిట్లనియె. ఓనృపోత్తమా నీవు సైన్య సమేతంబుగా లంకకుంబోవ నుపాయంబువచించెద నాకర్ణింపుము. యుష్మదాజ్ఞా గౌరవంబున శోషణంబునొంది నన్నుంగాంచి జనంబులు ధనుర్బలంబునకు భీతినొందినవాడవైతినని వచింపుదురుగాన మరియొక్క యుపాయంబుఁజెప్పెద నాకర్ణింపుడు.

విశ్వకర్మపుత్రుండగు నలుండు కాష్ఠంబైన తృణంబైన శిలయైన నాయంటించిన నవియన్నియును ధరించెద. అది సేతువనంబడు నాసేతువుచే రావణ పాలితంబగు లంకాపురంబునకుం బొమ్మని వచించి సముద్రుం డంతర్హితుండయ్యె నదివిని రామచంద్రుండు నలునిచే సేతుబంధనంబు గావించి వానరసమూహంబు దాటె నదియెవర్ణశయనం బనంబడు. తదుక్తం సేతుమహాత్మ్యే॥ శ్లో॥ నలశ్చక్రేమహాసేతుం మధ్యే సదనదీపతేః దశయోజనవిస్తీర్ణం శతయోజన మాయతం ॥ సర్వపాతకినోమర్త్యా। ముచ్యంతే సర్వకిల్బిషైః। వ్రతదాన తపోహోమైర్నతథాతుష్యతే శివః॥ సేతుమజ్జన మాత్రేణయథాప్రీణాతిశంకరః॥ఇతి॥ వింటిరా మునులారా సేతు మహాత్మ్యం బనఘుర్ణ్యంబు సేతుస్నానంబున మహాపాపంబులు నశించు ను హరిహర సంతోషకారణంబా సేతువు నావరించుకొని యనేకకోట్ల తీర్థంబులుగలవుగాని యందులో మహాముఖ్యతీర్థంబులుజెప్పెద,

సేతువులో నుండు ముఖ్యతీర్థంబులు

వినుండుధర్మపుష్కరణీయనుచక్రతీర్థంబు, భేతాళవరదంబు, పాపవినాశినీ, సీతాసరస్సు, మంగళతీర్థంబు, అమృతవాపియు, బ్రిహ్మకుండంబు, హనూమత్కుండంబు అగస్త్యతీర్థంబు, రామతీర్థంబు, లక్ష్మణతీర్థంబు, జటాతీర్థంబు, లక్ష్మీతీర్థంబు, అగ్నితీర్థంబు, చక్రతీర్థంబు, శివతీర్థంబు, శంఖతీర్థంబు, యామునతీర్థంబు, గంగాతీర్థంబు, గయాతీర్థంబును, కోటితీర్థంబును, సాధ్యామృతంబును, మానసతీర్థంబును, ధనుష్కోటియుననివి యిరువది నాలుగుతీర్థంబులుమహోత్తమంబులు మునీంద్రులారా యీ అధ్యాయంబు పఠించిన వారికి జన్మరాహిత్యంబని చెప్పియుండగా నీ తీర్థంబులలో యథాశాస్త్రంబుగా నవగాహనాది క్రియలుజరిగించు వారికి నుత్తమలోకంబులు దొరుకుటకేమి యాశ్చర్యంబని చెప్పినవిని సూతా యిరువదినాల్గుతీర్థంబులలో నుత్తమతీర్థంబు లెవ్వియో వినుపించుమని యడిగినమునులారాసమస్తతీర్థంబులుత్తమంబులే నందులో ప్రధానతీర్థం బనేకుల పని

త్రంబు జేసెననియు హరి హరులందరును పాత్రంబైనది గొప్ప విరివిగలది సేతువుకన్న మొదటిది ధర్మపుష్కరిణియను చక్రతీర్థంబు దానిప్రభావం బత్యద్భుతంబు వినిపించెద ముందువినుండు॥

ధర్మపుష్కరిణియనుచక్రతీర్థ మాహాత్మ్యము,

అనిసూతుండు జెప్పిన మహాసంతోషభరితులై మునీంద్రులు సూతా అట్టిమహాతీర్థంబునకు నామధ్యేయంబు గల్గుటకు కారణంబేమియని యడిగిన సూతుండు మునీంద్రులారా సేతువుకు మూలకారణంబు దర్భశయనంబు నాస్థలంబునమహాపాతకనాశనంబగు చక్రతీర్థంబుగలదు.

పూర్వకాలంబున విష్ణు పరాయణుండును వేదవేదాంత విదుండును మహాబ్రహ్మచర్యవ్రతనిష్టాగరిష్ఠుండును మహాతపస్వియగు గాలవుండనుమహాముని దక్షిణసముద్రతీరంబున హాలాస్యంబను మీనాక్షీసోమసుందర క్షేత్రంబగు మధురాపురికి సమీపంబున ఫుల్లగ్రామంబునకు కొంచెము దూరంబులో క్షీరసరోవరంబునకు దాపున ధర్మపుష్కరిణీ తీరంబున మహోన్నతంబగుదీక్షతోజీర్ణ పర్ణాశనుండై కొన్నిదినంబులుజలాహారుండై తమపరి వాయుభక్షణంబుజేయుచు తదనంతరంబునిరాహారుండై ప్రణవమంత్రంబు జపించుచు పదివేల సంవత్సరంబులు ఘోరంబగు తపంబొనరించితమపరి అష్టాక్షరీ మంత్రంబు నారాయణు నుద్దేశించి చేసిన భగవతుండగు నారాయణమూర్తిప్రత్యక్షుండై సంతుష్టినొందివరంబిచ్చెద గోరుమనిపరమేశ్వరుం డానతిచ్చిన గాలవుండు సంతోషించి

వేదాంతవేద్యా నాథా వైకుంఠవాసా వాసుదేవా త్రివిక్రమా దీనార్తిహరణా నారాయణా నీపాదంబులకనేక నమస్కారంబులొనరింతునని స్తోత్రంబులు చేసిన జనార్దనుండు సంతోషించి చతుర్భుజంబులగాలవుని గౌగలించి వరంబులు గోరుమని యాజ్ఞయొసంగినగాలవముని మహాప్రీతుండై నారాయణ పీతాంబరధర జగన్నాథ గోవింద మిమ్ములబ్రహ్మాదులుగానజాలరు వేదంబులు గనుగొనజాల వట్టి పరమా

త్మని పాదపద్మంబుల దర్శనంబు నాకు లభించె యోగీంద్రుల కందరాని సుందరానంద కందళితుండనైతి నాకు మరి తలంబు లేంకుంగా దేవరవారి చరణారవిందంబులపై వదలని భక్తి కృపసేయుమని గోరిన పరమేశ్వరుండు సంతసించి॥

శ్రీభగవాన్॥ శ్లో॥ మయిభక్తిర్దృఢాతేస్తు నిష్కామి స్థాలవాధునా। ఏతత్ప్రారబ్ధదేహాంతే మత్సాయుజ్యమవాప్స్యసి ॥ వ॥ అనియిచ్చు నివ్విధంబున భగవంతుండాజ్ఞయిచ్చి గాలవాఖ్యాయాశ్రమంబుననే నివు నివాసంబు జేయుచుయిది ధర్మపుష్కరిణి మహాపుణ్యతీర్థంబు పూర్వకాలంబున ధర్ముండిచ్చట మహాదేవు నుద్దేశించి బహుకాలంబు తపస్సుచేసి స్వానార్థంబిచ్చట నొకతీర్థ నిర్మాణంబు చేసినందున ధర్మ మహామునిచే నిర్మించబడుటవలన ధర్మపుష్కరిణి యను నామంబు సార్థకంబయ్యె॥

తదనంతరంబున మహాదేవుండు ప్రత్యక్షంబైన॥ తదుక్తంస్కాందే॥ శ్లో॥ ప్రాదురాసీత్సయాదీ ప్ర్యాన్ దిశోర్థ విభాసయన్ । తదాశ్రిమను ప్రాప్తంమహాదేవంకృపానిధిం। పరమసంతుష్టస్తుష్టావ పరమేశ్వరంధర్మ వరిణమామిజగత్కర్తా,

మితీనాంపరిణవాత్మకం। సమస్తదేవతారూప మాదిమధ్యాంతవర్జితం ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపం నమామ్యహం। సమస్త జగదాధార మనంతమజమవ్యయం। యమామనంతయోగీంద్రా సంసారేపుష్టి వర్ధనం। నమోలోకాధినాథాయవంచతే పరివంచతే। నమోస్తునీలకంఠాయ పశూనాం పతియేనమః। నమోరుద్రాయదేవాయ జగద్భద్రాయ ప్రచేతసే॥

వ॥ ఇవ్విధంబున ధర్ముండు స్తోత్రంబుచేసిన మహేశ్వరుండతిప్రీతుండై వరంబు వేడుమనిన ధర్ముండు సంతసించి మహాదేవా దేవరకు నేను వాహనంబు గాగలకోరిక గలిగినది గావున నేను వృషభ స్వరూపుండనై నిను వహించెడిశక్తిగలిగి విలసిల్లవరంబు కృపసేయుమని కోరిన మహేశ్వ

రుండా స్తోత్రంబుచే ప్రీతుండై ధర్మా యీతీర్థంబు నీచే కృతంబగుట దీనికి ధర్మపుష్కరణి యనునామంబు జగద్విఖ్యాతియగు నీతీర్థంబులో నెవ్వరైన స్నానంబు దానంబు సంధ్యయు జపంబు మొదలగు సత్కార్యములు జరిపిన వారికి పుణ్యాం బనంతంబగు ననుచు వరంబొసంగి వృషభ స్వరూపంబు నొంది ధర్ముని పై నెక్కి కైలాసంబున కేగె,

గావున గాలవా మాయజ్ఞచే శరీరాంత పర్యంతం బీధర్మపు ష్కరణీ తీరంబులో తపంబు గావించు చుండుము మునిశార్దూలా తను పరిమాణో నైక్యంబు గాగలవు నీకిక్కడ నేవిధంబులైన యాయాసంబు లు సంభవించినగాని మాచక్రంబువచ్చి దుష్టనిగ్రహంబు గావించినిన్ను రక్షించగలదని శ్రీవిష్ణు దేవుండాజ్ఞ యొసంగి యంతర్హితుం డయ్యె.

వింటిరా మునులారా యివ్విధంబునవిష్ణుదేవుండానతిచ్చిన ధర్మ పుష్కరణీకథవిని భగవంతునియాజ్ఞా ప్రకారంబచ్చటనే తపంబొనరించుచు నిశ్చల భక్తుండై యుండ నొకకాలంబున మాఖశుద్ధ యేకాదశీ దినంబున నుపవాసంబుచేసి రాత్రికాలంబున జాగరణంబు జేసి మరునాడు ద్వాద శీదినంబు నరుణోదయంబున స్నాన సంధ్యా ద్యనుష్ఠానంబులు జేసి తులసీపుష్పాదులచే కృష్ణునింబూజించినిశ్చలధ్యానంబుతో విష్ణుస్తోత్రంబు చేసెను.

తను కృతంస్కాందే॥గాలవః॥శ్లో॥సహస్ర శిరసంవిష్ణుంమత్స్యరూపధరం హరిం । నమస్యామి హృషీకేశంకూర్మవారాహరూపిణం । నారసింహ్వాం వామనాఖ్యం జామదగ్న్యంచ రాఘవం। బలభద్రంచ శ్రీకృష్ణం కల్కిం విష్ణుంనమామ్యహం। వాసుదేవ మనాధారం ప్రణవార్తివినాశకం । ఆధా రంసర్వభూతానాం ప్రణమామి జనార్దనమితి॥ఇవ్విధంబున ననేకవిధంబుల శ్రీవిష్ణుస్తోత్రంబు సేయుచు ధర్మపుష్కరణీ తీరంబులోనున్న సమయంబున మహాఘోరాకారుండు క్రూరుండు రాక్షసుండొకండుక్షుధార్తిపీడితుండై

యనేక విధంబుల విష్ణునామ స్మరణంబు జేయుచు మొఱలు బెట్టినక్రి వేల్పు కా మొఱ జెవిసోకినంతమాత్రంబులో విక్రమీగి చక్రంన చక్రంబు బంపినది వచ్చుటజూచి రాక్షసుండు భీతుండై పలాయనంబు నొందిన చక్రంబు వెంబడించితత్క్షణంబ వానిశిరంబు ఖండించిన రాక్షసుండు మృతుండైన గాలవుండు సంతోషించి విస్తారంబుగా సుదర్శన స్తోత్రంబు జెసే,

గాలవః॥ శ్లో॥ విష్ణుచక్రనమస్తేస్తు భక్తరక్షణదీక్షిత । నారాయణకరాంభోజ భూషణాయనమోస్తుతే । రక్షమాంభయ సంవిగ్నం సర్వస్మాత్పాపకల్పిషాత్॥ వ॥ ఇవ్విధంబున గాలవుండును సుదర్శన స్తోత్రంబు గావించిన సంతోషించి గాలవా వెరవకు యీధర్మపుష్కరణి దేవిపట్టణపర్యంతంబు మనుప్రభగ్నుని చే నిర్మింపబడియుండె నే నంతపర్యంతం బీతీర్థంబును రక్షించుచుందును నంతవరకీతీర్థంబునకు చక్రతీర్థంబనిపేరు

ప్రథితంబగునీతీర్థరాజంబులో స్నాన దానతర్పణాదులు జరిగించిన వారు వారివంశమందు జన్మించినవారు పుత్రపౌత్రాదిగణంబుతో విధూతపాపులై శ్రీధరు పరమపదంబు జేరుదురని జెప్పి గాలవుండును మరియు మునిగణంబులుముదమంది జూచుచుండ విష్ణుచక్రంబు ధర్మపుష్కరణలో ప్రవేశించియుండె గావున దానికి చక్రతీర్థంబని పేరుగల్గి ప్రకాశించెను. శ్లో॥ చక్రతీర్థసమం తీర్థనభూతంనభవిష్యతి॥ వింటిరిగదా యిన్ని విధంబుల మహాత్మ్యప్రశస్తంబై నదిగనుక నే చక్రతీర్థంబునకు సాటిలేదని కీర్తివిస్తరించివదని సూతుండుజెప్పె॥

సూతా గాలవఋషిని మ్రింగవచ్చిన రక్కసుండెవ్వండు సుదర్శనంబుచే వాడుముక్తుండగుటకు కారణంబేమియని యడిగిన మునీంద్రులారా పూర్వకాలంబున హాలాస్యంబున సోమసుందరస్వామి మందిరంబులో వసిష్టాత్రి ప్రముఖులగు మహాఋషులు యిరువదినాలుగువేలమంది శివపూజా తత్పరులు భూతిరుద్రాక్షధారులు పంచాక్షరీమంత్ర జప ప్రవీణులుండి

యొకనాడు మధ్యాహ్నకాలంబందు వశిష్టాదులు స్నానార్థంబరిగిన విశ్వావసుకుమారుండు సుదర్శనుండను గంధర్వుండు లలనాశతంబులతో వివస్త్రులై జలక్రీడచేయుచు మహా వైభవంబుతో నుండి నోలలాడు చుండి గర్వించి మునులజూచి స్త్రీలువస్త్రంబులుధరించిరి వాడులజ్జయంబు లేక నగ్నుండై క్రీడించుచున్న వశిష్ఠుండుజూచి మహా క్రోధాకుల చిత్తుండై నీవు గర్వాంధుండవై సంచరించుటచే రాక్షసుండవుగమ్మని శపించెను.

అంతవాడు దుఃఖాక్రాంతుడై స్త్రీలతోగూడ మహామునిపాదంబులపైబడ్డ వశిష్ఠుండు భామలారా మీయందు దోషంబులేదుగాన మీరు స్వర్గంబునకేగవలయు వీడు గర్వగ్రస్తుండు గావునవీని శపించితినని పలికిన మహాత్మ మహా శాంతస్వభావులు మీవంటి సాధుల రక్షించకున్న దిక్కెవ్వరనిశోకించిన కృపాన్వితుండై భామలారా మాశాపంబప్రతిహతంబుగావున వ్యర్థంబుగాదుమీరుస్వర్గంబునకుబోవలయువీడుపదియారుసంవత్సరంబులు రాక్షసుండై క్రూరుండై సంచరించుచు చక్రతీర్థసన్నిధానంబున గాలవమునిని భక్షింపబోయి గాలవస్తోత్రప్రీతుండగు రమానాధుచే ప్రేరేపించిన చక్రంబుచే భిన్నశిరస్కుండై నిజస్వరూపంబు ధరించి దివంబునకేతెంచి మిమ్ము బొంది సుఖించుపొండని వచించిన నిరాశులై పతినిం గౌగలించుకొని రోదనంబుజేయుచు స్వర్గంబునకుపోయిరి.

అంతట నాగంధర్వుండు వికృతాకారుండు మహాదంష్ట్రిండు కరాళవదనుండు మహానిర్దయుండై సంచరించుచు చక్రతీర్థసమీపంబున తపంబొనరించు గాలవుని భక్షించబోయి చక్రంబుచే ఖండితమస్తకుండై దివ్యదేహధారియై విమానారూఢుండై సంజలిబద్ధుండై చక్రంబును స్తోత్రంబు సేయుచు నాకాశమార్గంబున సుదర్శనుండు స్వర్గంబునకేగెనని చెప్పిన యాశ్చర్యంబునొంది చక్రతీర్థప్రభావంబు చెప్పశక్యంబుగాదు మహాత్మయంబు సూతా దేవీపట్టణపర్యంతంబు విస్తీర్ణంబైన చక్రతీర్థంబే

విధంబున విభక్తంబయ్యె జెప్పుమని యడిగిన మునీంద్రులారా పూర్వకాలంబున పర్వతంబులు రెక్కలుగలవై యెగిరి ప్రజాక్షోభంబు గావించిన దేవేంద్రుండలిగి పక్షచ్ఛేదనంబులు సేయుటచే నదిరి పర్వతంబులు సముద్రప్రవేశంబులగుటచే చక్రతీర్థంబు నిండి విభక్తంబయ్యె.

ఇదిగాక నీచక్రతీర్థంబులో విధూముండనువసువు బ్రహ్మచే శపుండై మనుష్యయోనియందుజనించి భార్యయుతాను స్నానంబుచేసి పవిత్రులైరని చెప్పినను సూతా యీవృత్తాంతంబు మాకు వినుపించుమనియడిగిన మునులారా పూర్వకాలంబున నొకనాడు బ్రహ్మదేవుండు సత్యలోకంబులో సావిత్రీసరస్వతీ సహితుండయిన సనకసనందన సనత్కుమార నారదాది మునిజనంబులు సేవింప సిద్ధవిద్యాధర గంధర్వాదిగణంబులు నష్టవసువులుకొలువ నూర్వశీప్రముఖసర్వవేశ్యలునాట్యమాడ నిండు కొలువులో నుండ నలంబుసాయను నప్సరస్త్రీ బహువిలాసంబుతో నాట్యంబు సేయుచుండ వాయువశంబున వస్త్రంబుదొలిగిన మానుమూలంబుబయలై గాన వచ్చిన సర్వజనులు ముకుళిత నేత్రులై యుండిరి.

అప్పుడాయువతింజూచి విధూముండనువసువు హర్ష పులకాంకితశరీరుండయి కామాతురుండై జూచినబ్రహ్మగనుగొని నీవులోలుండవు గాన మనుష్యయోనియందుజనియించుము ఈయలంబుసా మనుష్యస్త్రీయై నీకుభార్యయగును, మీరిద్దరు బహుకాలంబు సుఖించి ప్రభుత్వంబు జేసి లోకవిశ్రుతుండగు కొడుకును గని పుత్రునికి రాజ్యాభిషేకంబు చేసి మీరిరువురు చక్రతీర్థంబులో స్నానంబాచరించి ముక్తులగుదురని బ్రహ్మ శాపాంతంబును కృపచేసి.

ఆవిధంబున వారుమనుష్యులై కౌశాంబీనగరంబులో ప్రభుత్వంబు జేసి చక్రతీర్థస్నానంబున పవిత్రులైరని చెప్పిన సంతోషించి సూతా చక్రతీర్థంబు దేవీపట్టణ పర్యంతంబుగలదని జెప్పితి నాపట్టణంబునకా నామం

# ౧౬ శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.

బెట్లు సంప్రాప్తం బయ్యె నా కథా విస్తారంబు వినుపింపుమని యడిగిన మునులారా శ్రీరామచంద్రుండు సేతుప్రారంభ కాలంబున నవగ్రహస్వరూపంబులగు నవపాషాణంబుల నెచ్చట ప్రతిష్టజేసెనో నక్కడనే చక్రతీర్థంబునకు చివర॥

అక్కడా తీర్థంబులో స్నానంబుజేసి నవపాషాణ దర్శనంబుల జేసినవారికి సకలకార్య దిగ్విజయంబును పుణ్యలోకంబులు గలుగుటకు సందేహంబు లేదు.

ఆ పట్టణంబునకు దేవీపట్టణంబని నామం బెందుకు వచ్చిన దనిన.

పూర్వ కాలంబునదితిపుత్రుల దేవతలయాలోచనచే విష్ణుదేవుండు జంపిన దితి దుఃఖించి తనబిడ్డతో జెప్పుకొని బిడ్డా దేవతల దుర్మార్గంబుచే విష్ణు విధ్వంసంబున జరిగించెను. ప్రభుత్వంబు దేవతల పాలాయను నీవు తపంబుగావించి ప్రబలుండగు కొమారునింబడసి వానిచే దేవ ధ్వంసంబు గావింపుమని యనేకవిధంబుల వేడిన దితిపుత్రిక మహిష రూపంబు దాల్చి ఘోరారంబగు తపంబుగావించిన సుపార్శ్వుండనుముని సంతోషించి నీకోరిక ప్రకారంబున సకల దేవతానాశకుండును మహాబలవంతుండగు పుత్రుండు జన్మించును.

వానికి ముఖంబు మహిషముఖంబును శరీరంబంతయు మనుష్యాకారంబునైయుండును వానికిమహిషాసుర నామంబు సార్థకంబు పొమ్మని చెప్పిన తదుపరివరప్రసాదంబున మహిషాసురుండుపుట్టిన విప్రసిద్ధ కుమారుండగు విద్యున్మాలి మొదలగు రాక్షసులీకథవిని మహిషాసుర నీవు వర ప్రసాద పరాక్రమ ప్రవీణుండవుగాన దేవతలు సుఖంబుగా స్వర్గరాజ్యంబనుభవించుచున్నారదిమనమాక్రమించక నుండిన నీబల తేజస్సత్వంబులకు వినియోగంబేమని కోపం బెక్కించిరి.

అంతట వాడు రాక్షససమూహంబుతోఁ గలిసి స్వర్గంబుపై దండెత్తిన దేవదైత్యులకును నూఱుసంవత్సరంబులు ఘోరయుద్ధంబైన దేవతలోడి స్వర్గంబు విడిచి దీనులై బ్రహ్మకడకుం జని తమకష్టంబు జెప్పుకున్న బ్రహ్మ యునాథనంబుతోఁ జక్క నుమారమాపతులున్న యెడ వికేగి దేవతల బాధలు బోధ జేసిన హరిహరులిద్దరు మహాక్రోధ తామ్రాక్షులై యాకాశకసుపై జూచిన నత్యంత క్రోధయుక్తుం డగు విష్ణుముఖంబుచే నొకతేజస్సు వెడలె

వెంటనే శివముఖంబుచే నొకతేజస్సు వెడలె నంతట బ్రహ్మ మొదలగు దేవేంద్రాది దేవతలెందరో నందరి ముఖంబులనుండి యొక్కొక తేజస్సు బయలుదేరి యా తేజ సమూహంబు మేరుపర్వతము భంగి యాకాశంబు ముట్టి యుండ నందులోనుంచి వేరు స్త్రీస్వరూపంబు నిర్గమించెను.

అది ట్లనిన శివతేజంబున ముఖంబును విష్ణుతేజంబున భుజంబులు బ్రహ తేజంబున చరణములు నింద్రతేజమున నూరు మధ్యము వై వస్వతమున కేశంబులు చంద్రతేజంబున కుచంబు వరుణతేజంబున జంఘోరులు పృథ్వీ తేజంబున నితంబంబు నర్క తేజంబున పాదాంగుళులు వసుతేజంబుల కరాంగుళులు కుబేరుని తేజంబున నాశిక నవ ప్రజాపతుల తేజంబుల దంతపంక్తు లగ్ని తేజంబున నేత్రద్వంద్వంబును వాయుతేజంబున స్కంధ భ్రూ శ్రవణ యుగళంబులయ్యె. ఇతర దేవతల తేజస్సులచే సమస్తావయవ పరిపూర్తిణియై మహాజ్వాజ్వల్యమాన తేజోపరాజితయై యొకదేవి వెడలిన మహిషాసుర మరణకారణంబై యీ మగాదేవి యుద్భవించినదని దేవత లఖండంబగు సంతోషంబు నొందిరి.

తనుపరి ఈ దేవికి నర్చన ధనవస్త్ర భూషణాదులు సమర్పించిన సమస్త భూషణాలంకార భూషితయై మనోహరాకారంబుతో నతిభీషణంబగు నట్టహాసంబు గావించి సకలలోకంబులు కంపంబు నొందె పరిచారకలందరు నంజలి

బద్ధులై యెదట నిల్చిరిప్పుడు రుద్రాది దేవతలందరు స్వకీయ్యంబుల గునాయుధంబులలో శూలాది సాధనంబు లొక్కొక్కటి యొసంగిరి.

అంతట నాయుధంబులు ధరించి సింహవాహనా రూఢయై సుర ముని విద్యాధర గంధర్వాది దేవబృందంబు జయజయ పూర్వక స్తోత్రంబులు జేయుచుండ నప్పుడు మహాప్రళయ ఘోరాపభీకర సింహ నాదంబు జేసిన దైత్యులువిని మూర్ఛిల్లికొంతదడవునకు ధైర్యంబులు దెచ్చుకొని యాయుధంబులు గైకొని మహిషాసురుని ముందునిడుకొని యుద్ధసన్నద్ధులై నిలిచిభైరవనాదంబు లొనరించుచుండిరి.

అనంతః మాదేవి త్రిలోకవ్యాప్త తేజోనిధియై నాదకంపిత స్వర్గ మర్త్య పాతాళయై మహా భీషణాకారయై నిల్చిన మహా సంకుల సమరంబయ్యె నప్పుడు లక్షకోటి సహస్ర పరిమితులగు రాక్షస నాయకు లొక్కపెట్టున దేవిపైనడరి జట్టిముట్టి బాణవర్షంబు గురిపించిన నద్దేవి చలించక నాబాణంబుల తనబాణపంక్తిచే ఖండంబులుజేసె దైత్యుల శరీరంబులు ఖండంబులు గావించె నా ప్రచండాదండంబులు చండిక బాణపాతంబులకోర్వక రాక్షసులు పలాయనంబునొందిరి.

పిమ్మట ననురులనిర్మూలనంబుగావించి మహిషా సురుడు క్రోధ సంరక్తలోచనుడై చాపంబుగైకొని దేవేంద్రునిమీద దశసహస్ర బాణంబులునుయమునిపై పంచసహస్రంబులుబరపిన దేవకోటిలో నొక్కొక్కనిపై పదేశివేల లెక్కచే నందరిపై బాణంబులు బరగించిన దేవత లందరు భీతులైమహిషాసును నెదుగు నిలువజాలక పలాయనులై మహా దేవిని శరణంబు జొచ్చిరప్పుడు భద్రకాళి మహా సారవంతమగు శరాసనంబు గైకొని యతని సమానమగు బాణంబులు బరిగించిన మహిషాసురుని మంత్రులు, మహానాదుడును, సుచక్షువు, మహాహానుడును, మహాచంద్రుడును, మహా భక్షుడును, మహానాదరుడును, మదోత్కటుడును,

పంచాస్యుండును, పాదచూషుఁడును బహూనేత్రుఁడును, ప్రబాహుడును, యేకాక్షైక పాద బహుపాదులు మొదలగువారు యుద్ధ సన్నద్ధులై జగదంబ కెదుటనిలిచిరి.

అంతట దేవివారిని కాలాగ్ని రుద్రనేత్ర సదృశంబులగు నేత్రములతోఁ జూచి వజ్రసమానంబులు కాంచన పుంఖితములగు శరములు నిగుడించియామమాత్రములోనందరినిరూపుమాపినచండకోప, బాష్కళ, మదోన్మత్త, ప్రభృతిసేనానాయకులు వచ్చిననందరినిక్షణంబులో యమాలయంబునకంపిన మహిషాసురుండు క్రోధయుక్తుఁడై ప్రళయకాలయముఁడునుఁబోలె సైన్యంబులదూలదోలి దేవీవాహనంబగుసింహంబును హరింప నిశ్చయించి సన్నద్ధుఁడై పైకివచ్చె.

ఆమహాదేవికోపోద్దీపిత మానసయై ప్రచండమగు ఖడ్గంబు గైకొని బరిచూర్ప సింహంబునడరించిన మహిషాసురుడును సింహస్వరూపుండయి నెదుర్కొనియె, నప్పుడు దేవివాని పాశబద్ధునిఁగావించిన ఖడ్గ హస్తుఁడయి యెదుటనిలిచె నప్పుడు దేవి బాణవర్షంబు గురిపించి వాని చీకాకు పరిచిన బెదరి గదస్వరూపుఁడయి పైకురికినదేవీవాహనముగుసింహంబు వాని శరీరంబు ఖండంబులు జేసిన నప్పుడు మనుష్య రూపుండయిన దేవి ఖడ్గంబుచే వానిబాహువు నరికిన వాడునిజస్వరూపంబుగైకొని శైల శృంగంబులతో సరియగు తనశృంగంబులు విదళించుచు పైకివచ్చెను.

ఓరాక్షసాధమా నేను మధుపానము జేయుదనుక నీగర్వంబును మాపుమండుమని యదల్చుచు క్షీరపానంబొనరించి కృపాణంబుచేబూనిన వాడు కార్యవశీకుఁడయి పలాయనుండయిన జగదంబ సింహము నురికించి నిబిడతరంబగు ముష్టిప్రహరంబు గావించిన వాడు నిర్దళిత హృదయుండయి మహాభయపరిభ్రాంతుండయి ధైర్యంబుజాలక దక్షిణ సముద్రతీరంబున మహేంద్రాద్రిప్రాంతంబునకు పారిపోయెను.

## ౨౦ శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.

దేవియు మహా వేగముతో సింహంబు నురికించిన నిలువ జాలక దశయోజనాయామము గుధర్మపుష్కరిణిలో దేవీపట్టణసమీపంబున నంత హీనతుండయిన భద్రకాళీ దేవియు కూడ నురికి చూచినమహిషాసురుడు గానరాక యుండిన నాలోచించుచుండ నాకాశవాణి యో జగన్మాతా భవన్ముష్టి ప్రహారంబుచే వాడువెరచి ప్రాణరక్షణ తత్పరుండయి ధర్మ పుష్కరణీ జలంబులో దాగియున్నవాడని పల్కవినవచ్చెను

అందుకామె సంతసించి తన వాహనమగు సింహంబున కాజ్ఞాపించిన నది క్షణంబులో పదియామడ నిడుపుగల జల బుపానంబు గావించె సలిలంబు నిశ్శేషంబయిన రాక్షసుండు దీనుడయి వచ్చుచున్న మహిషాసురుగని దేవిశూలంబుచే బొడిచి భూమిపై దొల్లించి శిరంబు పాదంబుచేద్రొక్కి కృపాణంబుచే శిరంబు దెగవ్రేసిన మృతుండయ్యె నప్పుడు దేవవిద్యాధరకిన్నరకింపురుషాది దేవసంఘంబులు మహానంద భరితులయి మహాదేవిని స్తోత్రము లనేకవిధంబుల జేసిరి.

అప్పుడా దేవేంద్రాది దేవతలు దేవియాజ్ఞా ప్రకారంబున నమృతంబుతో ధర్మపుష్కరణికంపిరాసమీపంబున తననామంబుతో దేవీపట్టణమనియొక్కగొప్పపురమునిర్మాణంబుగావించె నందుచే నదిదేవీపట్టణమని ప్రసిద్ధమయ్యె.

తదుపరి శ్రీరామచంద్రుండు సేతుబంధన తత్పరుండయి మంచి ముహూర్తమున విఘ్నేశ్వరపూజ లొనరించి తిలకస్వామి పూజ లొనరించి నమస్కరించి నవపాషాణంబులు స్వహస్తంబుచే స్థాపించె నక్కడ స్నానంబుజేసినవారికి పాపక్షయ మగుటకు సందేహంబు లేదు సత్యమ్ సత్యమ్ పునస్సత్యమ్.

తదుక్తమ్ స్కన్దపురాణే సేతుమాహాత్మ్యే ॥ దేవిపట్టణ మారభ్య సుముహూర్తే దినేద్విజాః । విఘ్నేశ్వర ప్రణమ్యామి తిలకస్వామి

నమ్ తథా । మహాదేవ్యాభ్యనుజ్ఞాతో రామచంద్రోతి ధార్మికః స్థాపయి త్వాస్వహస్తేన పాషాణనవకం యథా । సింహాసనం సమారుహ్య రామో నలంకృతం శుభమ్ వానరైః కారయామాస సేతుమబ్ధౌ జలాదిభిః। దశయో జనవిస్తీర్ణమ్ । శతయోజనమాయుతమ్ । సేతోశ్చ పశ్చిమాః కోటి ర్దర్భ శయ్యా ప్రకీర్తితా। దుర్గాపురీచ ప్రాక్కోటిర్దర్భశయ్యా ప్రకీర్తితా॥ దుర్గాపురీచ ప్రాక్కోటి రభయమ్ సేతుమూలకమ్ । దేవిపురే తథా దర్భశ య్యాయామపి భూసురాః। చక్రతీర్థే శివే స్నానమ్ పుణ్యమ్ పాపవినాశకమ్। స్మరణాదుభయత్రాపి చక్రతీర్థస్య వై ద్విజా । భస్మీభవన్తి పాపాని జన్మలక్షా ర్జితాన్యపి । జన్మాసివిలయమ్ యాతి ముక్తిశ్చాపి కరేస్థితా । చక్రతీర్థసమమ్ తీర్థమ్ భూతలేన భవిష్యతి । క్షేత్రే పిండం తతః కుర్యాచ్చక్రతీర్థే తథైవచ॥

ఇవ్విధంబున దేవిపట్టణమున దర్భశయనమున స్నానదాన పిండ ప్రదానాది సత్కార్యంబులు జరిగిన్చి

శ్లో॥ రఘువీరపదన్యాసపవిత్రకృతపాంసవే । దశకణ్ఠశిరచ్ఛేదహేతవే సేతవే నమః। సేతవే రామచంద్రస్య మోక్షమార్గైకహేతవే సీతాయా మానసామ్భోజభానవే కామధేనవే।

శ్లో॥ సాష్టాంగప్రణిపత్యాదౌ మంత్రేణానేన వైద్విజాః । భేతాళవరదం తీర్థం తతో గచ్ఛేన్మహాజలం॥

మునీంద్రులారా యీశ్లోకంబుల జదివి సాష్టాంగ ప్రణామంబాచరించితమపరి భేతాళ వరదతీర్థంబునకు బోవలయు నిక్కడికి చక్రతీర్థ మాహాత్మ్యంబు సంపూర్ణము.

శ్లో॥ యోధ్యాయ మేనం పరతే ద్విజేంద్రాశ్శృణోతి వాభక్తియుతోమనుష్యః। స్వర్గాదయస్తస్య న దుర్లభాస్యుః కైవల్యమప్యస్య కరస్థమేవ।

ఇవ్విధంబున చక్రతీర్థంబునం స్నానంబు జేసినవారికి కైవల్యంబు లభించును.

## ౨౨ శ్రీసేతురామేశ్వర మాహాత్మ్యము.

—*భేతాళవరద తీర్థమహాత్మ్యము*—

మరియు చక్రతీర్థకథవిని సంతోషించి సూతా చక్ర తీర్థంబు నకు దక్షిణంబున భేతాళవరదంబను తీర్థంబు గలదని జెప్పితివాతీర్థం బెచ్చటనాతీర్థోద్భవ కారణంబెట్లు నావృత్తాంతంబు సవిస్తరంబుగా జెప్పుమనియడిగిన సంతోషించి మునీంద్రులారా పూర్వకాలంబున పార్వతీదేవికి పరమేశ్వరుండుజెప్పి నాకథ మీకువినుపింతు సావధానచిత్తులరై వినుండు.

పూర్వకాలంబున గాలవుండను మహర్షిపరబ్రహ్మోపాసనజేసే మహాధన్యుండతని కన్యక కాంతిమతియను చిన్నది బహు యోగ్యురాలు పితృసేవసేయుచునాశ్రమంబులోనుండి దేవతార్చనకు పుష్పంబులుగోయు కొరకు వనంబులో దిరుగుచు వెదకుచుండ నింతట సుదర్శన సుకర్ణులను వారలిద్దరు గంధర్వ పుత్రులాకాశమార్గంబున విమానారూఢులై సంచరించుచు నాసమయంబున గాలవపుత్రిని మహా సౌందర్యశాలినిలావణ్యవతినిజూచి మోహించి మనస్సు నిలుపజాలక విమానంబునుంచిదిగి యో కన్యాకా నీవెవ్వరి కూతురవు నీ పేరెయ్యదియరణ్యంబులో నొక్కతెవు సంచరించుటకేమి హేతువ జెప్పుమని యడిగెను.

అయ్యా నేను గాలవమహాముని తనయను కాంతిమతియనినాపేరు, దేవతార్చనంబుకొరకై పుష్పంబులు గోయుచున్నానని జెప్పినవిని నేను గంధర్వపుత్రుండను సుదర్శనుండను నా పేరు నీయందునాకు మక్కువ గలిగినది నన్నువరించవలయునని యడిగిన నాచిన్నది మీరు దేవతలుమీ రెరుగని ధర్మంబులు లేవు కన్యక లస్వతంత్రలు గాన తండ్రి యెవ్వరికిచ్చితె వారు నాకు పతియగు మాతండ్రిగారి నడుగవలయును పూజాకాలంబు మిగిలినది పోవలెనని చెప్పెను.

తథాచోక్తంస్కాందే॥ శ్లో॥ కన్యాశ్చపితృధీనాస్స్వర్న స్వతంత్రా॥

కదాచన । యదిమామిచ్ఛసిభర్తా పితరంమమయాచయః॥ ఇతి॥ వ॥ ఇవ్విధంబున గంధర్వునకుం జెప్పి పుష్పంబులు వట్టుకొని పోవునెడల కేశంబులు హస్తంబున నొడిసిపట్టిన నాకన్య భయభ్రాంతురాలై యాకాశంబు ముట్టి యాక్రోశంబు జేసెను.

ఆధ్వనివిని గాలవుండును తక్కిన ఋషు లతిత్వరితగతి నేతెంచి సుదర్శనుంజూచి యోరిపాపాత్మా నీవు క్రూరుండవు గాన మానుష యోనియందు జన్మించి కొన్నిదినంబులలోనే భేతాళశరీరంబునొందుమని శాపంబిచ్చి కుమార్తెను దోడ్కొనిపోయెను.

తదుపరి సుదర్శనుండును సుకర్ణుండును దుఃఖించి యమునాతటంబున గోవిందస్వామియను నొకబ్రాహ్మణుని తమకు తండ్రిగా నేర్పరచుకొని యాతనిగర్భంబున జన్మించి సుదర్శనుండు విజయదత్తుం డనియును సుకర్ణుం డశోకదత్తుండనియు నామంబులచే వృద్ధిబొందుచు నుండిరి.

అంతటయమునాతటంబున ననావృష్టి దోషంబునదుఃఖితరంబైనను కాశీపట్టణంబునకు భార్యాపుత్రసహితుండై పోవుచు ప్రయాగజేరి ముందర కపాల మాలాభరణాది శోభితుండగు నొక వ్రతినిజూచి నమస్కారంబుజేసినయందరి కత డాశీర్వచనంబులుజేసి గోవిందస్వామితో నీ జ్యేష్ఠపుత్రుండగు విజయదత్తునకు మీకు కించిత్కాలంబులో వియోగంబు గలుగునని జెప్పిజనియె.

అంతట సాయాహ్నంబగుటయు నొక శూన్య దేవాలయంబులో విడిదిజేసి శయనించియుండ నియమించుకొనియుండసంధ్యాదికృత్యంబులు నిర్వర్తించుకొని శయనించియుండ విజయదత్తుండు తండ్రినింబిలిచి యో నాయనా శీతజ్వరబాధచే చలికినోర్వజాలక నగ్నిహోత్రంబుదెచ్చిజ్వాల గావింపుమనుచు దీనుండై దుఃఖించిన తండ్రిగ్రామంబంతయుదిరిగి పుత్రా గ్రామంబెల్లద్రిమ్మరితి నర్ధరాత్రి యెక్కడ నగ్నిహోత్రంబు దొరక

లేదని చెప్పినవిసక నాక్రోశించి చూచి యోతండ్రీయదిగోనగ్ని హోత్రం భాకాశంబు ముట్టి మండుచున్న దందులో నింతజ్వాల దెమ్మనినపుత్రా యది శివదహనజ్వాల చితాగ్ని యపవిత్రంబు గాన నంట గూడదని జెప్పెను.

తండ్రీయగ్ని హోత్రంబున కంటున్నదా లేదనితాను లేచి నడిచిన తండ్రియైన గోవిందస్వామియు వెంటనంటిపోయె నిద్దగుచితాగ్ని దాపుకు పోయికూర్చుండి సితబాధ తీరినపిమ్మట శిరోభాగంబుకై కూర్చుండి నాయనా యిది గుండ్రటిమంట మహాతేజస్సుగలిగియత్యుగ్రంబై రక్తంబు వగిది నెర్రనై వెలుగుచున్నదదేమనిన తండ్రిజూచి తనయా యది కపాలంబున తాకిన మాంస రక్తాది మిళితంబై రక్తకమలంబురీతిని మండు చున్నది. దానికి నీవు దూరంబు గానుండుమని తండ్రి జెప్పియు వినక స్ఫుటంబగు కాష్ఠంబుచే బొడిచిన రక్తంబును మెదడును స్రవించుటచే మంటమెక్కువైననావిజయుడత్తుండు రెండుచేతుల నెత్తి యీజ్వాల పానముచేసి తండ్రి జూచుండగానే నచట కుటిల కరివ మహోజ్వాల భీషణాకారుండై భూనభోంతరాళంబులు బగుల భయంకరారావంబుజేసి మహాదంష్ట్రిలు నవ్వులుచు నాకాశంబుపై కెగిరి భేతాళ స్వరూపంబు నొంది భూమిపైకివచ్చితండ్రిని గబళింపబోయిన మహార్తినొంది యేడ్చుచున్న వలదువలదని యాకాశవాణీవార్తవినబడ్డతండ్రినొదిలిమహావాయువేగంబుననతిక్రమించినట్లాకాశంబు కెగరి భేతాళ బృందంబులో గలిశినవారందరితని పూర్వోత్తరంబు పరీక్షించి కపాలస్ఫోట భేతాళ నామము నిర్ణయించిరి.

అంతపై యీతడు విజృంభించినరాస్థిభూషణుండను భేతాళరాజు తోగలిశి తన ప్రాబల్యంబు గనపరిచిన సంతోషించిసేనానాయకునిగజేసిన ననేక యుద్ధంబులలోనుద్ధండుడై మెప్పునొందుచునుండె అంతట చిత్రసేనుండనుగంధర్వునితో యుద్ధసన్నద్ధుడైఘోర యుద్ధములో నరాస్థిభూషణు

డను బేతాళరాజు మృతిబొందిన నీకపాలస్ఫోట భేతాళుండా పీఠంబు నధిష్ఠించి తాను రాజై నిలిచెనని జెప్పిన

సూతా యతని తల్లిదండ్రులు భ్రాతయు నేమైరనియడిగినమునులారా యత డాకాశంబునకు నేగిరిపోయిన పిమ్మట తండ్రి దుఃఖించుచు శయనస్థలంబునకువచ్చి భార్యకు రెండో కుమారుడగు నశోక దత్తున కీ కథావృత్తాంతంబంతయువినిపించిన వారందరు మహాదుఃఖాక్రాంతులయియుండ కాశీపట్టణ నివాసుడగు సముద్రదత్తుండను నొకవైశ్య రత్నంబు వారిని జూచి దుఃఖోపశమన వాక్యంబులుజెప్పి తన యింటికి దోడ్కొనిపోయి వారిని సంరక్షణజేయుచుకొన్నిదినంబులకు తనధనభాండాగారంబులకు గోవిందస్వామిని ముఖ్యకార్యకర్తగా నొనర్చి సమస్తకార్యంబులతనిచే నడిపించుచుండెను.

అనంతరము తన రెండవకొమరుం డశోకదత్తుండు శస్త్రశాస్త్రప్రవీణుండై మల్లయుద్ధంబుల దక్షుండై విఖ్యాతుండైన నంతకో కాశీదేశాధీశ్వరుండగు ప్రతాపముకుట మహారాజన్యునికడకు ప్రచండుం డను నొకమల్లుండువచ్చి ద్వంద్వయుద్ధంబుగోరిన నారాజతని బిలిచి ద్వంద్వయుద్ధంబున కొప్పించిన బహునంతోషంబుతో సవ్యాపసవ్యంబుల కేశాకేశీ ముష్టాముష్టీ బాహాబాహీ ప్రభృతి మల్లయుద్ధంబులో ప్రవీణుండయి యామల్లుని బరిమార్చిన రాజు మహైశ్వర్యము నొందినతనిప్రాణతుల్యుని గాజూచుచు సమస్తకాలంబుల తవసన్నిధానంబులో వదలకుండెను.

మరికొన్ని దినంబులకు గ్రామంబు వెలుపలసాయంకాలంబునవిజనుండయి పాదచారియై యశోకుండును దానును సంచరించుచుండ నాల్గు దినములనుంచి శూలస్థుండనై ప్రాణంబుపోకతృష్ణాపీడితుండనయి యున్న నాకు శీతలజలంబిచ్చు పుణ్యాత్ములనెవరిని గాననైతినని యాక్రోశించుదీన ధ్వనివినబడెను దానికారాజు కరుణాదరణీయ హృచయుండయి చాల

నొచ్చుకొని యశోకదత్తాసీవు మహాధైర్యశాలుండవు బ్రాహ్మణుండవు దీన సంరక్షణకర్తవ్యము నీవే యాతనికష్టముదీర్చిరమ్మని వినయముతో జెప్పిన రాజాజ్ఞశిరసావహించి తత్క్షణమేగి జూచిన శ్మశాన వాటికలో భూతప్రేత భేతాళసంకులస్థలంబున శూల పోతునిం గాంచి జలంబిచ్చు నుపాయము జూచుచుండెను

ఆసమయములో నాశూలంబుక్రింద నవ యౌవన శాలిని సుంద రాంగని రతీదేవిని మించిన కాంతిగలుగు నొక స్త్రీనిజూచి యోసుం దరీ యీశ్మశానవాటికలో నొంటరిగా సంధ్యా కాలంబుననుండితి వెవ్వరు నీవేరేమని యడిగిన నో శూరా యీశూలస్థుడు నావల్లభుడితనిరాజు శూలస్థాపితుని గావించె నితని నొదలజాలక దుఃఖించుచున్నదాన మాటి మాటికి దాహంబునకు నీరడుగుచుండిన నుదకమందివ్వ శక్తిజాలక దుః ఖించుచున్నానితని ప్రాణంబులుబోవు, నేను జలంబులుబోయజాలననుచు వ్యధపడుచుంటి ననెను

నోతల్లీ నాభుజంబుపైనీవెక్కి జలము లతని కందివ్వుమనిజెప్పి నం తలో బహువేగమున స్తంభమువలెనిలిచియున్నసతని స్కంధముపైనెక్కి జలములందిచ్చు సమయములో రక్తంబు స్రవించిన యశోకదత్తుండుదాని ముఖంబుజూచి రాక్షసిగానెరిగి దీనివిడవగూడదని వానిపాదమున నున్న నూపురము తన హస్తమున బిగబట్టిన నాసుందరి నూపురంబులో నుంచి పాదంబొదల్చుకొనిపోయిన ననేక రత్న చిత్రితమగు నానూపురంబు గై కొని రాజువద్దికివచ్చి యావద్వృత్తాంతంబు విన్నవించిన మహాశ్చర్యంబు నొంది దేవతలయిన నిట్టి సాహసంబులు జేయజాలరని మన్నించి యా నూపురంబు తనవద్ద నుంచుకొనెను

తదనంతరము మదనరేఖయను తనకూతును నిచ్చి వివాహంబుజేసి సుఖంబుగానుంచి కొన్నిదినంబులకునల్లుని బిలిచి యీనూపురమునకు జత

పొందిన నూపురంబెట్లు లభ్యంబౌనని యిష్టాగోష్ఠిలో నాలోచించిన నశోక దత్తుండు చింతించి యిది శ్మశానవాటికలో నా స్త్రీయొద్ద దొరికినది దీనికి సదృశంబెక్కడ దెత్తునని విచారించి శ్మశానవాటికలో మనోహర మగు మాంస మమ్మితినేని మాంసాశకు మునుపటి ముద్దియ నేగుదెంచు నప్పుడానూపురంబుహరించు సాధనంబు గావించ వచ్చునని మహాధైర్యంబుతో భూత ప్రేత పిశాచ భేతాళాదుల తృణీకరించి సాహసంబుతో నామె విక్రయంబు జేయుచుండి దిక్కులు పిక్కటిల్లునట్లు మంచి మాంసంబు గొనుచుండ నార్భాటంబు జేసెను.

భేతాళంబులన్ని గుమిగూడి వచ్చుచుండ నారాక్షసియువచ్చి నిలిచిన నొకపాదంబున నూపురములేమిటచే యనుమానముదగిలి యో చేడీ యా మునుపొక్క నూపురం బొసంగితివి దయచేసి రెండవయం దే నివ్వుమని యడిగిన యా మాటలువిని భీతచిత్తయై యోహోరా బొమ్మని యానూపురంబొసగి విస్మయత్వభయమున తనకూతుచు నొక్క హేమకమలంబును యొసగి జనిన నావిప్రకుమారుడు కన్యాసహితుడై నూపురంబుగైకొని పట్టణంబునకువచ్చి కథా వృత్తాంతమంతయు నత్త మామల కెరిగించిన రాజు పరమానందభరితుడై యల్లుని పరాక్రమంబున కచ్చెరువందుచు మహాస్తోత్రంబు జేసె

మఱియు కొన్నిదినములు జనిన పిమ్మట యశోక దత్తుండు చెలియా యీసువర్ణకమలంబు మీ యమ్మకు యెక్కడదొరికె నీపువ్వేస్థలంబుననున్నవి నాకెరిగింపుమని యడిగిన నోనాయకా యీహేమకమలంబు కపాలస్ఫోటన భేతాళనాయకుని జలక్రీడా సరోవరంబులో మా యమ్మ యెక్కడికిబోయినప్పుడు దెచ్చినదని జెప్పిన నోప్రియురాలా నాసరస్సు నే జూడ నిశ్చయించితి నన్ను దోడ్కొని పొమ్మని బహువిధంబులపీడనంబు జేసిన సంతోషించి తనభర్తయగు యశోకదత్తుని నాకపాలస్ఫోటన భేతాళ

నాయక జలక్రీడా సరోవర సమీపంబునకు దోడ్కొనిపోయెను.

అతండా పాదపద్మంబులు గ్రహింప నిశ్చయించిన నక్కడి కావలి యున్న భేతాళాదులు వెరపించి బెదరించవచ్చిన నందర నీయశోకదత్తుడు దురంతంబులగు తాడనంబులు జేసి విచ్ఛిన్నులం జేసినవిని కపాలస్ఫోట భేతాళనాయకుడు గొబ్బునజను దెంచి యశోకదత్తుని నిగ్రహింప సమకట్టిన నతండు విజృంభించి నీసైన్యంబుజంపిన విధంబుననిన్ను జంపుదు జూడుమని సన్నద్ధుండయి కపాలస్ఫోటన భేతాళనాథునిబట్టి నిర్బంధించి జంప నిశ్చయించెను.

అంతలో నచ్చటికి విజ్ఞప్తి కౌతుకుండను గంధర్వపతి విమానారూఢుండై వచ్చి యోయశోకదత్తా సాహసంబు జేయకుమని నివారించిన నాకాశస్థుండగు విద్యాధర నాయకునిగాంచి నతింపబోవు నంతలో శాపవిముక్తుడై మానుషస్వరూపంబువిడచి దివ్యరూపంబు నొంది విమానారూఢుండై సకలభూషణ భూషితశరీరుండై నిలచినజూచి విజ్ఞప్తి కౌతుకుడోవిద్యాధరకుమార మాదర్శనంబున నీకు శాపాంతంబు గలిగె గావున నీవు స్వర్గంబునకుబొమ్ము నీయగ్రజుండగు నితడు మహాపాతక మొనరించె గావున గాలవ శాపంబు దుస్తరంబు కొంతలో నితనికి శాపాంతంబు గాదీరదని జెప్పిన శాపవిముక్తుండగుటచే పూర్వజ్ఞానంబు నొందివృత్తాంతమంతయు జ్ఞప్తిచేసుకొని సుకర్ణుం డిట్లనియె

ఓవిద్యాధరోత్తమా మదీయ జ్యేష్ఠ భ్రాతనొదిలి నేనొక్కరుడ స్వర్గంబునకు బోనొల్లనని యనేక విధంబుల స్తుతించిన యాతం డాలోచనగావించి దుర్నివారణ మగు నా శాప మోక్షణంబు సేయ నెవరికి శక్యంబుగాదది మహత్తరమగు పాపంబు దానికి సారంబు దొరకదైన నొక్కయుపాయంబుజెప్పెద దక్షిణోదధితీరంబులో చక్రతీర్థంబు మహోత్తమంబగు తీర్థంబుగలదు తత్తీర్థ దర్శన మాత్రంబున సకల పాప

ములు నశించునని చతుర్ముఖుండు సనత్కుమారాదిమునీశ్వరులకు జెప్పెను, కావున నాతీర్థంబులో స్నానంబు జేసినవారి కెంత ఫలంబు సంఘటించునో నాకు తెలియదు గావున నీయగ్రజుండచ్చటికిబోయి దర్శన స్నానంబులు జేసిన నీయగ్రజునకు భేతాళనివృత్తియై విద్యాధరుండగునని నతడు విజ్ఞప్తి కాతుకుని వెంబడించుకొని తనయగ్రజుడగు సుదర్శనుని దోడ్కొని దక్షిణసముద్ర ప్రాంతంబునకు బోయి గంధమాదనపర్వత చక్రతీర్థమధ్యంబులోనుండు తీర్థంబునకుజేరి కూర్చుండి యోయగ్రజా గాలవముని శాపముక్తికొరకు నీ తీర్థంబులో నవగాహనంబు సేయు మని పలుకుచుండెను.

అంతలో దైవానుగ్రహంబున వాయుప్రేరితమైయొక వశీకరంబు కపాలస్ఫోటబేతాళనాయకుని శరీరంబుపై బడిన భేతాళుడు తవంబు మాని విజయదత్తుండనే బ్రాహ్మణరూపంబు నొందె దానంతట పునః యథాశాస్త్రవిధిసంకల్పంబులో స్నానంబు జేసిన బ్రాహ్మణ నిగ్రహంబుబోయి తత్క్షణంబున దివ్యస్వరూపంబు నొంది విమానారూఢుడై సకలాభరణభూషితుడై తేజోమయస్వరూపముతో దేవస్త్రీసమాజ పరివృతుడై విజ్ఞప్తి కాతుకుని చక్రతీర్థంబును ననేక విధంబుల స్తోత్రంబు జేసి తన తమ్ముండగుసుకణుకాని దోడ్కొని స్వర్గంబున కరిగె నాతీర్థోత్తమంబు భేతాళవరదమని ప్రసిద్ధినొందె.

ఏనరుడైన నాతీర్థరాజంబులో స్నానంబుగావించిన పరిశుద్ధుండై జీవన్ముక్తుండగు నచ్చట పిండప్రదానంబు జేసినవానిపితృగణంబులు బ్రహ్మలోకప్రాప్తులగుదురు. తదుక్తం సేతుమాహాత్మ్యే॥

శ్లో. భేతాళవరదంతీర్థం నభూతంనభవిష్యతి।
స్వర్గంప్రయాంతితేనత్వే పితరశ్చాపితత్పితాః॥

# ౩౦ శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.

శ్లో॥ యఃపఠేః మమధ్యాయం శ్రుణుయాద్వా సమాహితః।
ముచ్యతే సర్వపాపేభ్య స్స్వర్గలోకంనగచ్ఛతి॥ ఇతి॥

వింటిరా మునీంద్రులారా దానిమాహాత్మ్యమగమ్యంబు యాత్రికులక్కడ స్నానాది కృత్యంబు దీర్చుకొని గంధమాదన పర్వతంబునకుఁ బోవలయును.

గంధమాదన పర్వత పాపవినాశమాహాత్మ్యము

మహాపుణ్యస్థలంబు గంధమాదన పర్వతంబు సముద్రంబులో సేతువునకు మార్గరూపంబై యున్నది గావున నాపర్వతంబు నెక్కలేనివారికి బ్రహ్మలోకగమనమార్గంబునకదియె సాధనంబని విశ్వకర్మచే విఖ్యాతంబయ్యెశతసహస్ర లక్షకోటిగణనలు గలిగిన సరస్సులలోగాని నదులలోగాని సముద్రంబులలోగాని వేదారణ్యాదిపుణ్యక్షేత్రంబులలోగానియాపర్వతంబుపై నెక్కినమాత్రంబున నగమ్యాగమన బ్రహ్మహత్యాదిపాపంబులు నివర్తించినట్లు కొదవవాటిలో నశించవు.

మునులారా నేనేమి జెప్పుదును శ్రీదేవీ భూదేవీ సహితుండై విష్ణు దేవుండును సావిత్రీ సరస్వతీసహితుండై బ్రహ్మదేవుండును గణపతి షణ్ముఖాదులును దేవేంద్రాది దేవతలు నాదిత్యాది నవగ్రహంబులు వశిష్టవాలఖిల్య విశ్వామిత్రాది మహామునులును సేవించి యుందురు. సతతంబును మహాదేవుండు గౌరీసమేతుండై విచారంబు చేయుచుండు.

ఆధరాధరంబనాడియు సర్వమునిగణసేవ్యంబును తుంగ తరంగాభీలసముద్రసేవితంబై యొప్పుచుండు తదీయమారుతస్పర్శ మాత్రంబున కోటిమహాపాతకంబులు అగమ్యాగమనాగనీపర్వతప్రతిమహాపాతకకోటులు దేహాకలితంబులగు నవియును నశించు అంతువానరసేనానాయకుండగు నలుండు రామాజ్ఞచే సేతువొనర్చి నాసేతుగంధమాదనంబులదర్శించువారాధరాధరంబునకు వందనంబులుగావించి వో ధరాధరేంద్రోత్తమా

నీవు బ్రహ్మ విష్ణ్వాది సమస్తదేవతా సేవితుండవు నిన్ను మదీయపాదంబుల ద్రొక్కుటచేతం గలుగు పాపపుంజజంబు విదళించి దక్షిణపు ముఖవఘ్ఖిఖరాగ్రవాసియగు శంకరు దర్శింపుమని యివ్విధంబునం బ్రార్థించి సేతురూప తన్నవగారోహణంబు గావించి తత్తీరంబున సముద్రస్నానంబులొనరించి సీమామాపత్రకంబులు శమీదళ నమృశంబులగుపిండంబులిడిరేని వారిపితరులు కల్పక్షయపర్యంతంబును దృప్తినొందుదురు మరియువారలు స్వర్గస్థులయియున్న మోక్షంబును నరకగతులయి యున్న స్వర్గంబు నొందుదురు.

ఆపర్వత రాజంబునందు లో ప్రసిద్ధంబును సర్వ తీర్థోత్తమంబును పుణ్యతమంబును పాపవినాశంబను నొకతీర్థంబుగలదు తత్తీర్థ స్మరణంబు గావించినవారలు గర్భవాసంబునొందనోప రందు స్నానంబు గావించిన వారలు నిర్మలులగుచు వైకుంఠపదంబు నొందుదు రిందుకుసందియంబు లేదనిన పౌరాణికుంగాంచి ఋషులిట్లనిరి.

ఓ మహాత్మా పాపవినాశనాఖ్య తీర్థప్రభావంబును వచింపు నీవు వ్యాసబోధితుండవుగాన సకలంబు నెరుంగుదువనిన నతండిట్లనియె

ఓమహర్షులారా వినుండు హిమవత్పర్వత సమీపంబున బ్రహ్మాశ్రమంబునందు జరిగిన వృత్తాంతంబు దెలిపెదసమీపంబునబహుళ లతాకీర్ణంబును క్రూరమృగ సంకులంబును మదగజ పరివారితంబును సిద్ధచారణసేవితంబును రమణీయంబును పుష్పిత కాననంబును వియమవ్రతపరాయణ బ్రాహ్మణపరిశోభితంబును సూర్యప్రకాశ తపోబలలయప్రకాశితంబును యజ్ఞదీక్షితవేదాధ్యయనసంపన్న శోభితంబును బ్రహ్మచర్యగృహస్థవానప్రస్థయత్యాద్యాశ్రమనిష్ట విభాసితంబును మరీచివాలఖిల్య పరివేష్టితంబై యొప్పు నొక యాశ్రమంబుగల దచ్చటికి సాహసవంతుండగు దృఢమతియను శూద్రుండరుదెంచి దేవకల్పులగు నమ్మహారుషులకు వంద

నంబులంగావించి వారలచే బూజింపంబడి వారలు చేయుచుండు యజ్ఞా దులంగాంచి దానుందపంబుగావింపగోరి యమ్ముని మండల శ్రేష్ఠుండ గులపతియను మహాత్ముంగాంచి యో తపోధనా నీకువందనంబు లొన ర్చెదనన్ను గరుణాదృష్టిచేతం గావుము నే నవరవర్ణ జాతుండమీకు శు శ్రూషణంబు గావింప నేతెంచితి బ్రసన్నుడవై నాచేతయజ్ఞాదులం గా వింపుమని యివ్విధంబునం బలికిన దృఢమతి వాక్యంబులాలించియత్తపోధ నుండిట్లనియె.

వోదృఢమతీ హీనవంశజుండగు శూద్రుండు యాగదీక్షితుండగు టకు శాస్త్రపాఠంబు నభ్యసించుటకుం దగడు గాన బ్రాహ్మణ శుశ్రూ షం గావింపుము జాతిహీనున కుపదేశింపందగ దట్లుపదేశించిన యుపా ధ్యాయుండు దోషంబులం బొందుం గాన నాయుప దేశించునట్టిబ్రాహ్మ ణుని విప్రులు చండాలునింబోలె పరిత్యజింప వలయు మరియు మన్వాదు లచే శూద్రకులజులకు ధర్మంబు ద్విజశుశ్రూషణంబని చెప్పబడియున్న దిగాన నట్లుగావింపుమనిన విని యాశూద్రుండుశ్రద్ధాసహితంబుగా తపం బుచేయుంగోరిన నిత డంగీకరించక బోయె నైనను నేతపంబు గావించె దనని నిశ్చయించి కొంతదూరంబుబోయి యచ్చట నొకపర్ణశాలంగా వించి దేవతాగారం బొనర్చి తత్సమీపంబున నొక తటాకంబు ద్రవ్వియొ కపుష్పారామంబు గావించి తపస్సిద్ధింగోరి శ్రద్ధాయుక్తుండై తపంబు గా వింపుచు దేవపూజలు సేయుచు నియమోపేతుండునుజితేంద్రియుండును కందమూల ఫలాశనుండు నతిథి పూజకుండునై యుండగొంత కాలంబా యెనట్టియెడ గర్గవంశ సమ్భూతుండును జితేంద్రియుండును నగు సుమతి యను మునీంద్రుడాతని యాశ్రమంబున కేతెంచిన యతండామహాముని నిం బూజించి ఫలాదులచే సంతుష్టుంగావించి కుశలంబడిగిన నతండా శూద్రునాశీర్వదించి నాశ్రమంబునకుంబోయి ప్రత్యహం బతనియందు

విశ్వాసంబుచే వానియాశ్రమంబునకు వచ్చుచుంబోవుచుయతండుగోరిన యతనిచే యజ్ఞాదుల సేయించిరహస్యమంత్రోపదేశంబులంగావించియా శూద్రునిచే పోషితుండై యుండె నిట్లుండి కొంతకాలంబునకా బ్రాహ్మణుం డు మృతుండై యమకింకరులచే నరకంబులంద్రోయబడియనేకకల్పసహ స్రసంవత్సరంబు లాబాధల ననుభవించి పిదప భూమియందొక వృక్షంబై పుట్టి పిమ్మట గర్దభ విడ్వరాహ సారమేయ రూపంబులనొంది తరువాత చండాల శూద్రవైశ్యక్షత్రియ యోనులందుద్భవించి కడపట విప్రుండై యవతరించిజన్మాష్టమంబునందు వుపనీతుండై వేదాధ్యయనంబొనరించుచుండి యొకానొక కాలంబున బ్రహ్మరక్షస్సుచే పీడితుండై విలపించుచు భ్రమిం చుచు వేదబాహ్యుండై కర్మశూన్యుండై యుండు నతని జనకుండు దుఃఖా క్రాంతుండై యబ్బాలుందోడ్కొనియగస్త్యమహామునిసమీపంబునకుం జని నమస్కరించి యోమునీంద్రా నాకీపుత్రుండుదప్ప పితృఋణంబవమో దింప మరియొకండు లేడు భవాదృశులగువారలు పరోపకారశీలురై యుం దురుగాన నితనింగాంచి రక్షింపవేయు రియనేకవిధంబుల వేడిన నాబ్రా హ్మణుంగాంచి యగస్త్యుండిట్లనియె.

ఓ బ్రాహ్మణోత్తమా, యీబాలుండు పూర్వజన్మంబున సుమతి యను బ్రాహ్మణుం డితండు వయిదికకర్మంబులను మంత్రంబులశూద్రున కుపదేశించి మరికొన్నిదినంబులకు మృతుండై తత్కారణంబున యనేక సహస్రవర్షంబులు నిర్ణయ బాధలంబొందిపిమ్మట స్థావరాదిజన్మంబులం బొంది యిప్పుడు బ్రాహ్మణుండై భవత్పుత్రుండయ్యె నితండు పూర్వజన్మ కృత పాపంబుచే బ్రహ్మరక్షోగృహీతుండై యున్నవాడు గాన నొక యుపాయంబు వచించెదవినుము. దక్షిణ సముద్రతీరంబున సేతురూపం బును సమస్తదేవతాసేవ్యంబును పాపనాశనంబగు గంధమాధనంబను నొకపర్వతరాజంబు గలదు. తన్మార్గంబున నొకతీర్థం బున్నయది.

అక్కడ దర్శనంబులు జేసుకొని తరువరి పాపవినాశినీ తీర్థం

బునకు బోవలయునని చెప్పెను.

## పాపవినాశనీతీర్థమాహాత్మ్యము.

ఓసూతా యాతీర్థమాహాత్మ్యంబు సక్రమంబుగా వినుపించు మని యడిగిన సూతుండు సంతోషించి మునీంద్రులారా పూర్వకాలంబున హిమవత్పర్వత సమీపములో బ్రహ్మాశ్రమమునజరిగినవృత్తాంతంబు జెప్పెద వినుండు. ఆయాశ్రమంబులోననేకులు పండితులు వేదవేదాంతవేత్తలు నాహితాగ్నులు దివాకరప్రభా భానురుల సుభూసురులనేకమంది తపోనిష్ఠా గరిష్టులు బ్రహ్మధ్యానాసక్తులునుండ బహుసాహసుడు దృఢమతియను శూద్రుఁ డొకడచ్చటికి పోయెను.

వాడా బ్రాహ్మణోత్తముల చర్యలుజూచి మహానందభరితుడయి వారినసేకదినంబులననుసరించి పరిచర్యసేయుచు తనకుమహామంత్రంబువ దేశించవలయునని కోరిన వారు నీవు శూద్రుడవు వేదమంత్రంబుల కనర్హుడవుగావు శూద్రులకు బ్రాహ్మణసేవ కర్తవ్యమని బ్రహ్మ నిర్మితమై యున్నదిగాన బ్రాహ్మణసేవ జేయుచునుండుమని జెప్పిన వాని మనస్సు సంతోషించక పునఃపునః ప్రణామంబులు జేసి బ్రహ్మకర్మలు తనచే జేయించుమని వేడిన నచ్చటి సభాపతి యిట్లనియె.

ఓరి మూర్ఖుడా నీకు వేదంబు జదివే యధికారంబు లేదుగదా నీకు వేదోక్తక్రియలు జెప్పిన బ్రాహ్మణుండు చండాలుండగునని కోపించి చెప్పిన నిరాశుడయ్యును విడవక శ్రద్ధాగరిష్టుడయి నచ్చటికికొంతదూరంబున నొకపర్ణశాల గల్పించుకొని దేవతాగారం బేర్పరచుకొనితత్సమీపంబున తటాకంబు నారామంబును కల్పించి తపస్సిద్ధిగోరి శ్రద్ధా యుక్తుడయి దేవపూజలు సేయుచు కందమూలఫలాహారంబులే గావించుచు బ్రాహ్మణు లెవరువచ్చిన వారికి ఫలాదులు సమర్పించిమహాభక్తినిపూజించుచు బహునిపుణుడయి వ్రతంబు సలుపుచుండె.

కొంతకాలంబునకు గర్గవంశసంభూతుండగు సుమతియనుమునీం
ద్రుడు వచ్చిన బహువినయంబులతో దండప్రణామంబు లాచరించుచు
వారికనేకవిధంబుల పూజలునలుపుచుకందమూలఫలాదులు సమర్పించుచు
సంతోషింపజేసి యొకనాడు రహస్యంబుగామహామంత్రంబులు జెప్పవల
యునని ప్రార్థించిన వానికి వేదమంత్రంబు లుపదేశించి వేదోక్తకర్మలు
జేయించి వానిచే లాభంబు నొందుచునుండి కాలవశంబున మృతుడయి
శూద్రునికి వేదోక్తవిధులు జరిగించిన పాపంబుచే ననేక వత్సరములు
రౌరవాది మహా నరకంబులలో యాతన లనుభవించి తనుపరి రాక్షస
శునక విడ్వరాహ జన్మంబులొంది తదనంతరమున చండాలశూద్ర వైశ్య
క్షత్రియజన్మములెత్తి కడపట విప్రుడయిజన్మించి యుపనీతుడయి జన
కుని యొద్ద వేదంబుజదువుచుండె

అంతట దైవగతిచే బ్రహ్మరక్షస్సుచే పీడితుడయిన నతనితండ్రిదుః
ఖితుడయి యగస్త్యమహామునికడకుదోడ్కొనిపోయిశరిమలన్నియుజెప్పు
కున్నదయాళుండగు మహాముని దివ్యదృష్టిచేజూచి యోబ్రాహ్మణోత్త
మా నీపుత్రుడు పూర్వకాలంబున జేసినకృత్యంబు లివ్విధంబున బాధింపు
చున్నవిందుకు సాధనంబు గనపడదైనను యాలోచించి చెప్పెద దక్షిణ
సముద్రతీరములో సేతురూపంబునుసమస్తదేవతాబ్రాహ్మణసేవ్యంబును
పాపనాశనమగు గంధమాదన పర్వతంబుగలదు దానిపై యొక్క తీర్థ
బున్న దదిభూతప్రేతపిశాచాదులవలన గలుగు బాధలు మాన్పునుగాన
దానికి పాపనాశనమను పేరు బ్రసిద్ధిగల్గియున్నదిగావున భూసురాగ్రణీనీత
నయునచ్చటికి దోడుకొని పోయి ప్రతిదిన మచ్చట నివాసంబుజేసి యథా
శాస్త్రంబుగా స్నానాదిక్రియలు జరిగించితివేని పావనుడయి బాగుపడు
నని జెప్పెను.

ఆయన నగస్త్యమహా మునికి సాష్టాంగ ప్రణామం బొనరించి

కుమారుని గొని నతనిపాపనాశనతీర్థంబులో సంకల్పపూర్వకంబుగా మూడు దినంబులు స్నానంబులు జేయించిన బ్రహ్మరక్షస్సుచే విడువబడి పరిశుద్ధుడయి తమపరి స్వస్థచిత్తుడయి సర్వభోగంబులనుభవించి దేహాంతంబున ముక్తి బొందె నతనిజనకుడును కైవల్యంబు నొందె

మరియునతనిచే వేదమంత్రోపదేశంబు నొందిన శూద్రుండును మృతుండయియనేక యాతన లనుభవించుచు ననేక నీచజన్మంబులెత్తి చివరజన్మంబున గృధ్రమైకాలవశంబున గంధమాదన పర్వతంబుపై వాలి పాపనాశనతీర్థంబులో జలంబుద్రావిపూర్వజన్మస్మృతిగలిగినతీర్థమాహాత్మ్యంబున కచ్చెరువందుచు నందులో శరీరంబుముంచినగృధ్రాకారంబు మాని మహాతేజోమయ శరీరుడయి సమస్తభూషణాలంకారుడయివిమానారూఢుడయి దేవకాంతలు వింజామరలు వీచుచు బరివేష్టించియుండ దేవలోకంబునకుబోయె కాన నాతీర్థంబునకు పాపనాశన తీర్థమని లోక విశృతనామంబుగలిగె తదుక్తం స్కాందే॥

శ్లో॥ స్వర్గదం మోక్షదం పుణ్యం ప్రాయశ్చిత్తకరం తథా।
బ్రహ్మవిష్ణుమహేశానైః స్సేవితం సురసేవితం।
పాపానాం నాశనా ద్విప్రాః పాపనాశావిధం హితౌ ॥ ఇతి॥

వింటిరా మునులారా యదిమహోన్నత తీర్థంబు మరియును.

## సీతాసరోవరతీర్థమాహాత్మ్యము.

పాపనాశన తీర్థంబులో స్నానంబు గావించి సీతా కుండంబున కేగవలయు నాతీర్థములో లోకంబునగల తీర్థంబులయంశంబులన్నియు నంతర్భూతములై యున్నవి. పూర్వకాలంబున దేవేంద్రునకు బ్రహ్మహత్యాదోషనివృత్తియైన స్థలమని జెప్పినసూతా దేవేంద్రునకు బ్రహ్మహత్యయెట్లు సంభవించె స్వర్గములోనుండి భూలోకంబున కతండెట్లువచ్చె నాకథా వృత్తాంతమంతయు విన్నుపించుమని కోరిన నిట్లనియె.

మునీంద్రులారా పూర్వకాలమున కపాలాభరణుడను రాక్షసు డతని మంత్రి శవభక్షకుడని వైజయంతీ పట్టణమున రాక్షసులు గొలువ రథ గజాశ్వాది సహితమగు దశాక్షోహిణీ సైన్యంబులుగొలువ రాజ్యంబు సేయుచు నొకనాడు మంత్రినిపిలిచి భూలోక సౌఖ్యం బనుభవించితిమి నిక యమరావతిపై గండెత్తి దేవేంద్రుని బరిమార్చి స్వర్గ రాజ్యంబు నేలుచు నందనవనాద్యారామంబుల నప్సరస్సమూహంబుతో క్రీడింతమని యాలోచించి కపాలాభరణుండు దుర్మేధనుడను పుత్రుని పట్టాభిషిక్తుని గావించి సకలసైన్యంబులతో నమరావతి జేరిన బలభేదీ యుత సైన్యంబులతో నెదుర్కొని సంకుల సమరంబు గావించి ద్వంద్వ యుద్ధంబు లొనరించి దేవబలంబులు రాక్షసుల నేలం గూల్చిరి దేవేంద్రునకును కపాలాభరణునకు ఘోరఘోరతరంబగు నానావిచిత్రంబులగు యుద్ధంబులు జరుగజరుగ నయ్యామినీచరుడై దు వేలబాహువులబరువుగలిగి శతహస్తంబుల పొడవుగల యుక్కుగదచే నింద్రునివక్షస్థలంబుమీద వ్రేసిన నింద్రుండు మూర్ఛిల్లి బృహస్పతిచే సంజీవనీ మంత్రంబువలన తెప్పరిల్లి లేచి సాహసంబు దెచ్చుకొని యింద్రుండై రావతారూఢుండయి వజ్రాయుధంబున వాని వ్రక్కలు జేసిన వాడు మృతిబొందెను.

ఆ బ్రహ్మహత్య గాఢతరంబై పాకారిని బట్టి బాధపెట్టె ననిన సూతా మహాసురాత్ముడు లోకబాధకుడగు వాని లోకోపకారంబుకొరకు నింద్రుడు జంపిన నాతనికి బ్రహ్మహత్య యెట్లు సంభవంబయ్యె ఈ వింత దెలుపుమన్న సూతుండు నవ్వి మునీంద్రులారా యిది బహు రహస్య మడిగితిరి జెప్పెద వినుడు.

పూర్వకాలంబున వింధ్యాద్రిప్రదేశంబున త్రివిక్రుడను రాక్షసుడు గలడతనిభార్య సర్వలక్షణ సంపన్న సౌందర్యశాలిని యట్టి కాంతామణి వింధ్యపర్వతప్రాంతంబుల సంచరించుచు వేదాధ్యయనతత్పరుండును మహా

పండితుండగు శుచియను బ్రాహ్మణు నాశ్రమంబునకు జేరిన నాతడు దాని రూపవయో సౌందర్యలావణ్యంబులకచ్చెరువందుచు మోహితుడై యున్న నాచేడియ మందగమనంబున నాశ్రమంబులోనికి జొచ్చిన నా మునీంద్రుండు మహానందంబుతో మహా గౌరవంబున దాని బలుకరించి కులమడిగి యీ యరణ్యంబులో దిరిగి నొచ్చితివి కొంతదడవు మా యాశ్రమంబులోనుండి సేదదీర్చుకొని పొమ్మని చెప్పిన సుశీల యిట్లనియె

ఓ మునీంద్రా నే త్రివక్రుం డను రాక్షసేంద్రుని భార్యను పుష్పాపహరణార్థమై యీ యరణ్యంబునకు వచ్చినదాన నే ననపత్యనై యున్నదాన నాభర్త శుచియను మునీంద్రు బొంది పుత్రుబడయు మని యాజ్ఞాపించిన వచ్చితిననిన బహుసంతోషించి నీయందు నాకుండే మోహంబు చెప్పతరముగాదనిన ప్రసాదించి నాకు పుత్రు గృపసేయు మనిన నుత్సహించి దాని మనోరథంబుదీర్చి యిద్దరు మహా వినోదంబుల సకల సౌఖ్యంబు లనుభవించ మూడు దినంబులయ్యె

అంతట నోవనితామణీ నీయుదరంబున కపాలాభరణుడను పుత్రుడుదయించి సహస్రవర్షంబులు రాజ్యసుఖం బనుభవించగలడు దేవేంద్రునిచేతప్ప నితరులకు సాధ్యుడు గాడని జెప్పి కాశీ పట్టణంబునకు బోయె. అంతట కొన్ని దినంబులకు కపాలాభరణునిగనియె నతని నింద్రుడు వధించెగాన బ్రహ్మబీజ సముద్భవుం డగుటంజేసి బ్రహ్మహత్య నింద్రుని జుట్టుకొనియె.

అంతట నింద్రుడు దీనుడై చతుర్ముఖుని సన్నిధికిబోయి విన్నవించిన విరించియు విచారించి యోబలభంజనా దక్షిణ సముద్ర తీరంబున సీతాకుండంబను తీర్థంబునకుబోయి యచ్చట స్నానంబుగావించి శివప్రీతికరమగు యాగములు గావించిన నీ బ్రహ్మహత్యాపాతక విమోచనమగునని జెప్పి యాతీర్థమహాత్మ్యంబున వైకుంఠంబున దొరకును స్నానంబు చేసినవారికిని జెప్పిన బ్రహ్మయాజ్ఞాప్రకారంబున దేవేంద్రుండు జరిగించి పునీతుడై యమరావతికేగె.

ఓ మునీంద్రులారా! ఆ తీర్థంబు మహాపాతకనివారకరము ముక్తిప్రదంబు సర్వదారిద్ర్య దుఃఖ ప్రశమనంబు పుణ్యలోక ప్రదంబు సీతా సరోవరంబున స్నానం బొనరించిన వారికి అష్టయిశ్వర్యంబులు లభించు మునులారా మహాపతివ్రతయగు సీతామహాదేవి శ్రీరామ ప్రీత్యర్థ మగ్ని ప్రవేశంబై నిర్దగ్ధాంగియై యీసరోవరంబులో బయలుదేరె గాన సీతా కుండమని లోకవిశ్రుతంబయ్యె నచ్చట స్నానంబుగావించిన వారికి సర్వాభీష్టసిద్ధిగలుగు.

మంగళతీర్థ మాహాత్మ్యము.

సీతాసరోవరంబున స్నానదానంబుచేసి తదుపరి మంగళ తీర్థంబు నకుబోవలయు నా తీర్థములో లక్ష్మీదేవి సర్వదా నివసించి యుండును. భాగ్యంబుగోరి దేవేంద్రాదు లాతీర్థంబు ననుసరించి యుందురు పూర్వకాలంబున చంద్రవంశోద్భవుడగు మనోజవుడను రాజేంద్రుడు చతుస్సముద్ర ముద్రాంకితంబగు ధరాచక్రంబునేలుచు దేవతాప్రీతి కరంబులగు యాగంబులు సేయుచు బ్రాహ్మణోత్తములకు నన్నదానముచే సంతుష్టి గావింపుచు హవ్య కవ్యంబులు నడుపుచు వేదత్రయా ధ్యయనంబును సార్థకంబుగా శాస్త్రాధ్యయనంబునుగావించి పరాక్రమంబుచే సకల శత్రు నాశనంబు గావించి శివకేశవ నామ స్మరణంబు వదలక మన్వాది నీతి శాస్త్రోక్తప్రకారంబున ప్రజాపరిపాలనంబు సేయుచుండె.

అంతట కొన్నిదినంబుల కహంకరించి దుర్మార్గుండై లోభమోహాబద్ధుడయి బ్రాహ్మణ జీవనములకు పన్నులేర్పరచి దేవాలయంబులకున్న వృత్తులకు విరోధంబులేర్పరచి క్రూరుండయి చరింపుచు కొన్నిదినములకు హూణదేశాధిపతియగు గోలభుడు బలవంతుడయి మనోజవుని పట్టణము విరోధించిన నారుమాసంబులు ఘోరయుద్ధంబయ్యె మనోజవుండు జరిగినిన దేవబ్రాహ్మణద్రోహంబులు నెరిగి యతని తేజోబలైశ్వర్యంబులు

నష్టంబుచేసిన కష్టములపాలై యామనుష్యుడు శిష్టశోకదగ్ధుండయి పసచెడి పరాజయుడయి సింహవ్యాఘ్రభల్లూకాది దుష్టమృగ నందష్టంబగు నరణ్యంబులో తాను భార్యయు కుమారుండును సంచరించుచు నిలువ నీడ లేక గోడుగుడ్పుచు బాధలబడుచుండెను.

గోలభుండు రాజ్యంబాక్రమించుకొని సంతోషంబుతో ననుభవించుచుండెను

అంతట మనోజవుండును భార్యయు పుత్రుండును బాధల బడుచు కుమారుడన్నంబులేక సొక్కి మూర్ఛాపరవశుడై తల్లినిబట్టుకొని వలవింపుచుండ తండ్రిజూచి శోకసముద్రంబులో మునిగి దుఃఖింపుచు పూర్వ కాలంబున తాను మదించి చేయని సత్కార్యములను చేసిన దేవబ్రాహ్మణ ద్రోహములను దలచుచు భార్యతో నిట్లనియె

హేసుమిత్రే నేనొకనాడయినను శివకేశవుల పూజ గావించనయితి వారినామములయినస్మరించనయితి బ్రాహ్మణుల వృత్తులకుపన్నులుగడితి దేవాలయంబులు వృత్తులుహరించితి తల్లిదండ్రులకు శ్రాద్ధంబులువిడచితి చైత్రమాసములో చిత్రానక్షత్రయుక్తదినంబున నొక్క ఫలంబయిన నెవ్వరికివ్వనైతి నింతపానకంబయిన దాహంబు నివ్వనైతి యొక్క ఛత్రంబయిన నొక్కవ్యజనంబయిన పాదరక్షలయిన నెవ్వరికి నివ్వనయితి ఇంత క్రూరుండనయితిని వేసవికాలంబున నొకరికి పుష్పంబయిన ఫలంబయిన చందనంబయిన దాహంబైన నివ్వనయితి సకల జంతువుల కుపయోగంబౌనట్లొక్కతటాకంబైన భావియైన త్రవ్వించనయితి చలివేంద్రి బెట్టించనయితి తులసీవనంబయిన వేయించనైతి నొకనాడయినహరకేశవులకుత్సవంబులు చేయనైతి పెద్దల బ్రాహ్మణోత్తముల పండితులజూచి గర్వాంబుచే దండంబైన బెట్టనైతి పట్టెడన్నం బెవరికి బెట్టనైతింత దురాగతుడ కఠినుడ గర్వగ్రస్తుడ మోహగ్రస్తుడ దురాచారపరుండ దురాశాపరుండ

నేనిక నుండజాల యీ బాలుని సంరక్షణ మెట్లయిన జేయుము నే చేయ ననిన భార్యయగు సుమిత్ర దుఃఖించి నిట్లనియె.

భర్తా యెన్నికష్టంబు లనుభవించినను నీ సన్నిధానంబున నుండుటకు ధైర్యంబింత గలిగియుండె నేను స్త్రీని వీడు పసిబాలుండీయరణ్యములో క్రూరమృగంబుల నోటిలోబడుదుము యీకష్టములుబడనోప నేను శరీర త్యాగంబు జేతు నీబాలుని సంరక్షించుకొమ్మని భార్యజెప్పిన మూర్ఛాక్రాంతుడయి కాలుగదల్పక బడియుండె.

భార్యయుకొమారుండును మహాస్వరంబుతో రోదనము జేయుచుండ నంతట దైవయోగంబున జటావల్కలధారియు భస్మోద్ధూళితవిగ్రహుండును తిర్య త్రిపుండ్రాంకిత ఫాలభాగుండును రుద్రాక్ష మాలాలంకృతుండును ధవళ యజ్ఞోపవీతుండునగు పరాశరముని యీ యార్తస్వరం బాలించి యచ్చటికరుదెంచిన సుమిత్ర లేచి పాదంబులపై బడిన యోపతివ్రతా నీ వెవ్వరు మూర్ఛాగతుడు నీకేమిగావలె నెందుకీరీతి బడియున్నవాడనియడిగిన మహాత్మా యితను నాభర్త మనోజవుడను రాజేంద్రుడు హూణదేశాధీశుండగు గోలభుజనువానిచే పరాజితుండయ్యె మా శత్రువుడు రాజ్యపాలనంబు నేయుచు సుఖంబున నున్నాడు

ఈ కష్టంబుల కోర్వక నా భర్త యీగతి మూర్ఛాగతుడయ్యె నీ బాలుడు మా తనయుడు క్షుత్పిపాసా పరీతుడై దుఃఖించుచున్నాడో మహాత్మ మీరు దీనరక్షణ విచక్షణులు మీ పాదరజంబుసోకినవారు పవిత్రులయి భాగ్యవంతులగుదురు మమ్ము రక్షింపు రక్షింపు మనుచు తన పుత్రుని చంద్రకాంతుని పాదములపయి వడవేశి దుఃఖింప నమ్మహాత్ముడు పరిపూర్ణ కటాక్షంబు చేజూచి యోమానినీ దుఃఖింపకు జగద్రక్షకుడు మీకు మంచిమార్గంబు జూపించునని యమ్మునీశ్వరుడు తనకరంబున నారాజేంద్రుని శరీరంబంటి సదాశివ మంత్రంబు స్మరించిన వసుధరాధీశుండు దిగ్గున లేచి పరాశరుని పాదంబులపై బడెను.

# ౪౨ శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.

మునీంద్రా భగవత్పాద సేవకుడ మీపాదరజస్సుచే నాపాపంబులు దూరంబులయ్యె మా పుణ్యంబున మీదర్శనంబుగలిగె రక్షింపు రక్షింపుడనుచు సాగిలిమ్రొక్కిన దయాపరిపూర్ణుడై రాజేంద్రా మీ యాశత్రుజయంబై నీకు రాజ్యంబుగలిగి సుఖించెడి యుపాయంబు జెప్పెద వినుము.

మహాపుణ్యప్రదంబగు రామసేతుసమీపంబున గంధమాదనపర్వతంబునందు సర్వైశ్వర్యప్రదాయకంబగు మంగళతీర్థంబుగలదు శ్రీరామదేవుడు సీతాసమేతుడై సన్నిధించియున్న తీర్థంబుగావున నీవు కళత్రపుత్ర సమేతుడవై యచ్చటికిపోయి స్నానంబు జేసిన క్షేమంబు గలుగును నీకుమాంగల్యంబు దొలగిపోయి పరిశుద్ధుడవై పాపంబులబాసి శుభంబుల బ్రాపించుదువు దుష్టులగు నీశత్రువులకష్టంబు పాలగు వశిష్టానుగ్రహంబున నీనష్టరాజ్యంబు నీకు వచ్చి సుఖింతువని జెప్పి రాజా నేనువచ్చి నిన్ను కృతార్థుని చేయుదునని కళత్రపుత్రసమేతుడైన రాజయ్యాని దోడ్కొనిక్రమక్రమంబున దేశంబులు దాటి దుస్తరములగునదులరణ్యంబులుదాటిగంధమాదనంబు చేరి యచ్చట మంగళతీర్థంబున యథాశాస్త్రంబుగా నతనిని సకుటుంబముగా స్నానంబుచేయించి పితృప్రీతికరంబులగు శ్రాద్ధంబులు జేసిన రాజునిర్మలుడైనప్పుడు తారకమంత్రంబేకాక్షరం బుపదేశించిన నా రామమంత్ర మతడిరువదినాల్గుదినంబులు నిశ్చలబుద్ధితో జపము చేసెను.

తత్ప్రభావంబున బహుదృఢతరమగు బాణాసనమును నక్షయతూణీరంబులును మరియు ఖడ్గంబును చర్మగదా ముసలాది సాధనంబులును మహానాదంబుగలుగు శంఖంబును సవజీసీసారధి పతాకాదిశోభితంబగు రథంబును దివ్యంబులగు వస్త్రంబులు భూషణములునుమహోత్కృష్టంబగు పరాశర మహాముని ప్రసాదంబున మంగళతీర్థంబుసన్నిధిలో నేదట నిల్పిన జూచినృపాలుడు సంప్రీతుడై పరాశరమునికి పాదాక్రాంతుడై యనుగ్రహించి తత్తీర్థోదకంబులనతనినభిషేకంబుగావించిన నా భూమీ

తుండు శోభాయమాన శరీరుండై మకుటంబు ధరించి సమస్తాభరణ భూషితుడై దివ్యమహాలాంబరంబులు ధరించెను.

అంతట పరాశరమునీంద్రుడు బ్రహ్మాస్త్రాది దివ్య సాధనంబులు ప్రయోగోప సంహారపూర్వకంబుగా ప్రసాదించిన నుపదేశంబు నొంది శిద్ధుండై మనోజవుండా మహాముని పాదంబులకు పూజలొనరించి తదాశీర్వచనంబులు గైకొని తదనుజ్ఞనొంది భార్యాపుత్రసహితుడై నిజపురంబునకుబోయి శంఖధ్యానంబు జేసిన గోలభుంమగుండెలవశి ధైర్యంబుదెచ్చుకొని సేనాసమేతుండై మనోజవు నెదుర్కొని నతి ఘెరారంబగు యుద్ధంబు గావించి జయించలేక పలాయనంబు నొందె

మనోజవుండు కళత్రపుత్రసమేతుండై పురంబుసొచ్చి రాజ్యభారంబుబూని నిరహంకారుడై బ్రాహ్మణద్వేషంబుమాని ధర్మంబు దప్పక నహస్రవర్షంబులు సుఖముగా భాగ్యమనుభవించి విరక్తుడయి తనకుమారుండగు చంద్రకాంతునికి పట్టాభిషేకంబు జేసి భార్యాసహితుడయి మంగళతీర్థంబు జేరి పంచాక్షరీమంత్రంబు జపంబు జేసి కొన్ని దినంబులకు శివలోకంబు జేరె.

మునీంద్రులారా మంగళతీర్థ ప్రభావంబిట్టిది వింటిరా యని చెప్పి సంతోషించిరి.

—* అమృతవాపి తీర్థమాహాత్మ్యము. *—

తదనంతరంబు మంగళతీర్థంబులోస్నానాదికృత్యంబులు దీర్చుకొని యేకాంతరామనాథ క్షేత్రసమీపంబున నమృతవాపికి పోనలయు నచ్చట స్నానంబుగావించి సీతాలక్ష్మణ హనుమదాది వానర సహితుండగుచు లోక రక్షణార్థంబు మహానుగ్రహంబున శ్రీరామ చంద్రుని సన్నిధియుందు నాతీర్థంబుల స్నానంబు జేసినవారలు శంకరప్రసాదంబున నమృతంబునొందగలరని జెప్పిన నూతా యాతీర్థంబున కమృతవాపి యను నామంబెట్లు సంభవించె చెప్పుమని యడిగిరి.

మునులారా హిమవత్పర్వత ప్రాంతంబులో సకలముని సిద్ధగంధర్వ విద్యాధరాది సేవితంబును మృగసంకులంబు ననేకతరులతాకుంజనికుంజాది శోభితంబును పద్మకైరవాది విలసిత సరోవర భాసితంబగు నొక రుష్యాశ్రమంబుగలదక్కడ నగస్త్యమహామునీంద్రుని భ్రాత బహునిష్ఠాగరిష్ఠుడయి త్రికాలంబుల వర్షాతప శీతలంబులకోర్చి తపంబు సేయుచు త్రికాలంబు శివపూజ లొనరించుచు నూర్ధ్వబాహుండయి నిరాధారుండై నిరాహారుండయి మౌనవ్రతంబున నిశ్చలుండయి పాదాంగుష్ఠంబుపై నిల్చి యత్యుగ్రతపంబు గావించిన దయాసముద్రుండగు మహాదేవుండు మహాతేజస్సుచే దశదిశాంతరంబు నింపుచు వృషభవాహనారూఢుండయి పార్వతీసమేతుండయి ప్రత్యక్షంబయిన మునీంద్రుండు లేచి సాష్టాంగ దండప్రణామంబొనరించి స్తుతించె. పార్వతీ హృదయేశ భవవినాశ నీలకంఠ మహేశ ఫాలలోచనశర్వ సర్వగీర్వాణార్చ్య సన్నుతాంఘ్రి దక్షాధ్వరధ్వంస దైత్యదానవశిక్షా శిష్టావనోద్దిష్ట శిపివిశిష్ట శూలాయుధాభీల శోషితరిపుజాలా హాలాహలాహారా యనుచు నివ్విధంబున ననేక స్తుతులుజేసి యో మహాధీశా సంసారార్ణవమగ్నుండనగు నన్నుద్ధరించి మోక్షాయత్త చిత్తునింజేయవేయని ప్రార్థించిన సదాశివుండు సంతోషించి యో యగస్త్య భ్రాతా నీకు ముక్త్యుపాయంబు జూపెద సేతుమధ్యంబున గంధమాదన పర్వతసమీపంబున మంగళతీర్థ సన్నిధి నొక తీర్థంబున్నది దాని మహిమ మహాద్భుతంబు నీవచ్చటికిబోయి ముక్తిబొందుమని సూచించి పరమేశ్వరుండంతర్హితుండయ్యె.

అంతట నాముని గంధమాదన పర్వతంబుజేరబోయి యేకాంత రామనాథ క్షేత్రాలంకృతంబును ముక్తిప్రదంబగు నాతీర్థసన్నిధి నీశ్వరాజ్ఞాప్రకారంబుదప్పక యమనియమాన్వితుండై మూడువత్సరంబులు స్నాన సంధ్యాద్యనుష్ఠానంబులు సలుపుచు సమాధి నిష్ఠచే బ్రహ్మనాడిని ప్రాణంబులగలిపి ధారణావశంబున శిరంబునకుజేర్చి బ్రహ్మరంధ్రంబు భేదించి ప్రాణంబువెడలించి శరీరత్యాగంబుజేసె.

నాతీర్థప్రభావంబున నామునిశ్రేష్ఠున కమృతత్వసిద్ధి గలిగె గావున నాతీర్థంబున కమృతవాపీ నామంబు సార్థకం బయ్యె నో మునీంద్రులారా శ్రద్ధాభక్తియుక్తు లెవ్వరయిన నిష్ఠాగరిష్ఠులయి పక్షత్రయంబచ్చట స్నానాది సత్క్రియలు జరిగించిరేని వారల కమృతంబు దొరకుట కేమి యాశ్చర్యంబు లేదనిన విని సూతా యేకాంత రామనాథ క్షేత్రంబని వచించితి వా క్షేత్రంబున కా పేరెట్లు సంభవించె కృపచేసి మాకు జెప్పవే యని యడిగిన.

మునీంద్రులారా పూర్వంబున శ్రీరామచంద్రుండు లక్ష్మణ హనుమత్సుగ్రీవ విభీషణ జాంబవత్ప్రముఖులం గూడి సేతునిర్మాణ ప్రయత్నాలోచనగ్రస్తులయి సీతను మనంబున దలచి దుఃఖించుచు నేకాంతంబున నున్న సమయంబున సముద్రమందు తురంగతరంగంబులచే ఘోరభయంకరారావంబు చేసిన పరస్పరహాస్యసంభాషణంబులు వినరామిం జేసి శ్రీరాముం డతిక్రుద్ధుండయి తీక్ష్ణదృష్టిచే నా జలనిధిం జూచుటయు సముద్రుండు భంగంబులొంగ గ్రుంగి నిర్విణ్ణుండయ్యె నిప్పటికి నక్కడ సముద్రంబు నిశ్చలంబయియుండు నేకాంతంబున నుండుటచే నేకాంత రామనాథమని ప్రసిద్ధమైనది యా యమృతవాపి యను తీర్థంబున స్నానంబు చేసిన యెట్టి జ్ఞానవిహీనులయిన యమృతత్వంబు నొందుదురు.

తదుక్తం సేతుమాహాత్మ్యే॥ శ్లో॥ అద్వైతవిజ్ఞానవివేకహీనావిరక్తిశూన్యాశ్చ సమాధిహీనాః యోగాద్యనుష్ఠాన వివర్జితాశ్చ। స్నాత్వా త్రయాస్యం త్యమృతం ద్విజేంద్రాః॥ ఇతి॥

వింటిరా మునీంద్రులారా మహోత్తమంబగుతీర్థంబు మఱియక్కడ బయలుదేరి గంధమాదనపర్వతంబుననుండు బ్రహ్మకుండంబునకు బోవలయు. ఓ మునులారా మహాదరిద్ర నాశనకరంబగు బ్రహ్మతీర్థం బిది దీని

## బ్రహ్మకుండ మాహాత్మ్యము.

దర్శనంబున ననేకబ్రహ్మహత్యాదిసకలపాపపరిహారంబుగలుగు నా బ్రహ్మకుంబులోనున్న భస్మంబుధరించినవారు బ్రహ్మవిష్ణు మహేశ్వరుల ననుసరింతురు. బ్రహ్మకుండ దర్శనంబుసేయ శక్తిచాలని వారలా బ్రహ్మకుండ భస్మం బెవ్వరైన కించిన్మాత్రంబు దెచ్చియిచ్చిన నా భస్మంబు దాచుకొని

మరియొక భస్మంబుతో గలిపి ధరించుకున్నను వారు భాగ్యవంతు లగుదురు. పవిత్రులగుదురు యోగ్యులగుదురు బ్రహ్మయజ్ఞంబుజేసిన స్థలంబిదిమహాదేవునివరంబుచే మహోన్నతంబగు తీర్థంబయ్యెనని చెప్పెను.

ఓసూతా యీతీర్థంబునకు బ్రహ్మకుండంబని పేరెట్లుగలిగెనక్కడ భస్మంబుపుట్టుట కేమిహేతువని యడిగిన మునులారాయిది బహుచిత్రంబయినకథయొకానొక సమయంబున బ్రహ్మకు విష్ణువునకు గొప్ప కలహంబయినదేమనగా లోకకర్తను నేనేగాని నాకుమించిన వారు లేరని చతుర్ముఖుండు బలికిన జగత్కర్తను నేనుగాని నీవుగావని విష్ణుదేవుండనియె నివ్విధంబున నన్యోన్యకలహంబధికంబయి అహంపూర్వ మహాపూర్వంబని దరిలేక కలహంబుసేయుచు సేయుచుండ నాయిద్దరి మధ్యనంతాగ్ని సమప్రభంబగు నేకలింగంబు మిన్నుముట్టినిలిచిన బ్రహ్మవిష్ణుశక్రాదులాశ్చర్యంబునొంది యీలింగంబునకాద్యంతంబులు గన్నవారు లోకకర్తలనిపించుకుందురని దేవబృందంబు నిశ్చయించెను.

అంత చతుర్ముఖుండు నేనంతంబుగనిపత్తునీవాదిగనుట కేగుమని విష్ణువుతోననిన రమావల్లభుండు సమ్మతించి వరాహరూపంబుదాల్చి పాతాళంబునకుపోయివచ్చి శివునియెదుటనిలిచె బ్రహ్మహంసస్వరూపుడయి యాకాశంబునకుపోయివచ్చి మహాదేవునెదుట నిలిచె నాయిద్దరినిగాంచి విశ్వేశ్వరుడు బహువత్సరంబులేగితి రాద్యంతంబులు గనివచ్చితిరాయని యడిగిన విష్ణుదేవుండు లింగంబునకాదియెచ్చట నున్నదో నాకుగానరాలేదని స్పష్టంబుగాజెప్పె బ్రహ్మకైజూచిన నేనంతంబుగనుగొంటిననుచు నసత్యంబు బలికిన శివుడునవ్వి నీవు మృషావాదివి గావున నీకుభూలోకంబున పూజలేక పోవునని శాపంబిచ్చె.

అంత చతురాననుడు విషణ్ణుడయి యోయీశానా ప్రభువులయినవారు యపరాధంబు క్షమింతురిది ప్రథమాపరాధంబు గావున మన్నించి శాపనివృత్తికల్పించుమని రక్షింపుడని యనేకవిధంబుల వేడుకున్న నీశ్వరుండు ప్రసన్నుడయి పరితాప తప్తుండగుచున్నవిరించిని జూచి కరుణించి పద్మగర్భానావాక్యం బనృతంబుగాదైనను నీవింత వ్యసనబడుటచే నొక యుపాయంబు జెప్పెద గంధమాదన పర్వతంబునకు జని

యందు యజ్ఞంబు లాచరించితి నేని యీమిథ్యావాద దోషశాంతి య
గును వానిచే పాపంబును బాసి శ్రౌత స్మార్తాది కర్మలయందు
పూజకర్హుఁడవగుదువు ప్రతిమార్చనంబు నీకుఁగలుగ నేరదని స్పష్టం
బుగా జెప్పి తదనంతరంబు విష్ణు దేవుంగాంచి నీవు సత్యవాదివి గావున లో
కంబులో పూజగలుగు చుండు మనియును గ్రహించిన విష్ణు దేవుండు
సంతోషించెను.

అంతట మహాదేవుండంతర్హితుండయ్యెనని చెప్పిన సూతుఁ యీకథ యేపురాణంబులోనున్నదని యడిగిన మునీంద్రులారా స్కాందపురాణంబులో యీకథ విస్తరింప బడియున్నదని వినిపించెను.

శ్లో॥ సూతః॥ పురాణభూవకలహే బ్రహ్మవిష్ణ్వోఃపరస్పరం। అహం
కర్తానమత్తోన్యః కర్తాత్రిజగతితలే।

ఏవమాహహరిం బ్రహ్మబ్రహ్మాణం చైహరి స్తదా। ఏవంవివాదస్సు
మహాన్ప్రావర్తతపురాతయోః॥

మధ్యేప్రాదురభూల్లింగంస్వయంజ్యోతి స్సనాతనం। తౌదృష్ట్వావిస్మి
తౌలింగం బ్రహ్మవిష్ణు పరస్పరం॥

సమయంచక్రతురిర్వ్యాపాః దేవానాం సన్నిధౌ పురా। అనాద్యంతంమ
హాలింగంయ దేతద్దృశ్యతే పురః॥

అనంతాదిత్యసంకాశ మనంతాగ్నిసమప్రభం। అనయోరస్యలిం
గస్య యోంతమాదిచ పశ్యతి॥

అహమూర్ధ్వంగమిష్యామి లింగస్యాంతంగవేషయన్। గవేషణా
యమూలస్యత్వమధస్తాద్ధశేవ్రజ॥

ఇతితస్యవచశ్శ్రుత్వాతథేత్యాహరమాపతిః। ఏవంతౌ సమయంకృ
త్వామార్గణాయవినిర్గతౌ॥

విష్ణుర్వరాహరూపేణ గతోదస్తాద్గవేషితుం। హంసతాం భారతీ
జానిస్స్వీకృత్యోర్ధ్వపరినిర్ణయయౌ॥

అథోలోకాన్విదత్వాథో విష్ణుర్వర్షగణాన్బహూన్ ॥ యథాస్థానం సమాగత్య ప్రభావే దేవసన్నిధౌ॥

శ్రీవిష్ణుః॥ అహంలింగస్యనాద్యాన్తమాదిమస్యేతిసత్యవాక్। ఊర్ధ్వం గవేషయిత్వాథ బ్రహ్మాస్యాగచ్ఛదత్రసః । ఆగత్యచ వచఃప్రాహ బద్మనా చతురాననః॥

బ్రహ్మా॥ అహమద్రాక్షమస్యాంతలింగస్యేతిమృషావదత్ । తయో స్తద్వచనశ్రుత్వా బ్రహ్మవిష్ణుమహేశ్వరః। మిథ్యావాదినమాహేమం ప్రహస్యచతురాననం॥

ఈశ్వరః॥ అసత్యంయదవోచత్త్వం చతురాననమత్సరః । తస్మాత్పూజాంనార్హతస్త్వమితిశ్శంభు ఉమాపతిం॥

అథోద్విగ్నమనా బ్రహ్మాప్రార్థయామాస శంకరం। ఏకోపరాధం సంతవ్యో స్వామినిర్జగదీశ్వరైః॥

స్వామిన్మదపరాధత్వం క్షమస్వకరుణాలయ । తతో మహేశ్వరో వాదీత్సాంత్వయంశ్చతురాననం॥

ఈశ్వరఉవాచ॥ నమిథ్యావచనమస్యాద్బ్రహ్మన్ వక్ష్యామి తేశృణు। గచ్ఛత్వంసహసావత్స గంధమాదనపర్వతం॥

తత్రక్రతున్కురుష్వత్వంమిథ్యాదోషప్రశాంతయే। తతోవిధూతపాపస్త్వం భవిష్యతినసంశయః॥

తేనశ్రౌతేషుచబ్రహ్మన్ స్మార్తేష్వపిచకర్మసుః పూజాభవిష్యతిస దానపూజాప్రతిమానుషే॥ ఇతి॥

వింటిరా మునులారా స్కాందపురాణంబులో వ్యాసప్రోక్తంబులగు శ్లోకంబులు వినిపించితి చతుర్ముఖుండు మిథ్యా భాషణంబున శాపగ్రస్తుం డయ్యె సత్యవాదంబున రమాకాంతు డనుగ్రహపాత్రుడయ్యెనని చెప్పిన విని యాశ్చర్యంబునొంది సూతా ముందువృత్తాంతంబు చెప్పుమని కోరిన ఓమునులారా యంతట బ్రహ్మయాజ్ఞగైకొని శివప్రీతికరంబులగుయజ్ఞంబు

లెనబడి ఎనిమిది వేల సంవత్సరంబులు గంధమాదన పర్వతంబు మీద యజ్ఞంబు జేసిన శివుండు ప్రత్యక్షంబై యోచతురాననా నీవీ యజ్ఞంబులొనరించుటవలన మిథ్యావాదదోషంబు దూరంబయ్యెగాన శ్రౌతస్మార్తకర్మలయందే నీకు పూజ దొరకును విగ్రహపూజ నీకులోకంబులో దొరకదు.

నీవు యజ్ఞంబులు జేసినందువలన దీనికి బ్రహ్మకుండంబని పేరు గలుగునని శివుండంతర్ధానంబు నొందె వింటిరా కథావృత్తాంతం బివ్విధంబున జరిగిన దప్పటినుంచి బ్రహ్మకుండంబని ప్రసిద్ధంబై మహా పాతకనాశనతీర్థంబని ప్రసిద్ధంబయ్యె మునీంద్రులారా మహా వుత్తమమైన తీర్థంబక్కడ స్నానంబుజేసి హనుమత్కుండంబునకు పోవలయును.

—* హనుమత్కుండ మాహాత్మ్యము. *—

ఈతీర్థంబు సర్వోత్తమంబు మహాపావ నాశనకరంబు పూర్వకాలంబున ధర్మసఖుడను రాజు నక్కడ బుత్రగామేష్టి జేసిన నూరుమందిబుత్రులు బుట్టిరనిన సూతా యాకథా వృత్తాంతంబంతయు వినుపించుమనిన మునులారా ధర్మసఖుడను రాజు బహు ధర్మశీలుండు ప్రజాపాలన తత్పరుండు మహా పండితు డతనికి నూరుమంది భార్యలు నందరు మహా యోగ్యులు పతివ్రతాశిరోమణులు భార్యలు తాను సంతోషంబున సుఖింపుచుండ నొకరికి సంతానంబు గలుగక చింతింపుచుండ దైవానుగ్రహంబున పెద్ద భార్యకు నొక పుత్రుడు గలిగె నా చిన్నవానిని నూరుమంది భార్యలు తమతమ గర్భ జనితుగానే ప్రేమచే బెంచుచుండిరి నందుకు రాజును బహు సంతోషించుచుండ నొకనాటిరాత్రి యాచిన్నవాడు నిదురబోవ నొకవృశ్చికంబు కాలిపై గరచిన వాడు తాపంబునొందినదిజూచి నూరుమందిభార్యలు దాస దాసిజనంబులు దుఃఖించిరి.

ఆధ్వని కొలువుకూటంబునకువినబడ నారాజు వకదూతను బంపి వర్తమానంబు దెప్పించుకొని తానుబోయి విషవైద్యుల కనేక ధనంబులిచ్చి మంత్రౌషధంబులచే శాంతి బొందించి సంతోషించి బ్రాహ్మణులకు

దీనులకు కొల్లగా ధనాంబరాభరణాదు లిచ్చి బ్రాహ్మణోత్తముల పిలిచి యొక్కకొడుకు కొడుకుగాడొకకన్ను కన్నుగాదని లోకవాడిక వింటిరి గదా. నాకు నూరుమందిభార్యలు భార్యకొక సుతుండు గలుగునట్లు యజ్ఞంబుజేయించుమనిగోరిన వారు గంధమాదన పర్వతంబుమీద హను మత్కుండంబనియున్నది లోకోపకారంబుకొరకు హనుమంతుండు నిర్మించె నని జెప్పిన సంతోషించి హనుమత్కుండసమీపంబునపుత్రకామేష్టిచేసె. బ్రాహ్మణోత్తములు నూరుగురు భార్యలకు పాయసంబు బంచి యిచ్చిన నందరి కొక్కొక్క తనయుండుద్భవించి సుఖంబుండిరి. ఈ రాజు నందరు తనయుల లాలనంబుసేయుచు బహుకాలంబు జీవించి తనపెద్దకొమరుడగు సుచంద్రునికి రాజ్యభారంబిచ్చి తపో వనంబునకేగి కొన్ని దినంబులకు శివ లోకంబుచేరె. మునీంద్రులారా యది మహాన్నతతీర్థంబచ్చట స్నానాది క్రియలు జరిగించి రుద్రదర్శనంబుచేసి యగస్త్య తీర్థంబునకు బోవలయు

## —* అగస్త్యతీర్థ మాహాత్మ్యము. *—

ఈతీర్థంబు మహాన్నతంబగు తీర్థంబనిన సూతాయాతీర్థ ప్రభా వంబుమాకు కృపచేసి చెప్పవేయనిన మునీంద్రులారా పూర్వకాలంబున మేరుమందరపర్వతంబులతో వింధ్యపర్వతంబు కలహించుకొని వారికంటే పొడవు గావలెనని యెదిగిన సూర్య చంద్ర గతుల కడ్డంబుగ దేవేంద్రాది దేవతలు కైలాసంబునకుబోయి వింధ్యాద్రి గర్వంబు సర్వంబుని వేదించిన సర్వజ్ఞుండాలించి నగస్త్యునింబిలిచి నీవేగి లోకోపకారంబుకై వింధ్యాద్రి వని చక్కచేయుమని యాజ్ఞ యిచ్చిన మహాదేవాపార్వతీవివాహ సంభాష ణార్థంబువసిష్టు లేగియున్నారు వివాహంబు సన్నిహితంబయియున్నది.

పార్వతీ కల్యాణోత్సవ విశేషంబు నాకన్నులజూడ వేడ్క గలదు దేవర వారు పెళ్ళికొడుకగుటజూచిపోదునని మహావినయంబుతో వేడిన కుంభ సంభవా నీయంతరంగంబు మాకు దెలుసు నీకోర్కెకొలది పెళ్ళి కొడుకు

పెళ్ళికూతుకు వేషంబులతో పార్వతీ సహితుండనయి వేదారణ్యంబులో నీకుసన్నిధించెద నమ్ము నమ్ము మని యగస్త్యు నోదార్చి పంపించెను.

తదుక్తం స్కాందే॥ శ్లో॥ అగస్త్యః॥ ఉద్వాహ వేషంతేదేవ న ద్రక్ష్యామి కథంవిభో। ఇతివిజ్ఞాపి తశ్శంభుః పునః కుంభజ మబ్రవీత్॥

శ్రీశివః॥ కుంభజోద్వాహ వేషంతే పార్వత్యా సహితోహ్యహం। వేదారణ్యేమహాపుణ్యే దర్శయిష్యామ్యసంశయః। తద్గచ్ఛశీఘ్రం వింధ్యాద్రింనిగృహీతుం మునీశ్వరఇతి॥

ఇవ్విధంబున భగవంతుండైన శివుండు సమాధానంబు జెప్పి నగస్థైర్యంబాపిన వింధ్యాద్రినుంచి దక్షిణదేశంబులెల్ల సంచరించి గంధమాదనపర్వతంబునకుబోయి నచ్చట స్వభావంబుతో విలసిల్లు నొక తీర్థంబు నిర్మించె నది ఈశ్వరానుగ్రహంబున బహుపుణ్యతరంబును మహాపాపనాశకరంబగు తీర్థంబునయ్యె నాతీర్థంబులో ననేకులుకృతార్థులైరి యనుచు జెప్పిన సూతా దాని ప్రభావంబు సంపూర్ణంబుగా దెలుపు మని మునులడిగిన

మునులారా నేనెంతని వర్ణింతు నొక్క కథజెప్పెద వినుండు పూర్వకాలంబున దీర్ఘతామసుండను నొకమునీంద్రుడతనికి కక్షీవంతుడను నొక పుత్రుండు గలిగి బహుబుద్ధివంతుడై శాంత స్వభావుండయిన నబ్బాలుని నుపనయనాది సంస్కారంబులు నిర్వర్తించిన బ్రహ్మచర్యవ్రతంబు నడుపుచు విద్యార్థియై యుదంకుడనుమహర్షి సమీపంబుననాల్గు వేదంబులు నారుశాస్త్రంబులు సార్థకంబుగా జదివి సకల పురాణోప నిషత్తులును జదివి యిరువదివర్షంబులు గురువునింట నివసించి సకల విద్యా విచక్షణుడయి గురువగు నుదంకునకు సాష్టాంగ దండ ప్రణామంబు గావించి స్వగృహంబునకుబోవ నుద్యోగించిన నుదంకుండు సంతోషించి యతనిభావంబు గ్రహించి కక్షీవంతుని యనుగ్రహించి నీవు నేతు నూగా

లంబగు గంధమాదనంబునకుబోయి యచ్చటనగస్త్యకుండంబు గలదు మహాపుణ్యాకరంబు భుక్తిముక్తిప్రదంబు మనోభీష్టప్రదంబచ్చట మహానిష్టతో మూడువత్సరంబులు పంచాక్షరీమంత్రంబు జపంబు సేయుము నీతపస్సుఫలించి నాలుగోసంవత్సరంబు ప్రవేశించు ప్రథమ దివసప్రాతఃకాలంబున మహాకాయంబును చతుర్దంతంబులు సర్వాంగ పాండురంబునగు మహోన్నత గజం బుద్భవిల్లు.

ఆగజారోహణంబుగావించి స్వనయుడనే రాజర్షి పట్టణంబునకు బొమ్ము నిన్నుజూచియతడు ప్రత్యుత్థాన భివందనంబులుజరిగించిమన్నించి యతనికన్యకను నీకిచ్చి వివాహంబు చేయు నందువలన నీకు బహుశుభంబులొనగూడునని యుపదేశించిన సంతోషించి పాదాభివందనంబులుగావించి గంధమాదన పర్వతంబునకుబోయి తీర్థదర్శన వందనంబులు గావించి స్నానసంధ్యాద్యనుష్టానంబులు నిర్వర్తించి యా దినంబు క్షేత్రోపవాసంబుచేసి మరునాడు సూర్యోదయకాలంబున యథా కృత్యంబులు జరిపి పారణచేసి యవ్విధంబునచేయ వర్షత్రయ మగుటయు తృతీయసంవత్సరాంత దివసంబున సాయం సంధ్యా వందనం బొనరించిసుఖనిద్ర జెందియుండ నారాత్రిప్రహర త్రయ సమయంబున మహా కలకల ధ్వని వినంబడెను.

అదికక్షీవంతుడు లేచి చూచిన నాసమయంబున దైవ వశంబున స్వనయుండనురాజు వేటమార్గంబుకై గంధమాదన పర్వతంబునకు వచ్చెనంతట కక్షీవంతుండు దంతధావనాది కాలోచితకృత్యంబులుదీర్చి యవగాహనము సంకల్పపూర్వకంబుగా చేసి సంధ్యావందన దేవర్షిపితృతర్పణాదులు యథాశాస్త్రంబుగా జరిగించి పంచాక్షరీ జపంబు సేయుచుండ నంతలో నగస్త్యతీర్థంబులోనుంచి చతుర్దంతంబులు గలదియుకైలాసపర్వతంబు పగిది మహాకాయంబుగలదియు పండువెన్నెలభంగి ధవళశరీరంబు

గలమహాగజంబొకటి నిర్గమించిన యుదంకుండిచ్చిన వరంబు ప్రత్యక్షం
బయ్యెనని సంతోషించెను.

పిమ్మట గజసమీపంబునకు బోయి నిలిచి తనగురువును వరప్రదాతయు
నగు సుదంకుని దలచుకొని నమస్కరించి యగస్త్య తీర్థంబునకు
సాష్టాంగ ప్రణామంబాచరించి మాటిమాటికి తీర్థశ్లాఘన చేయుచు
కక్షీవంతుడు గజారోహణంబు చేసి స్వనయుడను రాజు పట్టణంబునకు పోవ
నుద్యుక్తుండై యున్న సేటమార్గంబుకై వచ్చుచున్న స్వనయుండు చతు
ర్దంతగజారూఢుండగు కక్షీవంతుని జూచి పూర్వ కాలంబున నారదమహా
మునితనకు జెప్పిన మాటలు దలచుకొని తన పుత్రిక చేసుకున్న ప్రతిజ్ఞ చెల్లె
నని మహానందభరితుడయి ధవళగజారూఢుండగు కక్షీవంతుని సము
ఖంబునకు బోయి హే బ్రాహ్మణోత్తమా నీ వెవరికుమారుండవు నీనామధే
యంబెద్ది నీవెవరికి శిష్యుండవు యీగజంబెక్కి యెక్కడికి బోదలంచితి
వని స్వనయుండను రాజడిగెను.

తదనంతరము దీర్ఘతమస్సు యొక్క కుమారుడ కక్షీవంతుడని
నాపేరు స్వనయుడనే రాజర్షి పట్టణంబుకు బోయి యా రాజకుమార్తెను
మనోరమయను కన్యకను వివాహంబగు నిచ్చగలిగి పోవుచున్నానని కక్షీ
వంతుండు జెప్పిన స్వనయుండు సంతోషించి కృతార్థోహం కృతా
ర్థోహమనుచు వచించుచు హే పండితోత్తమా నీవు పోదలచిన స్వన
యుండను నేనే మనోరమయను కన్యక నాదూతయే బహుకాలంబునుంచి
నారదవాక్యంబులు నమ్మి యెదురు జూచుచున్న నాకు నీదర్శనం బొసగుట
యదృష్టంబే కదా మధురాపట్టణంబులో నా చిన్నది యున్నది. మీరు విచ్చేసి
వివాహంబు గావలయునని కోరెను.

అందుకావున హే రాజోత్తమా మా గురువాజ్ఞ ప్రకారంబు సమ
క్షూడై సంతోషించితిగాని వేదారణ్యంబులో మా తలిదండ్రు లున్నారు

వారికడకుఁగవిపునివిపి వారిని దోడ్తెచ్చి నాకువివాహంబొనరింపుమనిన రాజుసంతోషించి సుదర్శనుడను బ్రాహ్మణోత్తమునిసమస్తసైన్యంబులుతోడుయిచ్చి వేదారణ్యంబునుదోలించిన వారేగి తాముచ్చినవర్తమానంబుతయుపినిపి. చినదీర్ఘతమునుండు సంతోషించిసుదర్శనున కాసనార్ఘ్యపాద్యాద్యుపచారంబులుసలిపియన్యోన్యంబు కుశలప్రశ్నలైన పిమ్మట భోజనంబులొనరించివివాహనార్థమ్ములైసమస్తసైన్యంబులు తోడరాగ సుదర్శన సహితుండై యారుదినంబులకగస్త్యతీర్థ తీరసమీపంబున కేతెంచిరి.

అంతట తండ్రినిజూచి కక్షీవంతుండు పాదాభి వందనంబు గావించిన దీవించి యాలింగనంబు చేసుకొని మూర్ధ్నిఘ్రాణంబుచేసి సంతోషించుచున్న నెడ సుదర్శనుండు జెప్పటచే దీర్ఘతమునుండు వచ్చుట విని స్వనయుండేగి దీర్ఘతమున్సునకు పాదాభివందనంబుచేసిన లేచి కౌగలించుకొనియన్యోన్య కుశలప్రశ్నలైన పిమ్మట వివాహములు జరుగుచున్నసమయంబులో కక్షీవంతుని గురువగు సుదంకమహాముని విచ్చేసిన సమస్తజనులు ప్రత్యుత్థానంబులు చేసిరి కక్షీవంతుం డెదురేగి గురుపాదంబులపై బడి గోత్రనామోచ్చారణంబు నేయుచు సాష్టాంగంబుచేసిన యాశీర్వదించి గృచ్చియెత్తి మూర్ధ్నిఘ్రాణంబుచేసి వత్సానీమనోరథసిద్ధియాయనాయని కుశలంబడిగి కూర్చున్నయెడ దీర్ఘతమో ఋషియు వచ్చి యుదంకునికి నమస్కారంబులుచేసి ప్రత్యుత్థానంబు గావించి పునర్నమస్కారంబుచేసియన్యోన్యకుశల ప్రశ్నలుజరిగినపిమ్మటయందరుగూర్చుండిరి.

అప్పుడు స్వనయుండువచ్చి వారిద్దరికి నమస్కారంబులు గావించి కుశలంబడిగి తనకన్యను కక్షీవంతుని కివ్వ నిశ్చయించినమాటయెరిగించిన సుదంకుండు సంతోషించి తనవాక్యసంసిద్ధికానందించి వివాహ ప్రశంస ప్రసంగంబు జరిగించి రాజోత్తమా కక్షీవంతుని మానగరంబునకుదోడ్కొనిపోయి వివాహంబు చేసుటకంటే నీయగస్త్యతీర్థసన్నిధిని మాయెదుట వివాహంబు చేసితివేని యిహపరంబులకన్నిటికినిసర్వోత్తమంబుగాననీతనయనిచ్చటికి దోడితెప్పించుమని జెప్పిన పెద్దలవాక్యంబుముద్దుగాగైకొని సమస్తసైన్యంబులంబంపితనకుటుంబంబును మధురాపట్టణంబునుంచిరప్పించి

శుభముహూర్తంబున కన్యాదానంబు చేసి కక్షీవంతునికి మనోరమకు పాణిగ్రహణంబు చేయించి చతుర్దంతిగజంబుపై కూర్చుండబెట్టి పూరేగించి వివాహశోభనంబు గడిపి బ్రాహ్మణోత్తముల కగణ్యంబులగు ధనంబులు ననేకంబులగు రత్నకంబళంబులు దుకూల వస్త్రాభరణంబులు యథేచ్ఛగా కొల్లబెట్టి అల్లునకు బిడ్డకు కట్నంబులొసంగి ధవళగజంబుపై గూర్చుండ బెట్టి వేదారణ్యంబునకు శుభంబుగా సుఖంబుగ దోలించె

ఈ యగస్త్యతీర్థప్రభావంబున సుకంకుని వరంబు సఫలంబయ్యె మనోరమ ప్రతిజ్ఞ జెల్లె సకలజనంబులకు సంతోషం బయ్యె వింటిరా యగస్త్యతీర్థంబు మహోన్నతంబు

అంత భుక్తిముక్తిప్రదుండగు వేదాటవీనాథు సేవింపుచు చిరకాలంబు సుఖంబుండె నంతస్వనయుం డగస్త్యతీర్థంబునం గృతస్నానుండై నిజ సైన్యంబులం గూడి పురంబునకుం జని సుఖంబుండె నో మునీంద్రులారా యిట్లగస్త్య తీర్థస్నానప్రభావంబున కక్షీవంతుం డనన్యదుర్లభంబగు రాజకన్యకా పరిణయంబు గావించె నీయితిహాసంబు వేదసిద్ధంబును పుణ్యప్రదంబును యశస్సౌభాగ్యకారియునై వెలయుచుండు.

అక్కడ స్నానంబు గావించి తదుపరి రామ కుండంబునకు బోవలయును.

—* రామకుండమాహాత్మ్యము. *—

మునులారా రామతీర్థంబువంటి మహాతీర్థంబు లోక తీర్థంబులలో లేదు సుండీ రామతీర్థంబు సన్నిధి నొకతృణంబు దానంబు చేసిన కోటిగుణిత ఫలంబు నొసగును నగస్త్యమహాముని శిష్యుండగు సుతీక్ష్ణుండను మహాముని రామకుండంబు సన్నిధిలో శ్రీరామ మంత్రంబును ప్రతి దినంబును పంచసహస్రంబులు జపంబు సేయుచు భిక్షాశియై నియత వ్రతస్థుండయి బహుకాలంబు తపంబు చేసి సీతాసమేతుండగు శ్రీరామదేవుని మనోధారణచే ధ్యానంబు చేసి ననుగ్రహించి ప్రత్యక్షం బయిన సుతీక్ష్ణుండు శ్రీరామచంద్రుల స్తుతించెను.

## ౫౭ శ్రీ సేతు రామేశ్వరమాహాత్మ్యము.

తమ స్త్రంసేతుమాహాత్మ్యే॥ శ్లో॥ సుతీక్ష్ణః ॥ నమస్తే జానకీ నాథ నమస్తేహానుమత్ప్రియః । నమస్తేకౌశికి మునియాగరక్షణ దీక్షిత నమస్తే కౌసలేయాయ విశ్వామిత్రప్రియాయచ॥ ఇతి॥

ఇవ్విధంబున ననేకవిధంబుల గొప్పగా స్తోత్రంబు గావించుచు నీప్రకారంబున ప్రతిదినంబును జపంబుసేయుచు బహుదినంబులు గడచిన రామచంద్రునికటాక్షంబున నేనద్వైతజ్ఞానంబును ప్రత్యగాత్మైక్యకలక్షణం బునుత్రయీధర్మవిచారంబున ననేకవిద్యాప్రసంగకర్తృత్వంబును పరకాయప్రవేశంబును వియద్గమనవిహారంబును సర్వకళా విచక్షణత్వంబును బ్రహ్మవిష్ణు మహేశ్వరాది లోకంబులకు పోకడ రాకడయు పిపీలికాది సమస్తజంతు భాషాపరిజ్ఞానంబును యింద్రియాగమ్య వస్తు దర్శనంబును మొదలగు విశేషంబు లాతీర్థస్నానమాహాత్మ్యంబున దొరికెను

ఓ మునీంద్రులారా శ్రీరామకుండతీర్థమాహాత్మ్యం బఖండంబని జెప్పి మరియు నాతీర్థంబున శ్రీరామచంద్రుండు స్థాపించిన లింగంబు మహా పాతక నాశనంబు భుక్తి ముక్తిప్రదంబు నా లింగంబునకు నభిషేక పూజ లొనర్చినవారికిసకల యిశ్వర్య సిద్ధిగలుగును మరియొక్కవిశేషంబు జెప్పెద వినుండు కురుపాండవ యుద్ధంబులో భీష్ముండు జెల్లినపిదప ద్రోణాచార్యు లకు సేనాధిపత్యపట్టాభిషేకంబుగావించినదుర్యోధనునిభక్తికి సంతోషించి ధనురాచార్యుడు మహా శౌర్యంబున సకల సైన్యంబుల నేల గలుపుచు నప్రతిద్వంద్వ యుద్ధంబుసేయుచున్న పాండవులొర్వక శ్రీకృష్ణమూర్తితో మంత్రాలోచనంబు సేయుచు ద్రోణాచార్యుండు మృతిబొందు నుపా యంబులు వెదకుచు నవశులై యుండిరి

అంతటనొకనాడు భీమునికిద్రోణాచార్యులకు యుద్ధం బగుచుండ భీముండోర్వలేక హేధనురాచార్యా లోకంబులలో బ్రాహ్మణ ధర్మంబులు వేదాధ్యయనంబు శ్రౌతస్మార్తకర్మనిత్యానుష్ఠానం బహింసయుమీరుబ్రాం

బ్రాహ్మణధర్మంబు విడిచి శస్త్రాస్త్రధారణంబు జేసి బహుజనంబుల హింసింపుచు కళత్రపుత్రసంరక్షణకొఱకే గదా వ్యాధుండు బహుమృగంబుల జంపి దారాపుత్రాదుల బోషించినవిధంబు నగుచుట యుక్తంబు గాదైనను నీ కుమారుండగు యశ్వత్థామ యుద్ధంబులో మృతుడయ్యె నింక యుద్ధంబు జేసి యెవ్వరిని బ్రతికించుకొఱకు గావున కార్యంబు మాని బ్రాహ్మణ ధర్మంబు స్వీకరింపు మన్నను యశ్వత్థామ మృతిబొందెనని జెప్పినమనోవైకల్యంబు నొంది యాలోచించి నీమాట నాకు సత్యంబని తోచదు. ధర్మసుతుండగు యుధిష్ఠిరుండు సత్యవాక్యపరిపాలకుండు గావున నతండు నాయెదట సత్యంబని వచించెనేని నమ్మెదను యుద్ధసాధనంబులు విడుతునని వచించె

అటుపిమ్మట నందరు కృష్ణునితో జెప్పినవిచారించి కృష్ణునిం దోడ్కొని ధర్మరాజుపాలికిం బోయి ఈ కథావృత్తాంతంబంతయు నారాజుకు వినిపించి నీవీమాట ద్రోణాచార్యునెదుట బలికితి వేని యతడు నస్త్ర సన్యాసంబు జేసునప్పుడు మనకు జయంబునకు త్రోవదొరుకునని బహు విధంబుల భీమాదులు జెప్పిన ధర్మరాజు వినకున్న శ్రీకృష్ణుం డంతపై రాజా నీవీ కార్యంబు జేసిన దోషంబు లేదు ప్రాణసంరక్షణకై యసత్యంబున దోషంబు రాదని పురాణంబులు ధర్మశాస్త్రంబులు జెప్పుచున్నవని యనేకవిధంబుల నొప్పించి మెప్పించి మరియొక యుపాయంబు గల దశ్వత్థామయను గజంబు భీమునిచే మృతి నొందినమాట సత్యంబు గదా యిదే తీరున నీవు బలికినదాని యుపాయంబు మే మొనగూర్తుమని శ్రీకృష్ణమూర్తి నయంబున భయంబున వినయంబున నుపాయంబున బొందుపఱుప నెట్టకేలకు కృష్ణునిమాట మీంచ జాలక నొప్పుకొనియెను.

తర్వాత పసుగుసు గుమిగూర్చుకొని ద్రోణాచార్యునెదటికిబోయి నిలిచి ధర్మరాజు ముఖవచనంబున ఈ దినంబున భీమునిచే యశ్వత్థామ యనువరకు స్ఫుటంబుగా బలికె గజంబు॥ యనుశబ్దంబు॥ మెల్లసగా బలికె॥ నంతలో భేరీప్రణవాదులు వాయించిరి ॥ చచ్చెననుశబ్దంబు ॥ దృఢంబుగా బలికె॥ నామాటవిని ద్రోణాచార్యుండు ధర్మరాజ సత్యంబు బలకడని నమ్మి ధనుర్బాణంబులు విడిచి యస్త్రసన్యాసంబు గయికొని విరక్తుండై మరణాయత్తచిత్తుండై గాఢసమాధిచేత హఠయోగంబుచే ప్రాణత్యాగంబు జేసె.

అంతట దృష్టద్యుమ్నుండు రథంబుపై నురికి ద్రోణాచార్యుని కేశంబులచేత నమర్చుకొని ఖడ్గంబున శిరంబు ఖండించె నర్జునాదులం డలంచి రంతట నశ్వత్థామ యీసమాచారంబువిని కోపోద్రిక్తుండై కొన్ని ప్రతిజ్ఞలం జేసె. తదుపరియుద్ధంబంతయు శాంతంబై ధర్మరాజునకు ధౌమ్యాదులు శుభముహూర్తంబున పట్టాభిషేకంబు జేసుటకై సంకల్పంబు జేసిన నాకాశంబున నో ధర్మరాజా నీవసత్యవాక్యంబువలికి ద్రోహరూపంబయిన ద్రోణవధోపాయంబు గావించితివి గావున నిందువలననసత్యదోషంబును గురుద్రోహము నీమాట నమ్మెదునని విశ్వసించినదానిచే విశ్వాస ఘాతుకంబును బ్రహ్మహత్యయు నిన్ని జతగూడియున్నవి. గావుననీపాపములు బాపుకొనుదనుక పట్టాభిషేకంబున కర్హుండవుగావని లోకంబువిన నాకాశంబున మ్రోగెను.

ఆమాటలకు ధర్మరాజు లజ్జాభయాకుల చిత్తుండై ధౌమ్యాదిరుషులందరు శ్రీకృష్ణమూర్తితో నాలోచించుచు చింతించుచున్న సమయమున వేదవ్యాసుడచ్చటికివిచ్చేయ సభాసదులందరు ప్రత్యుత్థానము జేసిరి. యుధిష్ఠిరు డనుజసహితుడై యెదురేగి పాదాక్రాంతుడై తోడ్కొని వచ్చి మణిమయపీఠంబునపై కూర్చుండబెట్టి వివిధోపచారంబులుజరిపియంజలిబద్ధుడై నిలిచి యోమహాత్మా యశరీరవాణివ్విధంబున బలికిన దిందు కేమిసాధనంబు మీకంటె పాపకులు మాకెవ్వరు లేరుగదా యస్మద్రక్షణోపాయంబు విచారించి రక్షింపురక్షింపుమనుచు ప్రార్థించెను.

అందుకు పారాశర్యుం డాలోచించి రాజోత్తమా వెరువ కొక యుపాయంబు జెప్పెద సేతుమూలంబునగంధమాదనపర్వతంబుమీదరామకుండంబుగలదు. అదిమహాపాతకుల పాపముల జేసినది నీవుచింతించక చ్చటికేగి యాతీర్థంబులో యథా శాస్త్రంబుగా స్నానంబు సేయుము నీపాపంబులన్నియు భస్మంబగునని చెప్పిన సంతోషించి తమ్ములుదానును ద్రౌపది తల్లియును ధౌమ్యుండుతోడరాగ బయలు దేరి గంధమాదన పర్వతంబునకు పోయి రామకుండంబులో యథా సంకల్పవిధిగా స్నానంబు జేసి తేతోపవాసంబు జేసి పార్వణ విధానంబుగా శ్రాద్ధంబు జరిగించి విత్త శాఠ్యంబు లేకుండ దానంబులు దినాథ కృపణులకు వస్త్రంబు లన్నంబులు బెట్టించి

యొక్క మాసంబు నియతాహారుండై యక్కడ యుండి సత్కథాశ్రవణంబు సేయుచుండెను.

అంతట నొకదినంబున నశరీరవాణి ధర్మనందనా నీవు పవిత్రుడ వయితివి రాజ్యార్హుండవైతివి నీవు హస్తినాపురంబునకుబోయి మంత్రి సామంత పురోహితాదులు గొలువ పట్టాభిషిక్తుడవై యథా సుఖంబున రాజ్యపరిపాలన సేయుమని వినబడ్డ ధౌమ్యాది మహామునులు సంతోషించిరి ధర్మరాజు శ్రీరామప్రతిష్ఠితంబగు లింగమున కభిషేక పూజాదులు జరిగించి యనేకదానంబులు కొల్లబెట్టి తమ్ములు తానును కరినగరంబు నకువచ్చి యథాశాస్త్రంబుగా పట్టాభిషిక్తుడయ్యె. మునీంద్రులారా రామ తీర్థ మాహాత్మ్యంబద్భుతంబు వింటిరిగదా యాతీర్థంబునకుపోవనశక్తు లగు వారీయధ్యాయంబుజదివిన వినిన కైలాసవాసులగుదురని చెప్పియా తీర్థంబులో స్నానంబు జేసి లక్ష్మణతీర్థమునకు పోవలయు.

—* లక్ష్మణతీర్థమాహాత్మ్యము. *—

ఈతీర్థంబు మహోత్తమంబైనది మహాపాతక నాశనకరంబైనది బలరామునకు బ్రహ్మహత్యానివృత్తిగావించిన తీర్థంబని సూతా బల రామునకు బ్రహ్మహత్యయెట్లు సంభవించె నావృత్తాంతంబు వినుపింపు మనిన మునులారా కురుపాండవులకు యుద్ధసన్నద్ధంబైనసమయంబునబల భద్రుండొకరి పక్షంబును బొందక మధ్యస్థుండై యాఘోర కార్యంబు కన్నుల జూడజాలక యాత్రా ఫలంబున బయలుదేరి ప్రభాస తీర్థం బునకు జేరెను.

అచ్చట దేవర్షి పితృగణంబులకు తృప్తి గావించి తదనంతరమున సరస్వతి పృథూదక బ్రహ్మతీర్థంబులు మొదలగుతీర్థంబులయాత్రలు సలిపి నైమిశారణ్యమునకు పోయి దీర్ఘసత్రంబుగావించుచున్న మునీం ద్రులందరు ప్రత్యుద్ధానాభి వందనంబులు స్తోత్రంబులు సేయుచు బహు

మాసించిన నంతోషించియున్నతాసనంబుపై గూర్చుండియున్నతగ్రీవుడై లేవకున్న సూతునింజూచి మహాక్రోధంబుతో కర్షనింప్యముచు లోమజుడగు నీసూతుడు నేనువచ్చిన లేవక మహాగర్వంబుతో నున్నవాడు వీడు మునులకన్న యెక్కువకాముగదాయని క్రోధతామ్రాక్షుడై చేతిలోనున్న కుశాగ్రంబుతో మొత్తిన శిరంబుభిన్నంబై సూతుడు మృతుడయ్యె.

అంతట మునీంద్రులంద రాహాకారంబులు నేయుచు బలరామా నీవుసాక్షాచ్ఛేషాంశా నంభూతుడవు మహాత్ముని వ్యాధంబున ఘోరాకారంబు జేసితివి గాన బ్రహ్మహత్యాపరీతుడవై తివిదీనికి ప్రాయశ్చిత్తంబునీక వశ్యంబని నిర్ణయించిన బలభద్రుండు చింతాక్రాంతుడై భూసురేంద్రులారా నీనినిష్కృతి మీరేవివరించి చెప్పదగుదురని ప్రార్థించినబలరామా నీప్రభావంబులజూడ మృత్యుంజయ పరాక్రముడవుగాన నితని పునర్జీవితునిం గావింపుము నీబ్రహ్మహత్యమానుననిన సంకర్షణుడు నా మాయాబలంబున బ్రతికింతునని పునర్జీవితుని గావించె.

అప్పుడు మునీంద్రులు సంతసించిరి మునులకై జూచిబలరాముడు మరి మీకోరికేమనియడిగిన బలభద్రా మేము సతతంబుయజ్ఞంబులు గావింపుచుండ నిల్వ లుండను రాక్షసపుత్రుడు వల్కలు డనువాడు సర్వకాలంబుల హోమ నమయంబునమూత్రపురీషరక్తవర్షంబులుగురిపించుచు యజ్ఞంబులు పాడుజేయు మరి వాడెవ్వరికజేయుడుగాని బాధ తీర్చితివేని మేము సుఖింతుము మనోభీష్టసిద్ధి గలుగునని ప్రార్థించిన సర్వకాలము కూడునంత కక్కడనివసించి యుండిపర్వసమయంబున బ్రాహ్మణోత్తములు హోమము నేయుచున్న సమయంబున నారాక్షసుడునీలపర్వతంబుభంగి మహాకాయుండును కరాళదంష్ట్రిండును వికృతాకారుడును రక్తాక్షుడు నూర్ధ్వకేశుడునై వచ్చి యజ్ఞాగారంబుల పవిత్రంబులు సేయుచుండెను. అదిజూచి ముసలసిరంబుల దలంచినసన్నిహితంబులగుటయు ముసలంబుచే

నొక పెట్టు బెట్టిన భిన్న శిరస్కుఁడై నేలగూలి ప్రాణంబులు విడిచె మును లత్యానందంబు నొందిరి తదుపరి బలరాముండు మునీంద్రులారా నాకె య్యది కర్తవ్యంబు జెప్పుండని యడిగిన రామా మరి యుంక నెయ్యదికర్త వ్యంబని యడిగితివి గాన నొక సంవత్సరంబు సకలతీర్థయాత్రా సమాప్తి జరిగించితివేని లోకంబునకుపకారంబగు నీదోషంబు నిశ్శేషంబగు ననిన సంతోషించి కృష్ణాగ్రజుండు సర్వతీర్థంబులు గ్రుంకులాడి నిజ పురంబు నకు బోవుచుండెను.

అంతట నశరీరవాణి యోరోహిణేయ నీకు యాత్రా పూర్తిఁ గాలేదు బ్రహ్మహత్యా నిశ్శేషంబు గాలేదని యొక ధ్వని వినవచ్చిన చింతాక్రాంతుండై మగలి నైమిశారణ్యమునకు బోయి మునీంద్రుల కా సమాచారము వినిపించినబలరామా నీవుగంధమాదనపర్వతంబున శేషాం శావిర్భూతుండగు లక్ష్మణునిచే నిర్మించబడిన తీర్థంబులోస్నానం బొన రించితివేని యాత్రా సంపూర్తిఁగలిగి దోషంబు నిశ్శేషంబగునని జెప్పిన బలరాముండు తత్క్షణంబున లక్ష్మణతీర్థంబునకుబోయి స్నానంబు జేసిన నాకాశవాణి బలభద్రాకృతార్థుండవైతివి నీపురంబునకు బొమ్మని వినవచ్చిన సంతోషించి ద్వారకానగరంబునకు బోయెను.

కావున లక్ష్మణతీర్థ మాహాత్మ్యమిట్టి దక్కడ స్నానమాచరించి జటాయుతీర్థంబునకుబోవలయును.

—* జటాతీర్థమాహాత్మ్యము. *—

అది మహోత్తమతీర్థంబజ్ఞాననాశన సాధనం బవిద్యానాశనకారి బుద్ధి శుద్ధిప్రదంబు భుక్తి ముక్తిప్రదంబు మనశ్శుద్ధని గోరినవారు మహా దుర్ఘటంబులగు వేదాంత శాస్త్రంబులు జదివి తర్కములు జేసి క్రియా పర్యవసానంబు నొందజాలరు జటాతీర్థంబులో స్నానమాత్రంబులోపరిశు ద్ధులగుదురని జెప్పిన సూతా యాతీర్థంబున కంతమహాత్మ్యంబెట్లుగల్గె

నని యడిగిన మునీంద్రులారా శ్రీరామచంద్రుడు చతుర్దశ సంవత్సరంబులు జటాధారియై వనవాసంబుజేసి తపస్సుగావించి రావణవధానంతరము జటామండలం బాతీర్థంబు గో ప్రక్షాళనంబు జేసుటచే తపఃప్రభావ ధూపాపూర్వఫలంబా సలిలంబులలో మేళనంబగుటచే దానికింత మహాత్మ్యంబు సిద్ధించినది

వింటిరా మునులారా పుణ్యంబుల తారతమ్యంబులు వినిపించెద షష్టిసహస్ర వర్షంబులు జాహ్నవీ నదిలో స్నానంబుజేసిన ఫలంబు దేవగురుండగు బృహస్పతి సింహరాశిస్థితుడైన సమయంబున నొకదినంబు గోదావరిలో స్నానంబుజేసిన లభించునటువంటి గోదావరి పుష్కరిణీ స్నానంబులు పదివేలు గావించిన ఫలంబు గోమతీనదిలో నొకసంవత్సరంబు స్నానంబుజేసిన ఫలించు నిన్నిమహాపుణ్యంబులు గంధమాదన పర్వతంబున జటాతీర్థ దర్శనమాత్రంబున లభించుస్నానంబుజేసినవారికెంత పుణ్యముగలదో నే నెంచజాల నా త్రిమూర్తులకే తెలియును.

పూర్వకాలంబున వరుణపుత్రుండగు భృగువు మనశ్శుద్ధిగోరి తండ్రినడిగిన వరుణుండు వారుణికిం జెప్పిన జ్ఞానంబు వినిపించెద వినుండు.

తదుక్తంస్కాందే॥ శ్లో॥ భృగుర్వై వారుణిః పూర్వం వరుణం పితరంతదా। బుద్ధిశుద్ధిప్రదోపాయము పృచ్ఛత్పావనంశుభం॥

వరుణః॥ రామసేతౌ భృగోపుణ్యే గంధమాదన పర్వతే। స్నానమాత్రాజ్జటాతీర్థేబుద్ధిశుద్ధి ర్భవే ద్ధ్రువం॥

ఇవ్విధంబున తండ్రి యాజ్ఞాప్రకారంబున భృగుడు జటాతీర్థంబులోస్నానంబుజేసి బుద్ధిమంతుడయ్యె నొకనాడు శుకయోగీంద్రుండు జనకుండగు వేదవ్యాస మహాముని యాజ్ఞవలన స్నానం బాచరించి స్వస్వరూపజ్ఞానానంద భరితుండై నిర్మలుండయ్యె గావునజటాతీర్థ మాహాత్మ్యంబగణ్యంబునచ్చట స్నానంబుగావించిలక్ష్మీతీర్థంబునకు బోవలయు.

—*లక్ష్మీ తీర్థ మాహాత్మ్యము.*—

ఆతీర్థంబు మహాలక్ష్మీప్రదంబెట్టిదరిద్రులైన వెట్టి కష్టబాధితుల యిన నాతీర్థంబులో స్నానంబుచేసిరేని శ్రీమంతు లగుదురు. ధర్మరాజు యాతీర్థంబులో స్నానంబుచేసి మహాదైశ్వర్యాభివృద్ధిగల్గి రాజసూయం బొనరించె రాజ్యాభిషిక్తుండయ్యె శత్రునాశనంబుగావించెనని జెప్పిన సూతా ధర్మరాజున కాతీర్థ మాహాత్మ్యం బెవ్వరు జెప్పిరతం డేరీతి స్నానంబు చేసె కథాక్రమంబు వినుపింపుమనిరి.

ఓమునీంద్రులారా ధర్మ రాజాదులు ధృతరాష్ట్రునిచే బిలువబడి యింద్ర ప్రస్థంబులో నున్నయెడ శ్రీ కృష్ణమూర్తి వారి దర్శనార్థం బేగి కొన్నిదినంబు లక్కడయున్న సమయంబులో నొకనాడు ధర్మరాజు కృష్ణ మూర్తితో పుండరీకాక్షా దుర్యోధనుండు మహాభాగ్యం బనుభవించు చుండె మేమీరీతి శ్రమలనుభవించుచుంటిమిస్వామీకటాక్షంబుంచిమాకు సుఖోపాయంబుజెప్పవా నీకంటె మాకధికు లెవరుగలరని ప్రార్థించిన వాసుదేవుండు విచారించి యుధిష్ఠిరా గంధమాదన పర్వతంబు మీద లక్ష్మీతీర్థమని యున్నదనేకు లాతీర్థంబులో స్నానంబుచేసి శ్రీమంతు లైరిగావుననీవుసహోదర సహితుండవై యచ్చటికరిగి కృతస్నానుండ వైన నీకష్టంబు దీరును. నీకు శ్రేయస్సు యశస్సు సంభవించు నని జెప్పెను.

తత్క్షణంబున భార్యా సమేతుడై పోయి యా తీర్థంబులో స్నానంబుచేసివచ్చి దిగ్విజయంబుచేసి రాజసూయయాగంబొనరించి మహోన్నతమైన భాగ్యంబును సుకీర్తినింబొందె వింటిరా మునీంద్రులారా ధర్మ రాజున కైశ్వర్యకారణం బాతీర్థస్నానంబున యెవరుస్నానంబాచరించిన లక్ష్మీవంతులగుటకు సందేహంబు లేదక్కడ స్నానంబుచేసి తదనంతరం బగ్నితీర్థంబునకు బోవలయు.

—* అగ్ని తీర్థ మాహాత్మ్యము. *—

ఇది మహాతీర్థంబు సర్వపాపహరణంబు పిశాచాది మహా పీడా నివారకంబు మునీంద్రులారా దానిమాహాత్మ్యంబు నేను వర్ణించ జాల ననిన సూతానీకు దెలిసినంత నట్లాతీర్థ మాహాత్మ్యంబువినుపించుమని వేడిన మునీంద్రులారా శ్రీరామచంద్రుండు రావణాసురునివధించి విభీషణునకా చంద్రతారార్కంబుగా ప్రభుత్వంబు సేయుకొరకు పట్టాభిషేకంబు చేసి సీతాలక్ష్మణ సహితుడై సముద్రతీరంబునసంచరించుచు సీతా మనోదా ర్ఢ్యం బెటువలెనుండెనో యిన్నిదినంబులు రాక్షసునింట నుండెనని మన స్సులో జిజ్ఞాస చేయుచు వచ్చుచున్న నగ్నిదేవుండు లక్ష్మీ తీర్థంబునకు సమీపస్థలంబగు సముద్రంబులోనుంచి యా తామ్రలోచనుండును పీత వస్త్రుండును దనుర్ధారుండును సప్తజిహ్వుండును మహా తేజస్సుచే దశ దిశాంతరాళంబులు వెలిగించుచు హనుమదంగద సుగ్రీవ విభీషణాది సమ స్తసైన్యంబులు విన లీలా మానుష విగ్రహుండగు శ్రీరామమూర్తితో నిట్లనియె.

ఓ రాఘవా ఈ సీతా పతివ్రతా ప్రభావంబుచే నీవు రావణా సురునిజయించితి విదిసత్యంబు సత్యంబు పునస్సత్యంబీ సీతాదేవి సాక్షా ల్లక్ష్మీయంశచే యుద్భవించినది పరశురామావతార కాలంబున ధరణీ దేవియు నీయవతారంబున జానకీదేవియు కృష్ణావతార కాలంబున రుక్మిణీ దేవియు కాగలదు శ్రీమహావిష్ణుండవగునీవు లోకరక్షణార్థంబు దుష్టశిక్ష ణార్థం బవతారము లైన యెడల ననపాయినియగు లక్ష్మీదేవి సీతాది స్వరూపంబులతో నుదయించగలదని యగ్నిహోత్రుండు లోకంబులు విన ప్రత్యక్షంబుగా బలికిన సమస్తజను లాశ్చర్యంబు నొందిరి శ్రీరామ చంద్రునినికి మనోనిర్మలంబయ్యె.

అప్పటినుంచి యగ్నితీర్థంబని విశ్రుతంబయ్యె ననిజెప్పిన సూతా యాతీర్థంబులో నెవరు కృతార్థులయిరని యడిగినమునులారా పూర్వకాలంబున పాటలీపురంబని యొక పట్టణంబుగల దాపట్టణంబులో పశుమతుడనువైశ్యశిఖామణి గలడతనికి ముగ్గురుభార్యలు మహాపతివ్రతలు అతడు మహాధర్మాత్ముడు దానశీలుడు భాగ్యవంతు డతనికి పదుగురు కొడుకులు సుపుణ్యుడు పుణ్యవంతుండు చారుపుణ్యుడు మొదలగుతొమ్మండ్రు సుతులు బహుపుణ్యబుద్ధులు వ్యవహారదక్షులు సంసారరక్షణదక్షులు సన్మార్గప్రవర్తులుగా నున్నారు.

పదియగువాడు దుష్పాపుండ నుపేరును వహించె బాల్యప్రభృతి బహుక్రూర కార్యంబులు సేయుచు పట్టణంబులోనున్న శిశువులరహస్యంబుగాబట్టి బలవన్మరణంబు సేయుచు నీటిలోపడద్రొబ్బు పంకంబులోద్రొక్కు నడవిలో గొంతుబిసుకు ననేకవిధంబుల శిశుమారణం బగుటచేగ్రామంబు పాడయ్యెనీవార్త రాజువిని బాలవధ జేయువాని పట్టితెమ్మనితలవరిప్రభుతుల కత్యంతతీక్ష్ణంబైన యాజ్ఞ జేసె నెంతవెదకిన దొరకకుంతట నొకదినంబున నైదుగురు వైశ్యపుత్రుల నాటలపేరుబెట్టితీసుకొని గ్రామంబునకు నతిదూరంబులోనున్న నొకకొలనులో జలక్రీడవినోదంబు జూపించి వంచి కంఠదఘ్నమగు రొంపిలోదించి తానుగ్రామంబులోనికి జనుదెంచె.

అంతట నావైశ్యులు పిల్లలవెదకుచుపిలుచుచుఘోషించుచుతిరిగి తిరిగి యామడుగు సమీపంబునకుబోయి యాపిల్లలపేరుతోపిలిచిన ప్రతిధ్వనులిచ్చిన జాడతో మడుగులోనికిదిగి తృణశైవాలాది సంకులంబగు పంకంబులో ఝుంకుచు గ్రుంకుచున్న బాలులంగాంచి వెడలించి దేహప్రక్షాళనంబులుజేసి నేదదీర్చి యడిగిన జరిగిన వృత్తాంతంబంతయు దుష్పాపుని చరిత్రం బంతయు వినుపించినవిని రాజుకొలువునకుబోయి జరిగినవాస్తవంబెల్లవినిపించిన రాజుచింతాశ్చర్యంబులచే విభ్రాంతుండై దుష్పా

పుని వానితండ్రి పశుమంతుని పట్టితెప్పించి విమర్శింప విమర్శింప గ్రామంబులో మృతిబొందినట్టి బాలులందరు వీనిచే మృతులగుట నిశ్చయంబై వానితండ్రిని బిలిచి నీకొమారునకేమి శిక్షకావలయునని యడిగిన రాజోత్తమావీడు బహు బాలఘాతకుండుగావున శిరచ్ఛేదనంబున కర్హుండిందుకు సందేహంబులేదని చెప్పెను

అతని నిష్పక్షపాతవాక్యంబునకందరాశ్చర్యపడి రాజాయితనువాస్తవప్రసంగంబు జేసెను గనుక నితనితనయుని గ్రామంబు వెడలగొట్టవలయుగాని శిరచ్ఛేదనంబు మానవలయునని పట్టణాశేషంబు వలికిన రాజావారిపలుకు మన్నించి తనదేశంబు దాట ద్రోయించె. నా దుష్టాపుండు దుఃఖించుచుబోయిపోయి గొప్పయరణ్యంబులోమునిమండలమండితంబగు నగ్రహారంబులో భిక్షాశివనంబు సేయుచు కొన్నిదివసంబుల కుగ్రశవసుండను బ్రాహ్మణుని పట్టిని పట్టుకొనిపోయి జలంబులముంచి జంపిన నా విప్రుండు దుఃఖించి వోపాపాత్మా నీవిట్టి పాపకృత్యంబు జేసితివి గావున నీవును జలంబులో నుద్బంధమరణంబునొంది రౌరవాదినరకవాసంబులను భవించి తదుపరి పిశాచరూపంబుతో నభక్ష్యా భక్ష్యాది కార్యా కార్యంబులు జరిగించుచు ఘోరాతి దుఃఖంబు లనుభవించుదు వని క్రూరం బగు శాపంబిచ్చెను.

ఆవిధంబున మృతుండయి పిశాచరూపంబుతో బాధల నొందుచు దేశదేశంబు లరణ్యంబులు పర్వతంబులు దిరుగుచుదైవఘటనంబున నగస్త్యాశ్రమ సమీపంబున నోబ్రాహ్మణోత్తములారా నేనుపాటలీపురంబను పట్టణంబులో పశుమంతుండను వైశ్యునికి దశమపుత్రుండ నేను బాల్యప్రభృతియు నొనరించిన పాపంబు లివియు యుగ్రశ్రవసుండను బ్రాహ్మణుని శాపంబుచే జలంబులో నుద్బంధమరణంబునొంది నరకంబులనుభవించి పిశాచంబునై యీరీతి దుఃఖంబు లనుభవించుచున్నాడ మీరు తప

స్సంపన్నులు వేద వేదాంత వేత్తలుమీచెంతకుచేరితిని నన్ను రక్షించినాశాపవిమోక్షణంబు గావించితి రేనిసుఖంబెదమీరువేక్షజేయుదు రేనిశిశుమారణకృత్యంబు నాకుసహజంబేకదా యని యిట్టివిధంబున సామ భేదోపాయ వాక్యంబులు బలుకుచు దిరుగుచునుండ సంగులోకొందరుబ్రాహ్మణోత్తములగస్త్యమహాముని పాలికిబోయి విన్నవృత్తాంతంబంతయు విన్నవించిరి.

అగస్త్యుండు కటాక్షించితన ప్రియశిష్యుండగుసుతీక్ష్ణమునినిబిలిచి మునీంద్రా నీవాపిశాచ నివృత్తికొరకతని నామంబుతో సంకల్పంబుజెప్పి గంధమాదనపర్వతంబుమీద నగ్నితీర్థంబులో స్నానంబు జేసితివేని వాని పిశాచత్వంబుమానునని యాజ్ఞాపించిన విని యాజ్ఞశిరసావహించి సుతీక్ష్ణుండగ్నితీర్థంబునకుపోయి వానినామోద్దేశపూర్వకంబుగా సంకల్పంబుజెప్పి గంధమాదన పర్వతంబుమీద నగ్నితీర్థంబులో త్రిదినంబు స్నానంబుజేసిన వాని పిశాచత్వంబుమాని మహాసుందర రూపంబుతో విమానంబు నెక్కి యగస్త్యుని గొనియాడుచు స్వర్గంబునకు నేగెనని చెప్పెను.

మునీంద్రులు విస్మయంబుగొంది నీ వెట్టిపుణ్యపురుషుండ వెన్నిపురాణంబు లెఱుంగుదువు నీసాంగత్యంబున మేము కృతార్థుల మైతిమని స్తుతియించి ముందు కథవినుపించుమనిన మునులారా యగ్ని తీర్థంబులోస్నానంబు జేసి చక్రతీర్థంబునకు పోవలయును.

—* ముని తీర్థమను చక్రతీర్థ మాహాత్మ్యము. *—

అది మహోన్నతంబగు తీర్థంబు పూర్వకాలంబున సూర్యునికి హస్తంబులు భిన్నంబులైన యాతీర్థంబులో స్నానంబు జేసినంతమాత్రంబున సువర్ణపాణియయ్యెననిన సూతా యిది యద్భుతచరిత్రంబు మహా మహాశ్చర్యకరంబుగావున నాతీర్థకథాక్రమంబును సక్రమంబుగావినుపించుమని కోరిన మునులారా పూర్వకాలంబున నహిర్బుధ్న్యుండనుమహాముని గంధమాదన పర్వతంబుపైనొకయాశ్రమంబు గల్పించుకొనియొకతీర్థంబు

నిర్మించి నిశ్చలచిత్తుండై తపంబుసేయుచున్న ముని తీర్థంబని వాడికగల్గి ప్రబలించి యుండెను.

అట్లుండగా నహిర్బుధ్న్యుండను ఋషీశ్వరుని మీఁదికి రాక్షససంఘంబు కూడివచ్చి మహాఘోరంబగు బాధనొనరించిన నవ్విప్రుండు సుదర్శన చక్రంబు నుద్దేశించి మహాస్తోత్రంబు జేసిన నా స్తోత్రంబునకు సంతసించి శ్రీవిష్ణుప్రేరితంబై చక్రంబు జనుదెంచి మహాక్రూరులగు రాక్షసుల ఛిన్నాభిన్నంబులుగావించి నామునిసంరక్షణ జేసియతని ప్రార్థనచే నాతీర్థంబులో నిల్చియుండుటచే దానికి చక్రతీర్థంబనిపేరు విశ్రుతంబయ్యె.

ఒకసమయంబున రాక్షసులు చెలరేగి దేవతలపై దండెత్తి స్వర్గంబుచిందరవందర జేసిన దేవతలు దీనులై బ్రహ్మపాలికేగి తమబాధలు జెప్పుకున్న చతుర్ముఖుండు చింతించి ఓ సురలారా గంధమాదన పర్వతంబు మీఁద మహేశ్వరయజ్ఞంబు ప్రారంభించి నిర్విఘ్న పరిసమాప్తి నెరవేర్చితిరేని రాక్షసహతంబగునని జెప్పిన బ్రహ్మయాజ్ఞా ప్రకారంబు దేవతలు బృహస్పతిని పురస్కరించుకొని గంధమాదన పర్వతంబునకేగి మహేశ్వర దేవతాకరంబగుయజ్ఞంబునకు సంకల్పంబు జేసి బ్రహ్మకడకుబోయి రాక్షసులు విఘ్నంబు జేయనిస్థలంబేర్పరింపుమని యడిగిన గంధమాదన పర్వతంబు మీఁద చక్రతీర్థసమీపంబున ప్రారంభంబుసేయుండు నిర్విఘ్నంబుగా జన్నంబు జరుగు నొకవేళ బాధించిన చక్రతీర్థంబులోనున్న సుదర్శనంబు నుప్రార్థించిను రాక్షస నాశనంబు జేయుననెను.

అదిపోయి యహిర్బుధ్న్యునమస్కరించి యాయన యాజ్ఞగైకొని తదాశ్రమ సమీపంబున యజ్ఞవాటంబు గల్పించి దేవతలు మునులందరు గుంపులై నిలిచిరి. బృహస్పతి హోతయయ్యె జయంతుండు మైత్రావరుణుండయ్యె మరియు నష్టమ వసువచ్ఛావాకుండయ్యె పరాశరుండు గ్రావస్తోతయయ్యె నష్టావక్రుండధ్వర్యుండయ్యె విశ్వామిత్రుండు ప్రతిప్రస్థాత

యయ్యె వరుణుండు నేష్టయు మహేశ్వరుం డుద్గాతయు సవిత బ్రహ్మయు వశిష్ఠుండు బ్రాహ్మణాచ్ఛంసియు శునశ్శేపుండాగ్నీధ్రుండును పావకుండు హోతయు వాయువుద్గాతయు మతంగుఁడుపస్థాతయు నగస్త్యుండు ప్రహర్తయు మధుచ్ఛందుండు సుబ్రహ్మణ్యుండును ఈ విధంబున నేర్పడి రింద్రుండు యజమానుండయ్యె వ్యాసపుత్రుండగు శుక్రుండు పద్రష్టయయ్యె. నివ్విధంబున మాహేశ్వరయజ్ఞంబు నిర్వర్తింప సుదర్శన భయంబుచే రాక్షసులు రావెరచిరి. యజ్ఞంబు నిర్విఘ్నపరిసమాప్తియయ్యె. హుతాశనుండు హవిర్భక్షణంబు గావించుచుండె నధ్వర్యుండు కర్మజాలంబు గావించి మంత్రపూతంబగు పురోడాశంబు హోమంబు గావించి హుతశేషంబు విభజించి హోతృముఖ్యులగు ఋత్విక్కుల కొసంగె

అంత సవితయుత్యుగ్రతేజంబును పాత్రనామకంబగు పురోడాశంబు హస్తంబుల గ్రహించినస్పృష్టమాత్రంబున కరంబులు భిన్నంబులయ్యెను. సూర్యుండు విషణ్ణుండై ఋత్విక్కులకై జూచి యో ఋత్విక్కులారా యీ పురోడాశంబు మదియ్య పాణిచ్ఛేదనంబు జేసెనని జెప్పిన ఋత్విక్కులు చింతబడి దోచకయుండ నష్టావక్రుండో మునులారా నేను జీవించియుండ మీకు విచారంబేల నేనొక యుపాయంబు జెప్పెద ఘుడవకుండుఁడని జెప్పి వింటిరా నాయెదుట నూరుకోట్లమంది బ్రహ్మలు పుట్టిరి జచ్చిరి. నేనుజూచుచుంటి గావున నే నవేకంబులు జూచినవాడ పూర్వకాలంబున లోకేశ్వరుండును బ్రహ్మవేళ శ్యామళాపురంబున హరిహరుండను విప్రుండచ్చట నుండి యొకదినంబున మహారణ్యంబులో సంచరించుచుండ నొకవ్యాధుండు గురివేయుచుండ నతనిపాదంబులకు తగిలి ఖండంబులయ్యె.

అప్పుడు మునులందరు విచారించుచు గంధమాదనపర్వతంబుమీద మునితీర్థంబున్నదందులో స్నానంబు జేయించిన పాదంబులు వచ్చునని యతని యాతీర్థంబుదరికి తీసుకొనిపోయి నాతీర్థోదకంబులచే స్నానంబు

జేయించిన పాదంబులెప్పటట్ల సంధానంబులయ్యె గావున సవిత్రు దేవున కాతీర్థంబునం జేరిన యుదకంబు దెచ్చి చేతులపైజల్లిన పునరుద్భవంబు లౌనని జెప్పిన తత్ప్రకారంబుశేసిరి సవితకు హస్తంబులు వచ్చె గావున నీ చక్రతీర్థప్రభావం బిట్టి దక్కడ స్నానంబాచరించి తదుపరి శివతీర్థంబునకు బోవలయును.

—* శివతీర్థ మాహాత్మ్యము. *—

అదిమహోత్తమంబగు తీర్థంబు పూర్వకాలంబున కాలభైరవు నకు బ్రహ్మహత్యా నివృత్తియిచ్చిన తీర్థంబని చెప్పిన సూతా యావృత్తాం తంబు సక్రమంబుగా జెప్పుమని యడిగిన మునులారా పూర్వకాలంబున బ్రహ్మ విష్ణు లిద్దగును అహంజగత్కర్తా అహమేవజగత్కర్తా యనుచు పరస్పర కలహంబు జరిగి యిద్దరు మహాఘోరంబగు మాటలు జరిగించు చున్న సమయంబులో సమస్తదేవర్షి సమూహంబు ముందర చతుర్వే దంబులు మూర్తివంతంబులై నిల్చి బ్రహ్మ విష్ణులు వినుచుండ వీరిద్దరు యీలోకంబులకు కర్తలుగారు పరాత్పరుండగు సాగరుం డీలోకంబులకు కర్మస్థావర జంగమాత్మకంబగు నీలోకంబంతయు తన్మాయా మోహితంబై ప్రవర్తించు.

మరియు నాశివుండు సర్వగీర్వాణ వంద్యుం డంబా సహితుండు సత్యత్వమాది శుభలక్షణ లక్షితులగు సృష్టియు పాలకుండుమహాత్మయు త్రిలోకాధీశ్వరుండయి వెలయుచుండు ననుచు వేదంబులు వక్కాణించి పలికిన విధియు విష్ణుండునుయాశివుండు పార్వతీ లోలుండయి శరీరధారియై ప్రమధులం గూడి సంచరించుచున్నవాడు సర్వసంగ వివర్జితుం డగు పరబ్రహ్మం బెట్లగునని యాక్షేపించి రంతమీదస్వరూపంబగు ప్రణవంబు చిద్రూపంబై మేఘగంభీర వచనంబుల నో బ్రహ్మ విష్ణులారా శివుండు పార్వతీ సహితుండని వచించితిరి.

అతండాత్మశక్తి స్వరూపిణియగు పార్వతిం గూడుట యుక్తంబు గాదా శంకరుండు స్వప్రకాశుండు నిరంజనుండు విశ్వాతిశాయి మహాదేవుండు ప్రపంచం బంతట బహిరంతర్వ్యాప్తుండయి సర్వాంతర్యామియు సకలతంత్ర స్వతంత్రుండు సర్వశక్తి చిదాభాసకుండయి వెలుగొందుచు నో చతుర్ముఖా నిన్ను జగత్సృష్టికొరకు రజో గుణంబుచే సృజించె నో మాధవా నిన్ను సత్వగుణంబుచే లోకరక్షణార్థంబై సృజియించె. తమోగుణంబుచే రుద్రునిం గల్పించి జగత్సంహారంబు జేయుచుండె. నాదేవుండే సర్వస్వతంత్రుండుగాని మీరిద్దరు స్వయంకర్తలుగారు నా విశ్వాధికుండగు విశ్వపతివలన పృథగ్భూతగాక తదానందభూతయైన పరాశక్తియగు పార్వతి యాగంతుకి యని వచింపబడును.

కాన సదాశివుండు విశ్వపతియనియు స్వతంత్రుండనియు సకలదేవవంద్యుండనియు దెలుసుకొనవలెను మీరు కర్తలుగారు శివునికంటే నధికులుగారు సములుగారు నా పరబ్రహ్మంబునకే మీరాజ్ఞావర్తులని వచించిన ప్రణవ వాక్యంబు విని బ్రహ్మ విష్ణులు మాయామోహితులై శంభుండే కర్తయని యెరుగంజాలక నహంకరింపుచు చతురాననుండద్భుతదర్శనుండై తపోబల విస్ఫుష్టంబై యనంతాదిత్యసంకాశంబయి ప్రకాశించుచు పంచమ శిరంబు జూపించి సమస్తదిగంతరాళంబులు తన కోపాగ్నిచే దహించుబడబాగ్నిబోలి ప్రజ్వరిల్లుచు నోనీలలోహితా నినునేనెరుంగుదుం.

పూర్వకాలంబున మదీయలలాటంబుననుద్భవించినాడవు నాపుత్త్రుండవు రుద్ర నామముండవనుచు గర్వించిబలికినవిని మహేశ్వరుండు కాలభైరవుండను నొకభటునిబంప నతడు శూలటంకాయుధ ధారియై బ్రహ్మపైకురికి తపోయుక్తంబతిశుభ్రంబగు ననిన నాశిరంబతిరోషంబునద్రుంచుటచే చతురాననుండు మృతింబొందిన మహాదేవ ప్రసాదంబుచే పునర్జీవితుండగుచు వాసుకిప్రభృతి సర్వభూషణ భూషితుండును పార్వతీ సహితుండునగు మహేశునింజూచి యో శశాంక భూషణా శరణాగత రక్షకా

నాతప్పు సహించి మన్నించ వలయునని యనేక విధంబుల స్తోత్రంబులు గావించి నమస్కరించిన సోమార్ధశేఖరుండా బ్రహ్మనోదార్చి శిరోహారి యగు కాలభైరవునింజూచి యో భైరవా బ్రహ్మశిరఃఖండనంబు జేయుటచే లోకానుగ్రహార్థంబు బ్రహ్మకపాలధారివై భిక్షాశివై దిరిగి యొక సంవత్సరంబునకు బ్రహ్మహత్యా నివృత్తి నొందుమని యానతిచ్చెను.

అంత కాలకంఠుండు భైరవుంజూచి మరలనిట్లనియె. ఓ భైరవా నీ కపాలంబుగొని భిక్షాటనంబు గావించుచు నొకసంవత్సరంబు తీర్థంబుల స్నానంబుగావించి వారణాసిం జేరితివేని యా బ్రహ్మ హత్య చతుర్థాంశ శేషంబగు పిమ్మట దక్షిణ సముద్రతీరంబునందు గంధమాదనంబున సర్వలోకోపకారార్థంబయి నాచే చేయబడిన తీర్థంబొండు గలదది శివనామంబుచే వెలయు నీ వందు నియమయుతుండవై స్నానం బొనర్పుము దానివలన బ్రహ్మ హత్య నిశ్శేషంబుగా నశించు నని యాజ్ఞాపించి శివుండు కైలాసంబునకు బోయెను.

నంత భైరవుండా వాక్యంబు లియ్యకొని కపాలధారియై భిక్షాటనంబు సేయుచు బ్రహ్మహత్యంగూడి దేవదానవ యక్షాదిలోకంబులంజరించుచు సర్వతీర్థంబుల సేవించుచు గాశికిం బోయిన బ్రహ్మహత్య పాదావశిష్టయయ్యె నంత భైరవుండు చతుర్థాంశ శేషితయగు నా బ్రహ్మహత్యంగూడి శంకరాజ్ఞచే గంధమాదనంబు జేరి యందు శివతీర్థంబున స్నానంబొనర్ప తన్మహిమాతిశయంబున భయంకరంబగు బ్రహ్మహత్య నిశ్శేషంబుగా నశించె నంత యీశ్వరుండు సన్నిహితుండై యో భైరవా నీ బ్రహ్మహత్య నశించె నింక నీవిందుండి కాశికిం జని యందొకచోట కపాలంబును స్థాపించిరమ్మని యాజ్ఞాపించి యంతర్ధానుండయ్యె నంత భైరవుండందుండి గదలి వారణాసికిం బోయి యీశ్వరోక్త ప్రకారంబున కపాలస్థాపనంబొనర్చె.

ఆ బ్రహ్మ హత్యను నిజాంశా సంభవుండగు కాల భైరవుని వెంట నంటించె.

ఓభైరవానీవు వారణాశికింబోయిన నదివదలునని జెప్పి వారణాశిలో భాగత్రయి దోషంబువదలి పిమ్మట గంధమాదన పర్వతంబుమీద శివతీర్థంబని మాచే నిర్మింపబడియున్న తీర్థంబులో స్నానంబు జేసితివేని నిశ్శేషంబగునని జెప్పిన కాలభైరవుండావిధంబున గృహ్మరి శివతీర్థంబులో స్నానంబు జేసిన మహాఘోరంబగు బ్రహ్మహత్య నిశ్శేషంబునొందె. నా కపాలం బచ్చట స్థాపింశెగాన దానికి కపాల తీర్థంబనికూడా నామంబు విశ్రుతంబయ్యె మునీంద్రులారా యక్కడ స్నానంబు లాచరించి తమపరి శంఖతీర్థంబునకు పోవలయు.

—* శంఖతీర్థ మాహాత్మ్యము. *—

ఆశంఖతీర్థంబులో స్నానంబు జేసినవారికి కృతఘ్నదోష పరిహారాదులనేకంబులుగలిగెనని సూతా దానివృత్తాంతంబు సమగ్రంబుగా జెప్పుమని యడిగిన మునులారా వినుండుపూర్వకాలంబున శంఖుండను మహాముని తన నామంబుచే నా తీర్థంబు గల్పించుటవలన నా తీర్థంబునకుశంఖతీర్థంబని వాడికగల్గె.

మరియు నాతీర్థప్రభావంబు గమకొని వత్స నాభుండనుఋషీశ్వరుండచ్చట నిశ్చలుండై ననేక వర్షములు తపంబు జేసిన నతనిపై పుట్టలు బెట్టియుండె నదిజూచి యింద్రుండు తపో భంగంబు గావింప వలయునని నవ మేఘంబుల నొక్కమారువదలివర్షింపుమనినస ప్తదివసంబులహోరాత్రంబులు వర్షించె.

అంతట ధర్ముడను నొకముని వత్స నాభునికి తపోభంగంబుగా కూడదని తానుమహిషస్వరూపుండై నతని కడ్డంబునిలిచి వానపెట్టు దాకవుండ

నానె అంతట నా మునిసంకులవర్షసందష్టంబుచే మేల్కొని కనువిచ్చి చూచిన లోకంబంతయు జలప్లవంబై యుండె.

తనసమీపంబున మహిషస్వరూపంబుతో నిలిచియున్న ధర్ముడను మునినిజూచి మహిషస్వరూపంబైన యీతిర్యగ్యోని జంతువయ్యునింత ధర్మంబాచరించి నన్నురక్షించెనని చిత్తంబుతో దలచుకొని యీమహిషంబు చిరకాలంబు జీవించుమని మనసులో దీవించి తపంబొనరింప మరియొకస్థలంబునకుబోయి మనంబులో బహుచింతనొంది మహావర్షంబులోనున్ననన్ను బాధనొందకుండ రక్షించినమహిషంబునకు ప్రత్యుపకృతి గావింపనిమూఢుడ మూర్ఖుడ కృతఘ్నుండ నాకుపుణ్యలోకంబులెట్లు గల్గునని బహుచింతనొంది యెవ్వరికైన ప్రాయశ్చిత్తంబు దొరుకునుగాని కృతఘ్నునికి నిష్కృతి దొరకదుగాన మృతిబొందుటమేలని మేరుపర్వత శిఖరంబెక్కి భూమిపై బడ నుద్యోగించెను

అంత మహిషస్వరూపుడగు ధర్ముడువోపుణ్యాత్మ ఆత్మప్రాణఘాతచే దోషంబుగలుగునుగాన మానుమనిన వత్సనాభుండతనితో నోమహాత్మా నే మూఢుండ మూర్ఖుండ దురాత్ముండ నుపకారంబు జేసినవారికి ప్రత్యుపకారంబు జేయని పాపాత్ముని దేహంబు గాల్చుటేమేలు కృతఘ్నునికంటె దురాగతుడీ లోకంబులోనుండడుగాన శాస్త్రంబువినుము.

శ్లో॥ కృతఘ్నతామహాదోషః కృతఘ్నే నాస్తినిష్కృతిః। కృతఘ్నస్యనవైలోకాఃకృతఘ్నస్య నబాంధవాః॥ కృతఘ్నానరకంయాంతియేవ విశ్వాసఘాతినః ॥

అని వున్నది గనుక నెవరికైనా ప్రాయశ్చిత్తంబు లుండును గాని విశ్వాసఘాతకునికి కృతఘ్నునికి ప్రాయశ్చిత్తంబు దొరకదుగావున తల్లిదండ్రుల బోషించనివాడు గురుదక్షిణసమర్పించనివాడు కృతఘ్నుడు చచ్చుటెమంచిదని యమష్మాసీంద్రుండాత్మ ప్రాణంబుల తృణసమంబులుగాదలంచి మేరుపర్వతంబెక్కి యందుండి భూమింబడుట కుద్యుక్తుండైన

ధర్మ్మండు మహిషరూపంబు విడిచి నిజాకారంబు నొంది యా వత్సనాభునితో నిట్లనియె.

ఓ మునీంద్రా నీవు బహుకాలంబు జీవింతువు నీబుద్ధికిం బరితుష్టహృదయుండనైతి ధర్మంబున నీకు సమానుండు లేమి నిక్కువంబు నీ కృతఘ్నులకు నిష్కృతియాత్మ పరిత్యాగంబుగా దొకయుపాయంబు వచించెద వినుము గంధమాదనంబున శంఖతీర్థం బను నొక తీర్థంబు గల దందు స్నానం బొనరించిన కృతఘ్నత్వం బాసి విగత పాపుండవై చిత్తశుద్ధియు విజ్ఞానంబునుంగల్గి శాశ్వతంబగు పదంబు నొందెదవు నే ధర్మ్మండ నీవచనంబు నిక్కువంబని యామునీంద్రుండు శంఖతీర్థస్నానాభిలాషియై గంధమాదనకుంబోయి శంఖతీర్థంబునం దవగాహనంబొనర్చి విగత పాపుండై మనోనైర్మల్యంబునొంది కొంతకాలంబునకు బ్రహ్మత్వంబు నొందె ఓ మునీంద్రులారా శంఖతీర్థ ప్రభావంబు వచించితి నందు స్నానం బొనర్చిన కృతఘ్నుండైన పాపవిముక్తుండగు మరియు మాతృ పితృ గురు ద్రోహులు మొదలగు పాపాత్ములైన నా తీర్థస్నానంబునం బరిశుద్ధు లగుదురు. లోకంబున మాతృపితృ భరణం బొనర్పక గురు దక్షిణ యొసంగక కృతఘ్నతం బొందు నరునకు మరణంబు దప్ప నిష్కృతి గల్గనేరదు.

ఓ వత్సనాభా గంధమాదన పర్వతంబుమీద శంఖతీర్థంబుగలదది మహోత్తమ తీర్థంబును దానిలోస్నానంబు జేసి కృతాఘుండవు గమ్మనిన నాప్రకారంబు జరిగించి పవిత్రుం డయ్యె గనుక నక్కడ స్నానంబాచరించి తదుపరి యమునా గంగా గయాతీర్థంబులకు బోవలయును.

—* యమునా గంగా గయాతీర్థత్రయ మాహాత్మ్యము *—

ఆ మహాతీర్థంబు జ్ఞాన శ్రుతి రైక్వ మహాముని వల్ల జ్ఞానసిద్ధుం డయ్యెనని నూతా దాని కథా విస్తారంబు మాకు జెప్పుమని వేడి యడిగిన మునీంద్రులారా పూర్వకాలంబున రైక్వుండను మహాముని గంధమాదన

పర్వతంబుమీఁద బహుకాలంబు తపంబొనరించి తపో మాహాత్మ్యంబున దీర్ఘాయుష్మంతుం డయ్యె.

అతనికి జన్మంబు మొదలుకొని పంగుత్వంబుచేనడువఁజాలక శకటంబుపై కూర్చుండి తిరుగుటచే మునులందరు సంయుగ్వుండనునామంబుచే పిలుతురు నామునీంద్రుండు సంపూర్ణజ్ఞానియై గ్రీష్మకాలంబులో పంచాగ్ని మధ్యంబున వర్షాకాలంబులో జలాశయంబున తపస్సు గావించుచుండ నతనిశరీరంబు కృశించి యంతకంతకు కండూసహితుండై పామరోగ బాధచే సనగా దురదగజ్జిచే బాధపడుచుండి బలహీనుఁడై కాలుకుంటిచే కదలలేక తపస్సునొదలక దీక్షతోనుండి యొకదినంబున యమునా గంగా గయా తీర్థంబుల స్నానంబులుజేసిన నిహపరంబులకు సుఖంబును పుణ్యంబును గలిగి రోగపీడలు మానునని మనసులో దలచుచు పంగుని శకటంబుమీఁద దూరగమనంబు సుఘటంబు, నేనేమి చేతు నని దుఃఖాక్రాంతుండై యుండె.

మంచిది నాతపఃప్రభావంబున నాతీర్థత్రయంబు నాహ్వానంబు జేసెదనని సంకల్పంబుసేయ నాచమనంబుజేసి మనోదార్ఢ్యంబున నిశ్చలధ్యానంబుజేయుచున్న నానదీత్రితయంబును భూవిపాటనంబు జేసుకొని యామునిసన్నిధినిల్చి యోమునీంద్రా నీమనోవాంఛాసిద్ధికొరకై తెంచితిమి ముందుమార్గంబుదెల్పుమన్న కనువిచ్చిచూచి పూజించియోపుణ్యనదులారా నాకోరికెదీర్చితిరేని మీరుముగ్గురీగంధమాదనపర్వతంబుమీఁద నివసించియుండవలెను, మీరుభూమిభేదించివెడలినస్థలంబులుమీమీపేర టతీర్థరూపంబులై సర్వకాలంబు జెల్లవలెను, మీయందుస్నానంబులు జేసినవారికి సుజ్ఞాన సంపత్తి గలుగవలయు ననుచుఁకోరియాతీర్థంబు సమీపంబున తపంబుగావించుచుండె.

నాకాలంబులో పుత్రుండను రాజునకు పుత్రుఁడగు జ్ఞానశ్రుతియను రాజేంద్రుండు బహుదాన శీలుండై యన్నప్రధానంబున నర్థులతృప్తి

నొందించుచు పట్టణంబుల పల్లెల గ్రామంబుల నగరంబుల ఖేటంబుల ఖర్వాటంబుల శాకసూపచోష్యలేహ్య సహితంబగువిమోదంబు ప్రతిమార్గంబున సంపూర్ణంబుగానిలిపి మార్గస్థులు మొదలగుసర్వజనంబుల వేడివేడి భోజనంబులు పెట్టుచుండె నాతనికీర్తి భూమినిండిదిక్కుల పిక్కటిల్లియుండె నిట్లురాజు మహాధర్మాత్ముండై సకల దానంబులు జేయుచు నొకనాటిరాత్రి సౌధంబుమీద చల్లగాలికిగూర్చున్నయెడ హంసలగుంపులై పోవుచు నా మేడమీద దిగి మరలి పోయ్యెడు సమయంబున నొక హంస హంసరాజుతో నిట్లనియె.

హంసశ్రేష్ఠమా యీపట్టణంబులో పుత్రుని కుమారుండగుజ్ఞానశ్రుతియనెడి రాజోత్తముండు బహుధర్మ్యంబు పుణ్యం డన్నదానపరుండతని దర్శింపకపోవుటుచితంబేనా యనిన నొకహంస యారాజును మహాస్తోత్రంబుజేసెదవు చిత్రంబు గుడ్డిగవ్వ వరహాయగునా యతనిదానంబెంత యతనిగుణంబెంత నతనిలెక్కయేమి రైక్వుడను బ్రాహ్మణుండు జన్మపంగుండు లేవలేడు మహాతపోబలాధికుండుబహునిష్ఠాగరిష్ఠుండతనిపుణ్యంబెవ్వరెంచగలరితని యతిశయంబు నాలక్ష్యంబులో రాదని యనుకొనుచు నాకాశమార్గంబున సత్యలోకంబునకు పోయెను

అంత నారాజువిని బహుచింతాక్రాంతుండై వేనిళ్లజేసిన పేరులేదయ్యె. ఇది పక్షిచె నిరాకరించబడితినని యారాత్రినిద్రలేక గుందుచు ప్రాతఃకాలంబునలేచి యొక సారథింబిలిచి యో సారథీ నీ వతి జవసత్వసంపన్నంబులగు నశ్వంబులుగట్టిన రథంబుపై నెక్కి యడవులుదుర్గంబులు పర్వతంబులు మహారణ్యంబులు నదులు పట్టణంబులు గ్రామంబులు గోష్ఠంబులు మొదలగు స్థలంబులు వెదకి గాలించి భూమి గ్రుమ్మరించి రైక్వుండను మునీంద్రుని సెలవుగని రమ్మని బంపిన నాసూతుండు వెదకి

# శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.

వెనకి నెంగునంగానక చింతనొంది దక్షిణసముద్రతీరంబులో గంధమాదన పర్వతంబుమీద యమునాగంగా గయాతీర్థంబుల సమీపంబునబండిక్రింద గూర్చున్న వంగుడగు రైక్వుని జూచెను.

అధికరకు తానువిన్న లక్షణంబు లతనియం దుండుటచే నితడె రైక్వుండని నిశ్చయించుకొని సన్నిధిని జేరి శకటంబుక్రింద గూర్చున్నమునీంద్రునితో స్వామీ తపోధనా నీపేరు వినగోరెదనని యడిగిన నాపేరు రైక్వుండు శకటంబుపై నెక్కి తిరుగుటచే కొందరు మునులు సయుక్వుండని వాడుదురని చెప్పిన యతని బ్రహ్మజ్ఞాననిష్ఠకు సంతోషించి మ్రొక్కి సమీపంబులో గూర్చుండి యనేకవిధంబుల ద్రవ్యాశాప్రసంగంబులు జేసిన నతని మనస్సు ద్రవ్యాపేక్షయందు నిరాశనొందిన విధంబుగాంచియాశ్చర్యంబు నొందుచు జ్ఞానశ్రుతి సమీపంబునకు పోయెను

రాజేంద్రా గంధమాదనంబుమీద యమునా గంగా గయాతీర్థ సమీపంబున మీరు జెప్పిన మునీంద్రునిజూచి వచ్చితినని జెప్పినసంతోషించి గోగణంబును ధనసమూహంబును సర్వాంబులు మొదలగు రత్నంబులు గొని యతని సన్నిధికిపోయి వందనంబులుజేయుచు మునీంద్రా వీటినిస్వీకరించి నాకు నద్వైత జ్ఞానానుభవ మార్గంబు జెప్పుమని వేడిన రాజా ఈ ద్రవ్యంబుయందపేక్షగలిగినవాడు నీకుపదేశంబు సేయతగడు ధనాశా పరులుగనెరదు తానేజ్ఞానసిద్ధి లేనివాడొరులకు జ్ఞానోప దేశంబెట్లుజేయు.

స్వయంతీర్ణః పరాన్ తారయతి॥ యనుస్మృతికి విరుద్ధంబగు జ్ఞానోపదేశం బొరులకుజేయు నిమిత్తంబులేదు. ప్రారబ్ధ క్షయంబైన కోరికలుడుగును కోరికలుడిగి నిరాశుండయిన మనో నిశ్చయంబు గలుగును. మనోనిశ్చయంబున సువర్ణంబు లోష్ఠ సమానంబై దోచునప్పుడు సన్మార్గ ప్రవర్తకుండగు నప్పుడే పరిశుద్ధుండయి జ్ఞాన ప్రవర్తకుండయి శ్రవణ

మనన నిధిధ్యాసలవలన భక్తిజ్ఞాన వైరాగ్య సిద్ధుండగు నతఁడేజ్ఞాని యగు! వ్రతనిష్ఠుండు నీవు జ్ఞానంబుగోరితివేని యీతీర్థత్రయంబులో స్నానం బొనరింపుము పరిశుద్ధుండ వగుదువని సంకల్పపూర్వకంబుగా స్నానం జేయించి నిష్కల్మషుండగుటఁజూచి జ్ఞానమార్గంబుఁజూపి నారాజుపదే శంబునొంది కృతార్థుండయ్యె మునీంద్రులారా యాతీర్థత్రయ మాహా త్మ్యంబవ్విధంబు వింటిరిగదా యక్కడ స్నానాది క్రియలఁబరిగించి కోటితీర్థంబునకు బోవలయు.

—* కోటి తీర్థమాహాత్మ్యము. *—

అది మహాపుణ్యాతరంబగుతీర్థంబు శ్రీరామచంద్రుండు రావణవినా శంబొనరించి బ్రహ్మహత్యానివృత్తికై రామేశ్వరలింగస్థాపనంబుగావించి తల్లింగాభిషేకంబుకొరకు జలంబుకై వెదకి దొరకక రామభద్రుండు తన ధనుఃకోటిచే భూమిద్రవ్వి సలిలోద్గమంబు గావించె గాన దానికి ధనుః కోటియను నామంబు సార్థకంబయ్యె.

నాతీర్థంబులో రఘునాయకుండు ప్రథమస్నానంబాచరించి యా యుదకంబుచే రామనాథస్వామికి యభిషేకంబు జేసె మరియు ద్వాపరాం తంబున శ్రీకృష్ణమూర్తి తన మేనమామయగు కంసునివధించి మాతుల హత్యా నివృత్తికొరకు బ్రాహ్మణులవేఁడిన హేశ్రీకృష్ణా దేవదేవోత్తమా దేవకీ వసుదేవులకిచ్చిన వరముసాఫల్యంబుకొరకు భూభారహరణార్థంబై బ్రహ్మచే ప్రార్థితుండవై దుష్టనిగ్రహ శిష్ట ప్రతిపాలనంబుకై యీ లోకంబులో నవతరించిన పరమాత్ముఁడవునీకు దోషంబులెక్కడివిసకలదో షంబులు భవద్దర్శనంబున మర్దశనొందినైనను లోకానుగ్రహసంగ్రహా ర్థంబయి దర్మస్థాపకుండవైన నీవుచరించిన లోకంబునడుచు

కావున దక్షిణ సముద్ర తీరంబులో గంధమాదన పర్వతంబుపై శ్రీరామచంద్రుడు తనధనుష్కోటిచే స్వహస్తంబులనిర్మించి తానవగాహ

సంబుజేసి రామేశ్వర లింగంబున కభిషేకం బొనరించి బ్రహ్మ హతా నివృత్తి నొందిన తీర్థంబు గావున మీరును నచ్చటికి రిగి ధనుష్కోటిలో స్నానం బాచరించి రామలింగస్వామి కభిషేకంబు గావించితి రేని మాతుల వధజనిత పాపంబు దూరంబగు మీ మనో వాంఛితంబు లన్నియు సిద్ధించునని జెప్పిన శ్రీకృష్ణభగవంతు డచ్చటికరిగి సంకల్ప విధానంబుగా ధనుష్కోటిలో స్నానంబు గావించి రామనాధేశ్వరున కభిషేకంబు జేసి మాతులవధజనిత దురితంబుతో దూరంబయ్యె మునులారా ధనుష్కోటి తీర్థమాహాత్మ్యం బింత గొప్పదిగావున నక్కడ స్నానంబుజేసి సాధ్యామృత తీర్థంబునకు బోవలయును.

—* సాధ్యామృత తీర్థమాహాత్మ్యము. *—

అది మహోత్తమంబగుతీర్థంబు పూర్వకాలంబుననూర్వశీపురూరవులకు శాపమోక్షంబిచ్చిన తీర్థం బాతీర్థంబులో మనుష్యు లస్థులు నెన్ని సంవత్సరంబు లుండునో నన్ని సంవత్సరంబు లాతడు స్వర్గ లోకంబులో క్రీడించగలడు. పూర్వకాలంబున ప్రజా రక్షణ శీలుండు ధర్మాత్ముండు మహాపరాక్రమ శీలుండగు పురూరవుండు మిత్రావరుణ శాపంబున భోగ్యంబగు స్వర్గంబు విడిచి యూర్వశి భూమిపై చరించుచుండి యొక యరణ్యంబులో కోకిల మధుర స్వరంబుగా వీణా వాద్యంబు చేయుచుండెను.

పురూరవుండశ్వారూఢుండయి నపరిమితసైన్యంబుతో వన విహారంబు నేయుచు నాధ్వనివిని తత్సమీపంబునకుబోయి పలుకరించి నాకుభార్యవు గావలయునని గోరిన రాజోత్తమా నేనొక సమయంబుగోరెద నేను పుత్రసమానంబుగానీయురణద్వయంబును బెంచుచున్న దానవీటికిభయంబు జెందకుండ రక్షింపవలయును. మరియు నీవు మైథునకాలంబున దప్పవివస్త్రుండవై నాకంటికి కనపడగూడదు నీయుచ్ఛిష్టంబునా కొసగగూడదు.

ఈ ప్రతిజ్ఞలు మూఁడును పాలించితివేని నీకు భార్యనై యభిమతంబులు దీర్తునని నతండియ్యకొని యా నూర్వశ్యను తన యింటికి దోడ్కొనివచ్చి సరస్వతీతీరంబున చైత్రరథాది యుద్యానవనంబులయథేష్ట సుఖంబు లనుభవింపుచుండెను.

అంత నఱువదివేలవత్సరములు గడిచె నిన్ని దినములూర్వశి రాకపోవుటకేమి హేతువని దేవేంద్రుఁడడిగి విశ్వావసుండనుగంధర్వునితో దాని వెదకిదోడ్కొనిరమ్మని జెప్పిన నతఁడు వెదకి యున్నస్థలంబుగనుఁగొని యా రాజుకు దీనికి సాంగత్యము చెడఁబాపఁదలంచి యొకనాటి రాత్రి జీమూత బంధురమయి వర్షప్రదమై యున్న సమయమునదాని పెంపుడుగొర్రియలబట్టి గొనిపోవుటకై యుద్యోగించిన నాగొర్రియలరువ నూర్వశి మేల్కొని స్వల్పగతుఁడగు రాజుతో కఠినమగు మాటలాడిన నతఁడుద్ధృతుఁడై నీరాత్రిచీకటిలో దిగంబరుఁడనై పోయిన గానుపించదని తొందరజెంది కృపాణ పాణియై పరుగెత్తి యాగంధర్వుల బారదోలి మందిరంబునకు వచ్చుచున్న మెరుపుదీప్తితో యారాజు దిగంబరుండై కనఁబడిన తక్షణంబున నూర్వశి యంతర్హితయై తన నివాసంబునకరిగె.

రాజుగొర్రియలవిడిపించుచు సంతోషించుచువచ్చి వెదకిన నూర్వశితల్పంబుపై లేదని చింతనొందుచు గొర్రియలజాడ బోయిన నదియు గానరావయ్యె నంతట నాచక్రవర్తి విలపించుచు కఠినవనంబులలో బయలుదేరి కురుక్షేత్రంబునకుబోయి యచ్చటకమల సంకీర్ణంబగు నొక తటాకసమీపంబున నల్గురప్సరసలతో విహరించుచున్న నూర్వశిం గాంచి విలపించిన నోచక్రవర్తీ నీవేల వెసరించెదవు నేనుగర్భవతినై యున్నదాన నొకసంవత్సరంబు దాటివచ్చుటకి విచ్చేయుము యొకరాత్రి నీమనోరథంబు తీర్చెదనని పలికిన నాతఁ డొకయేఁడు దాటించి మరలబోయిన రాజుం గాంచి యో నృపాలా నన్ను గోరెద వేని యీ గంధర్వులం బ్రార్థింపుమనెను.

ఆగంధర్వోలం జూచి యో దేవతలారా నేనీ యూర్వశిం బాశి యుండజాల నాకు దయచేయవలయు నని యడిగిన నూర్వశి నీకు దొరకదీ యగ్నిస్థాలిని యొసంగెదము. దీనినిగ్రహింపు మన్నల నూర్వశి దొరకగల దనియగ్నిస్థాలినిచ్చిన రాజు దీనవదనుండై మూఢుని పోలిక దీని నేనేమి సేయుదునని యాస్థాలి నరణ్యమధ్యంబున దిగవిడిచిస్వపురంబునకుబోయి యర్ధరాత్రి వేళ నే మూఢుండనై యగ్నిస్థాలి వదలి వచ్చితినని తత్క్షణం బచ్చటికిపోయి యగ్నిస్థాలింగానక శమీగర్భంబగు యశ్వత్థంబును గాంచి దాని నగ్నిస్థానంబుగా నెరింగి దీని పట్టణంబునకుగొనిపోయి నరణిగావించి మధించి తదుత్పన్నాగ్నిచే యజ్ఞంబు లొనరించి యూర్వశిని బొందగల నని శమీగర్భయశ్వత్థంబుదెచ్చి యరణిగావించి యగ్నిని మధించి వేద చోదితంబులగు యజ్ఞంబులు గావించి గంధర్వ లోకంబు జేరి యూర్వశీ సహితుండై యనేకసౌఖ్యంబు లనుభవించుచుండె.

అంతనొకనాడు దేవేంద్రుని సభామంటపంబున రంభాద్యప్సర స్సంఘంబులతో నాడుచున్నృత్యాభినయ సామర్థ్యంబు జూపుచు గర్వించి పురూరవుం జూచిన యతడును విలాసంబుగా క్రీగంట దాని జూచె నాయిద్దరి యభిప్రాయంబులు గనుగొని నాట్యాచార్యుండగు తుంబురుండు కోపించి దేవసభలో మీరు వ్యతిక్రమంబు గావించితిరి గాన మీకిద్దరికి వియోగంబుగా గలదని శాపంబొసంగె

అంతట రాజేంద్రుండు దుఃఖాక్రాంతుండై పురుహూతుని శర ణంబు వేడిన నింద్రుండు కరుణించి విచారించి నృపాలా నీకొక యుపా యంబుజెప్పెద గంధమాదనంబున యోగి బృందసేవ్యంబగు భుక్తిముక్తి ప్రదంబగు సకలపాప విమోచనంబగు సర్వైశ్వర్య ప్రదంబగు సాధ్యా మృతంబను తీర్థంబు గలదచ్చటికి నీవేగి స్నానంబు జేసితివేని నీశాప విమోక్షణంబగు స్వర్గలోక నివాసంబునుంగలిగిమత్సన్నిధానంబులో సభా

మంటపప్రదేశంబున విహరించ గలవని జెప్పిన ప్రీతమానసుండై భూవల్లభుండు తత్క్షణంబుననాగంధమాదనంబునకుబోయి సాధ్యామృతతీర్థంబులో సుస్నాతుండై శాప విముక్తుండయ్యె గావ నా తీర్థంబులో స్నానంబు గావించి సర్వతీర్థంబునకు బోవలయు.

## —* సర్వతీర్థమాహాత్మ్యము. *—

ఈతీర్థంబులోస్నానంబు జేసినవారికి సకలతీర్థావగాహ ఫలంబులును గాయత్రీపునశ్చరణ జేసిన ఫలంబుచతుర్వేదపారాయణఫలంబును హరిహర పూజ లొనర్చిన ఫలంబు నేకాదశి ప్రభృతివ్రత నియమోపవాసంబులనే ఫలంబులు సమకూరునో సర్వతీర్థస్నానంబున నంతఫలంబు సిద్ధించుననిన సూతా దానికి సర్వతీర్థంబని పేరు యేవిధంబున వచ్చెనని యడిగిన మునీంద్రులారా పూర్వకాలంబున సుచరితుండను మునీంద్రుడు భృగువంశ సంభవుండు యమనియమోపేతుండై దక్షిణసముద్రతీరంబున గంధమాదనపర్వతంబుమీద దేవదేవుడగు శంకరునుద్దేశించితపంబుగావించుచు త్రికాల స్నానం బొనరించుచు నతిథులంబూజించుచు జలాహారుండయి వాయుభక్షణుండయి శీతోష్ణసుఖదుఃఖంబుల కోర్చి భస్మ త్రిపుండ్రాంకిత ఫాల తల్పుండయి జాబాలోప నిషత్ప్రకారంబున రుద్రాక్షమాలికా ధారణంబు సేయుచు తపంబు గావించుచుండె.

అంత మహేశ్వరుండు కరుణాయత్తచిత్తుండై భూతసంఘసేవితుడై జటామండల మండితుండై భస్మభాసురశరీరుడై వామార్ధజాని కోటి సూర్యప్రభా విజిత మహాతేజోవిరాజమానుడై శేష వాసుకి ప్రభృతి మహానాగభూషణాలంకారుడై వృషభవాహనుడై యామునీంద్రునెదుట నిలిచి యామునలికి లోచనంబు లొసగిన నాబ్రాహ్మణుండు మహానంద పారావార మగ్నుండై లేచి మహోన్నతం బగు సదాశివునిరూపంబు కన్నుల నిండగాంచి స్తుతించె.

ఓమహాదేవా నీవు బ్రహ్మాది సురసేవ్యుండవు త్రిపురనాశకుండవు యమనాశనకారివి కామారివి సంసారవైద్యుండవు భూతపాలకుండవు శివుండవవ్యయుండవు త్రిలోచనుండవు భక్తరక్షణదీక్షితుండవు వ్యోమకేశుండవు కారుణ్యవిగ్రహుండవు నీలకంఠుండవు మహేశ్వరుండవు పర మా నరద విగ్రహుండవు గంగాధరుండవు శర్వుండవు కైలాసనాథుండవు నిన్ను గొనియాడ నాతరంబె నన్నుంగాంచి కృపాళుండవై రక్షింపుమని యనేక విధంబులం బొగడిన నీలకంఠుండు ప్రీతుండై ఇట్లనియె.

ఓ మునీంద్రా నీ తపంబునకు నేను సంతసించి నీయాశ్రమంబునకు వచ్చితి నీకేమి వరంబు గోరిన నిత్తుననిన నో మహేశా పార్వతీశా నేను జరాపరితుండను సర్వతీర్థంబులలో స్నానంబు సేయు కోరిక గలిగియు బోవశక్తి జాలక నీపాదంబులు సేవించితి నాకోర్కె దీర్చవేయని బ్రాహ్మణుండు విలపించిన నో భూసురా వెరువకు వరప్రదాతనగు నన్ను సేవించినవారికి కొదవ లుండవు నీమనోభీష్ట ప్రకారంబు నీవు నిర్మించిన యీతీర్థంబులో సర్వతీర్థంబులు సన్నిధించునట్లు వరంబిచ్చితిమి నీకు దేశాటనంబుతో బనిలేదని యనుగ్రహించెను.

ఆమహాదేవుని ప్రసాదంబున గంగా గోదావరీ గోమతీ యమునా కృష్ణా కావేర్యాది సర్వనదీనదంబులా తీర్థంబులో మిశ్రమంబులై విశ్రమించుటచే నానది సర్వతీర్థంబని దానికి త్రైలోక్యవిశ్రుత నామంబు గలిగె. మరియు హరుండు యుమామానసుండై దీనియందు నాకృష్టుండగుటచే దీనికి మానస తీర్థంబనియును వాడుక కలిగియు ప్రకాశించు నీవీతటంబున స్నానంబొనరించి ముక్తుండవగుము.

మాయనుగ్రహంబున నీతీర్థంబులో స్నానము చేసినవారలెంతయు జ్ఞానులయిన మూర్ఖులయిన మూఢులయిన తరించి జ్ఞానగమ్యంబగు నిర్వాణ పదంబు నొందుదురు సంసారార్ణవ తారణ కారణంబగు నని యానతిచ్చి

పరమేశ్వరుం డంతర్ధానంబు నొందె నాచరితుండును పరమేశ్వరుని యాజ్ఞాప్రకారంబున స్నానంబు గావించి జరావిముక్తుండయి తరుణుండును సుందరస్వరూపుండయ్యె మహాదేవుని చిత్తప్రకారంబా తీర్థంబులో బహుకాలంబు నివాసంబు జేసి యాతీర్థప్రభావంబున కాలాంతరంబున నీశ్వరసాయుజ్యంబు నొందెగాన మునీంద్రులారా యనశ్యంబు పర్వతీర్థంబులో స్నానంబు గావించి బ్రహ్మహత్యాది పాపనాశకరంబగు ధనుష్కోటికి బోవలయును.

—* ధనుష్కోటితీర్థ మాహాత్మ్యము *—

అది మహాత్మ్యతతీర్థంబునా తీర్థనామస్మరణమాత్రంబున పాపంబులు బాయు నందులో స్నానంబు జేసినవారి కెంత పుణ్యంబుగలదో భగవంతునకే తెలుసు తదవగాహనంబు నేయువారలు, తామిస్రమంబును,

—* నరకంబుల పేరు. *—

నంధతామిస్రంబును రౌరవంబును, మహారౌరవంబును. కుంభీపాకంబును కాలసూత్రంబును, అసిపత్రంబును. క్రిమిభక్షణ బును, అంధకూపంబును సరంశంబును, శాల్మలియు లాలాభక్షణంబును, ఊర్మిజాలంబును, క్షారకర్దమపానంబును, పూయాసృగ్భోజనంబును, రక్షోగణాశనంబును దండశూకాశనంబును, తిరోధానాభిధంబును సూచీముఖంబును, విషాగ్నిపీడనంబును, తప్తాంగారకంబును, ప్రతప్తసికతాపానంబును, తప్తాయఃపిండభక్షణంబును, తప్తాయః పురుషాలింగనంబును, తప్తాయ స్త్రీనిషేవణంబును, ప్రతప్తశయ్యారోహణంబును, క్రకచభేదనంబును నరకంబులం బడుదురు.

యష్టావింశతి సంఖ్యాకంబులగు నరకంబుల బాధలు ధనుష్కోటిలో స్నానంబుజేయుని వార లనుభవించగలరని సూతుండు జెప్పిన సూతా

—*ఏపాపముచేసినవారేనరకంబులోబడుదురోదానివివరణ*—

ఈనరకంబులు విస్తారంబుగా జెప్పితివేపాపంబు జేసిన వారలే నరకంబులో పీడలబడుదురు దానిమర్మంబులు జెప్పుమనిన.

మునులారా అగమ్యా గమనంబు జేసినవాడు పురుషుండయిన స్త్రీ యైన తప్తాయః పిండాలింగనంబున బాధనొంది సూచీముఖ నరకంబులో ద్రోయబడును.

—*సర్వజంతువధంబొనర్చినవాడు శాల్మలినరకంబులోపడును *—

మరియు నెవ్వండైన వృషలీసంగమం బొనర్చి దురాచారుండైన వాని పూయవిష్టమూత్ర రక్తశ్లేష్మ పిత్తాదిపూరితంబగు భీభత్స నరకంబున ద్రోయంబడు.

మునీంద్రులారా తనయజమానిని జంపి యతని ధనాధులు హరించినవాడు స్వామిద్రోహి యంధతామిస్రంబులో బడి యుండును.

భూతద్రోహంబు జేసి తనకుటుంబ రక్షణ జేయువాడు సర్పసంకులంబగు నరకంబులోద్రోయబడు.

పశుపక్షిమృగాదుల స్వోదర పోషణార్థంబుకై జంపినవాడు క్రవ్యాదపీడిత తైల స్తంభ కుంభీపాక నరకంబుల ద్రోయంబడును.

వేదమార్గం బుల్లంఘించి కుమార్గ ప్రవర్తకుం డైనవాడు ఘోరారంబగు నసిపత్రవన నరకంబుల ద్రోయంబడు.

యే నృపాలుండైన నధర్మంబున శిక్షయొనర్చునేని ప్రసూకరముఖ నరకంబున బాధనొందును

దైవాధీన ప్రాణుల హింసించిన పాపాత్ముం డంధ కూప నరకంబులో బడును.

పంక్తిభేదం బొనరించి స్వాదుపదార్థంబు లనుభవించినవాడును పంచయజ్ఞంబు లొనరించనివాడును క్రిమిభోజనుండై క్రిమిభక్షితుండై క్రిమిరూపుండయి క్రిమిసంకులంబగు నరకంబులో ద్రోయబడును

మరియును ఏమనుజుండయినను దుష్టుండయి వృషలీసంగంబొనర్చి త్యక్తలజుండను శౌచాద్యాచార రహితుండై పశుప్రాయుండై వర్తించు

నతండు పూయవిష్టమూత్రాసృక్శ్లేష్మ పిత్తాది పూరితంబగు అతిభీభత్స నరకంబునద్రోయంబడు నతండట్టి ధనుష్కోటియం దవగాహనంబొన ర్చెనేని యీనరక బాధల బొందడు. మఱియును నెన్ని నరకంబులు గలవా నరకంబుల నేతుస్నానంబొనర్చిన నతండు నరకములయందు పడడు మరి యును ధనుష్కోటి స్నానంబొనర్చిన మనుజుండు అశ్వమేధఫలంబునొందు మరియు ధనుష్కోటి స్నాన ప్రభావంబున ఆత్మవిద్యయు చతుర్విధ భక్తియుంగలుగు బుద్ధి పాపరహితంబుగానేరదు. సుఖంబు గలుగదు మనిప్రకాశించుమనియు తులాపురుషగో సహస్రదానంబుల నరుండే ఫలంబు నొందునో నది ధనుష్కోటిస్నానంబునంబొందు మఱియు నాతీ ర్థస్నానంబువలన బ్రహ్మహత్య సురాపానయుతంబును గురుదార గమనా యుతంబును స్తేయాయుతంబును తత్సంసర్గకోటులు తత్సమాన దోషపుం జంబులు సకలంబును నాశనంబు నొందు యీవిషయంబుపకై సంశయం బువలదు జిహ్వాగ్రమంబున తప్తంబగు పరిశువుధరించి జెప్పంజాలదుమె వ్వండయిన నీవాదంబ బద్ధవాదంబని వక్కాణించునతండు సర్వకర్మబహి ష్కృతుండగు శంకరుండని చెప్పంబడు లోకంబున సర్వపాతక నాశంబు ను అద్వైతజ్ఞాన ప్రదంబును భుక్తిముక్తిదంబు యిష్టకామప్రదంబును అజ్ఞాన నాశనంబగు ధనుష్కోటిగల్గియుండ మనుజాధముండాతీర్థంబు మాని యితరంబుల సేవించుటయే మౌర్ఖ్యంబు మరియు నా తీర్థప్రభా వంబే వచింపంజాలనందుస్నానంబొనర్చిన వారలకు నరక భయంబు లేదు. యెవ్వరైనను ధనుష్కోటియందుస్నానంబొనర్చిననుస్మరించినస్తుతించిన స్తుతిసించిన నమస్కరించిన వారలు మరల జన్మంబునొంది మాతృస్తన్య పానంబొనర్పరనిన విని శౌనకాది మునీంద్రు లిట్లనిరి.

మునీంద్రులారా పాపంబు లగణ్యంబులు నరకంబుల సంఖ్యాతం బులు వెయ్యిసంవత్సరంబులు జెప్పిన దరగవు. ముఖ్యంబగు మాటజెప్పెద

# శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.

నెన్ని పాపంబులు జేసిన నరుండయిన ధనుష్కోటిలో స్నానంబు జేసె నేనియు బ్రహ్మహత్యా గురు దారాగమన సువర్ణ స్తేయాది మహాపాతకంబు లైనను నిముషంబులో నాశనంబగును

ఈవిషయంబై తత్త్వపరశు జిహ్వాగ్రంబుపై నుంచుకొని ప్రమాణ పూర్వకంబుగా జెప్పగలను యే నరాధముండు ధనుష్కోటి స్నానంబు మాని సంచరించునో వానిమూర్ఖంబునకు దరి లేదని జెప్పినసూతా యా తీర్థంబునకు ధనుష్కోటినామం బెట్లుంగి సంభవించెనని యడిగెను.

ఓమునులారా శ్రీరామచంద్రుండు రావణాసురునివధించి విభీషణు నకు పట్టాభిషేకంబు జేసి యందరితో సేతువుమీద పాదగమంబునవచ్చు చున్న సమయంబులో విభీషణుండు మ్రొక్కి రాఘవా యీ సేతువు నిలిచియుండెనేని శత్రువు లెవరైన నీమార్గంబున సులభంబుగా రాకడకు సాధ్యంబు దీని కేమి యుపాయంబని ప్రార్థించిన సర్వజ్ఞుండగు రామభ ద్రుండు దయావంతుండయి విభీషణా దీని కుపాయంబు కల్పింతు మని తన ధనుష్కోటిచే సేతువు ఛేదించిన నది ధనుష్కోటి యని లోకప్రసిద్ధి గాంచి యుత్తమతీర్థంబయ్యె నర్మదాతీరంబున తపంబున గంగాతీరంబున మరణంబున కురుక్షేత్రంబున దానంబున బ్రహ్మహత్యాది పాపనాశంబు లగు నిక్కడ దర్శనమాత్రంబుననన్నియుగలుగు ధనుష్కోటికి సమతీర్థంబు భూలోకములో లేదు.

తదుక్తం స్కాందే॥ శ్లో॥ రామనాథధనుష్కోటౌ మాఘ మాసే నమస్త్రయః। స్నాత్వారతే శివరాత్రౌచ నిరాహారో జితేంద్రియ ఇతి॥

తథాచ॥ యస్మాన్నయాద్ధనుషః కోట వధోదయ మహోదయే తస్యావశ్యత్రయోదేవాః బ్రహ్మవిష్ణు మహేశ్వరాః॥

చంద్రసూర్యోపరాగేషు ధనుష్కోట్యవగాహనం। బ్రహ్మహత్యా దిపాపానాం। ప్రాయశ్చిత్తమితీరితం॥

అతస్సర్వ ప్రయత్నేన స్నాంత్యశ్వాపి మునీశ్వరాః । ధనుష్కోటి మహాపుణ్యం భుక్తిముక్తిఫలప్రదం॥

తత్రగత్వా పితృభ్యశ్చ కురుధ్వం పిండదావనః।ఆకల్పమపి తృప్తి స్స్యాద్యత్ర పిండప్రదావనాత్॥

ద్రోణాచార్య సుతశ్చాయ మశ్వద్ధామామునీశ్వరాః సుప్తమారణదోషేణ ఘోరాకేణ ముముక్షేత్కుశాదితి॥

వింటిరా మునీంద్రులారా మహాపాతకనాశకంబును భుక్తిముక్తిప్రదంబగునని చెప్పిన సూతా యశ్వద్ధామకు దోషంబెట్లు సంభవించె పరిహారంబెట్లయ్యె మాకువినుపింపుమనిన మునులారాకురుపాండవయుద్ధంబు సాంతంబైనవెనక దుర్యోధనుని సైన్యంబులో కృపాశ్వద్ధామకృతవర్మలు ముగ్గురు శేషించి వారు తొలిగిరి దుర్యోధనుండు తొలిగి యొక హ్రదంబులో జలస్తంభనచే కానరాక మునిగియుండగా పాండవులు కృష్ణమూర్తియు వెదకుచుబోయి భీమునివంటశాలలోకి మత్స్యంబులు తెచ్చే బెస్తవాళ్ళచే నాతనిమర్మంబుగని యచ్చటికి బోయి యనేకంబులగు మాటలు వినిపించిన రోషంబుతోవచ్చి భీమునితో గదాయుద్ధంబు జేసె.

అప్పుడు తొడలు విరిగిపడిన తదనంతరంబున శ్రీకృష్ణమూర్తి యాలోచనప్రకారంబు దుర్యోధనుని శిబిరంబునకు భాండాగార రక్షణార్థంబు ధర్మరాజాదులరిగి రంతమీద కృతవర్మ కృపాచార్యాశ్వద్ధామలు సూర్యాస్తమయంబైనవెనక వెదుకుచు దుర్యోధనునింగాంచి పరస్పరంబు దుఃఖంబు నొందినమీదదుర్యోధను నిచ్ఛాప్రకారంబునశ్వత్థామ రాజోత్తమా నేనుప్రతిజ్ఞ సేయుచు నపాండవంబు గావింతునని ప్రమాణంబు జేసి ముగ్గురు బయులుదేరి ధర్మరాజు శిబిరమార్గంబుబట్టి చీకటిలో నొక విశాలంబగు న్యగ్రోధవృక్షంబుక్రిందవిశ్రమించిరి.

కృతవర్మకృపాచార్యులలసి నిద్రజెందె నశ్వత్థామ కార్యాలోచ నచే మనస్స్వాస్థ్యంబుఁజాలక చింతించుచుండె నంత యర్ధరాత్రి నొక యులూకంబువచ్చి వటవృక్షంబుపై విశ్రమించియున్న కాకులం జీకాకు పరచి భీకరారావంబుతో కాకి మూకల జొక్కార్చిన కాకుల శిరంబులుపా దంబులు ఖండంబులై పడుటజూచి యిదియొక సుఖోపాయంబే కదా నిద్దురబోయెడి దృష్టద్యుమ్నాదుల సులభంబుగా హతంబుబొందింతు నని సంతసించి లేచి వారినిద్దరిని లేపి శిబిరంబుల సమీపంబునకు బోయిరి

అంత కృపకృతవర్మల శిబిరద్వారంబుననుంచి యశ్వత్థామ చీకటి లోలోపలికిబోయి దృష్టద్యుమ్ను నిరోమ్ముమీద గూర్చుండి వింటినారితో నతనికంఠంబునొక్కి తండ్రిపగదీర్చి తదుపది శిఖండిని యుధామన్యు యుత్త మోజుల నై పుగురుపపాండవులు మొదలగుహతశేషంబులయినమూడు కోట్లమందిని గుఱ్ఱంబు లేనుగులతో నిశ్శేషంబుగా నేలగలిపె నంతట నర్జునభీమాదులు రాగలరనిశంకించి కృతవర్మకృపాచార్యు లొక మొగంబై పోయిరి యశ్వత్థామ నర్మదాతీరబున ఋషివాటికలకుంబోయెను.

అక్కడ మహాత్ములగు బ్రాహ్మణోత్తములశ్వత్థామముఖంబుజూచి సుప్తబాలవృద్ధుల బలవన్మరణంబుగావించిన దోషయుక్తునిగా నెరింగి రేవాతీరబ్రాహ్మణులనేక వేలమంది యోరి బ్రాహ్మణాధమా నిదురించు చున్న శిశువృద్ధాదుల వధించినపాపివి నీముఖంబుజూడరాదు నిన్ను వలుక రించరాదు. నీతో ముచ్చటించిన వానికి పాపంబు లంటు గావున మా గ్రామంబులోనీవుండగూడదుపొమ్మని బ్రాహ్మణోత్తములునిషేధించి యశ్వత్థామను వెడలనడచిరి.

అట్లు మునీద్రులచే నిందితుండై చింతించుచు నింకను ప్రాయ శ్చిత్తంబుగోరి వేదవ్యాసుని యాశ్రమంబుజేర నరిగి నమస్కారంబు జేసిన నో బ్రాహ్మణాధమానీవు దోషయుక్తుండవుగాన సంభాషించ నర్హుఁడం డవుగావున బోవలయునని నిరాకరించిన దుఃఖించిమహాత్మాకరీనినిష్కృతి

నీవే వివరింపకున్న నాకు దిక్కెవ్వరని విలపించిన పారాశర్యుం డాలోచించి యీపాపంబునకు శ్రుతిస్మృతులవలన పరిహారంబు గానరాదుగాని యొక్కయుపాయంబు జెప్పెద వినుము.

దక్షిణ సముద్రతీరంబులో రామ సేతువునఁ ధనుష్కోటి యను తీర్థంబు గలదందులో మాసమాత్రంబు శాస్త్రవిధిగా స్నానంబొనరించి పంచాక్షరీ జపంబు జేసితివేని పరిశుద్ధుండవగుదువు పొమ్మని జెప్పిన.

తదుక్తంస్కాందే॥ శ్లో॥ దక్షిణాంబు నిధౌపుణ్యే రామసేతౌవిముక్తిదే। ధనుష్కోటి రితిఖ్యాతం తీర్థమస్తిమహత్తరం॥

అస్తిపుణ్యతమంద్రోణే మహాపాతకనాశనం। స్వర్గమోక్ష ప్రదం నృణాం బ్రహ్మహత్యాదిశోధకం॥

సర్వమంగళమాంగళ్యంసర్వాభీష్టఫలప్రదం । పవిత్రాణాం పవిత్రంచ తీర్థానాంచ మహోత్తమం॥

దుస్స్వప్ననాశనంపుంసాం నరకక్లేశ నాశనం। అకాలమృత్యుశమనం పుణ్యంవిజయకారణం॥

దారిద్ర్యనాశనంపుంసా మాయుర్వర్ధనముత్తమం। చిత్తశుద్ధి ప్రశమనంశాంతిదాంత్యాదికారణం॥

తత్రగత్వా ధనుష్కోటౌ రామసేతౌవిముక్తిదే। స్నానంకురుష్వ ద్రోణేత్వంమాసమాత్రంనిరంతరం॥

జపపంచాక్షరం మంత్రం మహాపాతకనాశనం। సుప్తమారణదోషాత్త్వం సద్యఃపూతో భవిష్యతీతి॥

ఇవ్విధంబున బాదరాయణుండుపదేశించిన యశ్వత్థామవ్యాసోక్త ప్రకారంబున నియమపూర్వకంబుగా జరిగించిన పరమేశ్వరుండు ప్రత్యక్షంబాయెను

యశ్వత్థామ పాపవిముక్తుండై తపోవనంబునకరిగెమునీంద్రులారా ధనుష్కోటిప్రభావం బగణ్యంబు సుమీ మరియు నొక్క యితిహాసంబు

జెప్పెద వినుండు. పూర్వకాలంబున చంద్రవంశ వర్ధనుండగు నందుండను మహారాజు సత్యవ్రతుండు దయాశీలుండు దాతయై ప్రజాపాలనంబు గావించి తన పుత్రుండగు ధర్మగుప్తునికి పట్టాభిషేకంబు జేసి జితేంద్రియుండయి నిరాహారుండయి వనంబులో తపంబు గావించుచుండె.

అంత ధర్మగుప్తుండు బుద్ధిమంతుడయి సకల సుగుణ సమృద్ధి బ్రాహ్మణ భక్తుండ యుదానశీలుండయి ప్రజలబాలించుచు నొకనాడు మృగయావినోదంబున నరణ్యంబులు సంచరించుచు సూర్యాస్తమయంబైన సంధ్యావందనంబొనర్చి క్రూరమృగభయంబున నొకవృక్షంబుపై నెక్కి కూర్చుండ నొకసింహముచే తరమబడి యొకభల్లూకం బావృక్షారోహణంబు జేసె నది జూచి రాజు భీతుండయిన నావృక్షంబున రాజా వెరవకు నీకపకారం బొనర్ప సింహంబుచే భీతినొందివచ్చితి నీవు సుఖంబుగా యుండుమని కొంత సేపటికి రాజా బాలుండవు నిద్రాపరీతుండవైతివి నాతొడలపై పరుండుము నీసంరక్షణంబు గావించెదనని నమ్మించిన రాజునిద్రించెను.

ఆ వెనుక సింహంబు యో భల్లూకమా నే నాకలితో శ్రమనొంది యున్నదాన నీరాజు మనల చంపగల యుద్దేశంబుచే వేటమార్గంబుగావచ్చి యున్నాడుగావున నతనిని క్రిందికి ద్రోసితివేని నాయాకలినిండి నేబోదు నీవు నీ నివాసమునకు బోవచ్చు ననుచు జెప్పిన యో మృగేంద్రా యీ బాలుండగు రాజు నన్నునమ్మి శయనించెను. వీనిద్రోయజాల నేపాపము కైన నిష్కృతిగలదుగాని విశ్వాసఘాతుక పాపమునకు ప్రాయశ్చిత్తము లేదు. నన్ను నిరోధించవద్దని చెప్పె నంత కొంతదడవునకు రాజుమేల్కాంచె మరియు భల్లూకంబు రాజును నమ్మి నిద్దుర బోయె నా సమయంబులో సింహంబు రాజాయిది క్రూరమృగంబు నాభయమునకు వెరచి నిన్నుబుజ్జగించినదిగాని నీ వైక్కారుండవైన భక్షించక విడచునా.

కావున భల్లూకము ను క్రిందికిద్రోయుము దాని భక్షించిన నేఁబోదు నాపై నీవు సుఖముగా నింటికి పోవచ్చు ననిన రాజ కుమారుండు సంతోషించియిదిమంచియుపాయంబని దలంచినాభల్లూకముకు క్రిందికి ద్రోసిన దైవానుగ్రహమున నదిపడక మేల్కాని రాజుకై జూచి రాజా వింటివా విశ్వాస ఘాతకుడికంటే ద్రోహి పాతకుం డన్యుడుండడు సుమీ వినుము

శ్లో॥ విశ్వాస ఘాతకోలోకే మహాకష్టాభవంతిహి । నహిమిత్ర ద్రుహోపాపం నశ్యేద్యజ్ఞాయుతైరపి॥

బ్రహ్మహత్యాది పాపానాం కథంచిన్నిష్కృతిర్భవేత్ ॥ విశ్వాస ఘాతినాంపాపం ననశ్యే జ్జన్మకోటిభిరితి॥

ఇవ్విధంబున శాస్త్రంబుగలదుగాన మిత్రద్రోహీ నీవున్మత్తుండవై భూమిలో సంచరించుమని శాపంబిచ్చి సింహముకై జూచి యో మృగేంద్రామనమిద్దరము శాపోపహతులమై యీజననంబునొందితిమి వింటివా నేనుభృగువంశసంభవుండధ్యానకాష్ఠుండను నామంబుగలవాడ దైవగతిచే నీరూపంబుకొందితి నోసింహంబా నీవు భద్రుండను కుబేరుని సచివుండవు ధనమదాంధంబున నొకనాడు భార్యలంగూడివివస్త్రుండవై నిర్లజ్జచే గర్వించి గౌతమ మహాముని యెదుటదిరిగిన కోపించి సింహంబు గమ్మని శపించిన నీగతి నొందితి వని వచించిన శాప విముక్తుండయి గంధర్వ రూపంబునొంది గౌతముండు ధ్యానకాష్ఠుని సంభాషణంబుచే ముక్తుండ వగుమవని చెప్పిన మాటసత్యంబాయనినసంతోషించి విమానా రూఢుండయి వినోదంబున కుబేరుని జేరబోయె.

ఆ భల్లూకమును శాంబు నొంది యధా రూపంబు దాల్చె నంతట రాజపుత్రుం డున్మత్తుండై పిచ్చివానిరీతి లోకములో దిరుగుచుండ దైవానుగ్రహంబునతనతండ్రియగునందునిమాళిగ్రమము జేరియున్మత్తునిరీతి

సంచరించుచుండ నతని తనకుమారునిగా నెరింగి యడిగిన వృత్తాంతంబం తయు జెప్పినవిని చింతించి జైమిని మహామునికడకు దోడ్కొనిపోయి పాదములపై బ్రవాలి కథయంతయు జెప్పిన ధ్యాన కాష్ఠుని శాపముద్రిప్పశక్యంబుగాదుగాని దక్షిణ సముద్రములో రామసేతువులో ధనుష్కోటిలో స్నానము జేయించిన పవిత్రుండగునది మహాపుణ్యతీర్థ మని చెప్పిన నామునీంద్రునకు నమస్కారంబు గావించిన నంతు డాక్షణంబున పుత్రసహితుండై ధనుష్కోటి కేగి పుత్రసహితుండ యిస్నానంబు జేసిన పుత్రునకున్మాదంబుమాని బుద్ధిమంతుడయ్యె

అంతట నంతుండు తపోవనంబున కరిగె ధర్మగుప్తుం డనేక దానంబులు ధనుష్కోటిలో గావించి రామనాథస్వామి దర్శనంబుజేసి స్వస్థచిత్తుండయి నిజనగరంబునకుపోయి రాజ్యంబేలుచుండె వింటిరామునులారా ధనుష్కోటివైభవంబు మరియొక్కటి వినిపించెద పూర్వకాలంబున పరావసుండను బ్రాహ్మణోత్తముం డజ్ఞానంబున పితృవధ గావించి ధనుష్కోటిలో స్నానమాత్రంబున నా పాప నివృత్తినిబొందెను. మరియొక వింత యితిహాసంబు జెప్పెద సృగాలవానరసంవాదంబెట్లనిన శ్మశానభూమిలో నిద్దరుగూడి వానరుండును నక్కయు యీశ్మశానవాటికలో పూతిగంధాతి కుత్సితంబు లగు. నీశవంబులను భక్షించుచు నీ కష్టంబు లనుభవింతు మెంతుకనెను

నే పూర్వకాలంబునం దేవశర్మయను బ్రాహ్మణపుత్రుండ వేదవేదాంగపారగుండనై యుండియు నొక బ్రాహ్మణున కుడుపద్యాయ ధాన్యంబిత్తునని వాగ్దత్తంబుజేసి యివ్వకపోవుటచేత నక్కనై పుట్టితి నీచంబనుభవించు చుంటి నో వానరా పూర్వకాలంబున వేదనాథుండను బ్రాహ్మణునకు పుత్రుండవై బ్రాహ్మణగృహంబులో జొరబడి శాకంబుహరించినపాపంబున నీవు వానరుండ వైతివి.

ఏపాపంబునకైననిష్కృతిగలదుగాని బ్రాహ్మణ ద్రవ్యంబుహరించినవానికి ప్రాయశ్చిత్తంబులేదని కుఃఖింపుచున్న సమయంబున దైవానుగ్రహంబున భూతి రుద్రాక్ష ధారియు శివనామ పారాయణుండును శింధుద్వీపుండను బ్రాహ్మణుండక్కడికివచ్చినజూచియిద్దరుదుఃఖించి యతనిపైబడి యాక్రోశించి దీనికి ప్రాయశ్చిత్తంబు జెప్పుమని ప్రార్థించిన నావిప్రుండు చింతించి దీనికి నిష్కృతిలేకుగాని పూర్వ కాలంబున సుమతి యను నొక బ్రాహ్మణుండు కిరాతిసంగమంబుసేయుచు మధ్యపానరతుండై బ్రాహ్మణద్రవ్యంబనుభవించి దుఃఖింపుచు రామసేతువులో ధనుష్కోటి యందు స్నానంబొనరించి పాపత్రియనివృత్తినొందెగావున మీరిద్దరా ధనుష్కోటికిబోయి స్నానంబులు గావించిన నీచ జన్మ రాహిత్యం బగును. సుగతి దొరకునని జెప్పెను.

వారావిధంబున జరిగించి పునీతులైరి మరియు నొక్క విశేషంబు మహోన్నతంబైన యితిహాసంబుజెప్పెదను రాచారుండను బ్రాహ్మణుండు దుస్సాంగత్యంబువలనబ్రాహ్మణహీనుండై భేతాళగ్రస్తుండై ధనుష్కోటిలో స్నానంబుజేసి ముక్తుండయ్యెనని జెప్పిన సూతాగూకథ విశదంబుగా వినుపింపుమనిన మునులారా స్వర్ణస్తేయీ సురాపాయీ బ్రహ్మఘ్నగురుతల్పగమీరునల్గురుమహాపాపులు॥ తత్సంయోగీతిపంచమః॥ అనివారి సాంగత్యంబును జేసినవాడై నాపాపాత్ముండెట్లనిన.

నల్గురు పాపాత్ములతో నొక దినంబు సాంతంబు గూడి చరించిన బ్రాహ్మణ్యంబులో చతుర్భాగంశంబు నశించును.

రెండోదినంబుగూడిన సగంబు మూడుదినంబులు గూడెనేని భాగ త్రయంబు నశించును.

దినచతుష్టయంబైనపిమ్మట బ్రాహ్మణ్యవాచకహీనుండగును నాపైగలసి శయనాసన భోజన మజ్జనాదుల గలసెనేని తత్తుల్య పాతకుండయి దేహంబు లేదు.

కావున నాదురాచారుండు బ్రాహ్మణ్య హీనుండయి బాహుళ్యం బువలన భేతాళ గ్రస్తుండయిన తనశరీరం బెరుంగక నున్మత్తుండయి ననేక దేశంబులు సంచరించుచు దైవానుగ్రహంబున ధనుష్కోటి జేరి యందులో మునిగినంతమాత్రంబున పూర్వస్మృతివచ్చి నేనుగౌతమీతీర వాసుండనిట్టిజలధితీరంబెందు కింతదూరంబు వచ్చితినని చింతింపుచుండె.

అంత నాసమీపంబున దత్తాత్రేయుండనుమహా యోగిని జూచి పాదాభివందనంబుజేసి యోమహాత్మా నాపేరు దురాచారుండు గౌతమీ తీరవాసుండ నేనిచ్చటి కెందుకు వచ్చితినో తెలియదు మీరుసర్వజ్ఞులు గాన నాకు వివేకం బేర్పరుప వలయునని విలపించిన నా దయాళుండు ముహూర్తమాత్రంబు చింతించి ఓయీ నీవు మహాపాతకుల సాంగత్య దోషంబున బ్రాహ్మణ్యహీనుండవైతివని భేతాళుండునిన్నావహించె మరియు ధనుష్కోటి తీర్థజలంబులునీపై బడుటచేపూర్వజ్ఞానంబుగలిగెపాపపంజరవిముక్తుండవైతివి మహాపాపాత్ముల సాంగత్యదోషంబుహరించె నిన్ను వీడించిన భేతాళుండు పూర్వ కాలంబున బ్రాహ్మణుండు భాద్రపద కృష్ణ పక్షంబులో మహాళయం బొనరింపని పాపంబుచే నతనిని భేతాళత్వంబు నొందె ధనుష్కోటి దర్శనమాత్రంబున భేతాళ రూపంబు మాని విష్ణు లోకప్రాప్తుండయ్యె.

—* మహాళయపక్ష శ్రాద్ధప్రకరణము. *—

లోకంబులోలోభంబున భాద్రపదమాసంబులోమహాలయశ్రాద్ధం బొనరించనివారు దురాచారులు భేతాళరూపంబునొందుదు రందుకు సందేహంబు లేదు మహాలయ పక్షంబులో వేద వేదాంగ పారగుండు శ్రోత్రియుండగు బ్రాహ్మణున కొక్కనికైన నిద్దరికైన ముగ్గురునల్గురికైన శ్రాద్ధ విధానంబుగా భోజనంబుబెట్టవలయు భాద్రపదబహుళ పాడ్యమిప్రభృతి సూర్యుండు వృశ్చికరాశిలో ప్రవేశించువరకు నాదినంబులు పితృ పక్షంబులో గణనీయంబులని యెరుంగవలెను.

భాద్రపదబహుళపాడ్యమీదినంబున శ్రాద్ధంబుజేసినవారలకు పితి హోత్రుండష్టయిశ్వర్యంబు లొసంగు దేవతలుదశసహస్రవర్షంబులు తృప్తి బొందుదురు. మహాలయ శ్రాద్ధంబు చేయనివానికి గృహక్షేత్రా రామాదులగ్ని హోత్రుండు దహించు.

ద్వితీయాదినంబున మహాలయంబు జేసినవానికి పార్వతీనాథుండు సంతసించి సకలయిశ్వర్యంబులొసగు కైలాసవాసంబు నిచ్చును జేయని వాని పితరులు కాలసూత్రమహాభయంబుల బడుదురు వానికిబ్రహ్మతేజం బడంగును.

తృతీయాదినంబున గావించినవానికి కుబేరుండు సంతోషించిమహా భాగ్యంబిచ్చును బ్రహ్మ విష్ణు మహేశ్వరులువానివెంట నుండుదురు పిత రులు ముప్పదివేల కల్పంబులు తృప్తిబొందుదురు చెయ్యనివానికి దారి ద్ర్యంబు సంభవించును.

చతుర్థీదినంబున జేసినవానికి గణపతిప్రీతుండయి విఘ్నంబులెల్ల దూరంబు సేయు పితృతృప్తి గలుగు. చేయనివానికి సకలకార్యంబులును విఘ్నంబులగును.

పంచమీశ్రాద్ధంబున లక్ష్మీదేవి ప్రీతిచే సకల భాగ్యంబులిచ్చు నాచంద్రతారకంబుగాకీర్తిగల్గును. గావించనివానియింట లక్ష్మీ పార్వతు లుండబోరు.

షష్ఠితిథియందు శ్రాద్ధంబుజేసిన షణ్ముఖుండుప్రీతుండగును పుత్ర పౌత్రాభివృద్ధిగలుగు చేయనివానికి జ్వాలా నరకంబుదొరుకును.

సప్తమీ దినంబున శ్రాద్ధంబు జేసెనేని సూర్యుండు ప్రీతుండయి హిరణ్యాదులొసంగు చేయనివానికి క్షయరోగాది పీడగలుగును.

అష్టమీదివసంబున మహాలయంబుచేసినవానికిమహాదేవుడుదయచే కైవల్యంబు కరస్థంబై యుండును. పదివేలకల్పంబులుపితృగణంబులుతృప్త లగుదురు చేయనివానికి సకలదుఃఖంబులు సంభవించును.

# శ్రీ సేతు రామేశ్వరమహాత్మ్యము.

నవమీదినంబున మహాలయంబు జేసిన మహిషాసురమర్దని దుర్గాదేవి ప్రసాదంబున దేహాపస్మారాదిరోగంబులు మాను మహదైశ్వర్యంబు దొరుకును. చేయనివానికి భూత ప్రేత పిశాచ బాధలు దగులును.

దశమీదినంబున మహాలయంబు జేసిన షోడశకళావరి పూర్ణుండగు చంద్రుండు మహదైశ్వర్యంబు లిచ్చు ధనధాన్యంబు లెచ్చు. జేయనివానికి కృషి భగ్నంబగు

ఏకాదశిదినంబున మహాలయంబు జేసినవారికి మహాకాల రుద్రుండు ప్రీతుండయి సర్వశత్రు వినాశంబు జేయు. చేయనివానికి బ్రహ్మ హత్యా దోషంబులు సంఘటించు శత్రుబాధ గలుగును.

ద్వాదశీ దినంబున మహాలయంబు జేసినవానికి రమానాథుండను చతుర్భుజుండు ప్రీతుండై యుండు చతుర్దశ భువనంబులు సంతసించు శ్రీదేవి భూదేవులు సకలేప్సితంబు లొసంగుదురు. విష్ణుగదయగు కౌముదియపస్మారంబులు మాన్పును చక్రంబు విఘ్నచ్ఛేదంబు సేయును. శంఖంబు యాతుధానాది బాధలుమాన్పును చేయనివాడుమానవులచే బాధనొంది అస్థిచ్ఛేదన నరకంబులో బడును

త్రయోదశీ దినంబున జేసినవానికి మన్మథుండు సంతోషించి ప్రశస్తందన వనితాభోగంబులుగలుగు, చేయడేని సుఖహీనుండగు.

చతుర్దశి యందు మహాలయంబు గావించిన సదాశివానుగ్రహ పాత్రుండై యభీష్టంబుల బొందును. చేయనివాడు మహాపాపాత్ములతో తుల్యుండగును.

అమావాస్యయందు మహాలయంబు జేసినవానికి పితృగణంబు లమృత పానంబుగా తృప్తినొందుదురు బ్రహ్మలోక నివాసు లగుదురు. సంతతి వృద్ధిగలుగును యుమారమాపతులిద్దరు సకలైశ్వర్యంబు లిత్తురు బ్రహ్మహత్యాదిపాపంబులు నాశనంబగును దేహాంతంబున బ్రహ్మైక్యాను

సంధానంబుచే సాయుజ్యప్రాప్తుండగును చేయనివాని పితరులు పుణ్యాలోకంబుల నుండినను నధఃపాతకు లగుదురు సంతతి నాశనంబగును.

ఓమునులారా భాద్రపదమాసంబు వచ్చిన పితృగణంబులు మా నామగోత్రంబులుచ్చరించి మాపుత్రులు బ్రాహ్మణుల కన్నంబు బెట్టుదురు. మాకు తృప్తిగల్గునని నృత్యంబు సేయుచుందురు భాద్రపద కృష్ణపక్ష ప్రతిపత్తు మొదలుకొని ప్రత్యహంబును శ్రాద్ధంబుసేయుచు బ్రాహ్మణుల కభ్యంగనంబుగావించి ఘృతసూపభక్ష్యభోజ్యాది సమృద్ధిగా భోజనంబు బెట్టినవారి పితృదేవత లాకల్పాంతంబు సుధాపానసమంబుగాతృప్తి బొందుదురు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తృప్తిబొందుదురు బహుభాషణంబు లేల భాద్రపద బహుళపక్షంబున మహాలయ శ్రాద్ధంబుగావించిన త్రిలోకంబులు తృప్తినొందు నిస్సందేహంబు పుత్రహీనులగువారికి వారి భార్యలు జేయవలెను. జేయనితీరుకు దానికినరకంబువచ్చును ఆవశ్యంబు మహాలయంబు సేయవలెను.

దరిద్రుండయి ద్రవ్యంబు లేకపోయిన బ్రాహ్మణుల రాజుల వైశ్యుల భిక్షంబడిగి జేయవలెను భిక్షంబును దొరకకున్న నరణ్యంబులోకి బోయి పితృదేవతలారా దరిద్రుండను భిక్షంబెత్తిన దొరకదాయనిన రోదనంబుసేయుచు తనహస్తంబుల నుదరంబుపై కొట్టుకొనుచు మహాధ్వనితో నేడ్చినవాని పితరు లప్పుడు తృప్తి బొందుదురు.

గావున పితరులు శ్రాద్ధకాలంబున తమ గృహంబు నాశ్రయించి యుందురు. (సుతులు లేనివారికి గతులు లేవనినట్లు) సుతులు శ్రాద్ధకాలంబుల పితరుల తృప్తిం బొందించక పోయినవారుశాపంబిచ్చి గృహంబు వెడలి వారివారి నివాసంబులకు పోదురు. కాబట్టి పితరుల శ్రాద్ధకాలంబుల తృప్తులం జేయుట సుతులకు కర్తవ్యంబు.

మహాలయంబు జేసెనేనియు సకలతీర్థఫలంబును సకలయజ్ఞఫలం బును తులాపురుష ది దానఫలంబును చాంద్రాయణాది వ్రతఫలంబును చతుర్వేద పారాయణ ఫలంబును గాయత్ర్యాది మహామంత్ర జపఫలం బును సకలేతిహాస పురాణపారాయణఫలంబును బ్రహ్మవిష్ణు మహేశ్వర లోక ప్రాప్తి కారణ ఫలంబును సకలేప్సిత ప్రదంబునై మహాఫల దాయంబగును.

వినుండు మునులారా పూర్వకాలంబున యయాతి దుష్యంత భరత నల హరిశ్చంద్ర కార్తవీర్యార్జున దశరథాంబరీష శ్రీరామ ధర్మ రాజాదులు మహాలయంబులు గావించి నారివారిబాధల కష్టంబులబాసి పుత్రసంపత్తినుంది రాజ్యాభిషిక్తులై కీర్తికాములై భూలోకసౌఖ్యంబు లనుభవించి స్వర్గాది పుణ్యలోకంబుల నివాసంబులు జేసిరి మరియును వశిష్ఠాత్రి భృగు గౌతమాంగీరస కుత్స కాశ్యపభరద్వాజ విశ్వామిత్రా గస్త్యపరాశరమృకండు ప్రభృతిమహామునులందరు మహాలయశ్రాద్ధంబు లొనరించియణిమాద్యష్టయిశ్వర్య సిద్ధులంబొంది జీవన్ముక్తులై విలసిల్లిరి.

కావున నైశ్వర్యంబు గోరినవారలు మహాలయ శ్రాద్ధంబు గావిం చుట యవశ్యకరణీయ్యంబు నట్లుగావింపనివారలు భేతాళరూపంబునొం దుదురు యో దురాచారా పూర్వజన్మంబున నీవుమహాలయ శ్రాద్ధంబొన ర్చని కారణంబున భేతాళ గ్రస్తుండవై తివి యైనను ధనుష్కోటి తీర్థం బులు నీవిూదబడుటచే నింతజ్ఞానంబుగలిగె.

ఉక్తంచస్కాందే॥ శ్లో॥ విప్రనిందాకృతానూరిణాం ప్రాయశ్చిత్త మితీరితః। శూద్రాన్ననిరతానాంచ శ్రుతినిందారతాత్మనాం॥

కన్యా విక్రయిణాంవిప్రాః క్రయ విక్రయిణాంతథా। వేదవిక్రయి ణాం దేవ విక్రయైనిరతాత్మనాం.

విశ్వాసఘాతుకానాంచ కృతఘ్నానాం ననిష్కృతిః। భారిత్రుభా ర్యారతానాంచ ధర్మవిక్రయిణాంతథా॥

తీర్థవిక్రియిణాంపుంసాం ప్రాయశ్చిత్తంనవిద్యతే । తేషాం పాప వినశ్యంతి ధనుష్కోటినిమజ్జనాత్॥

మాతృద్రోహపితృద్రోహాయతిద్రోహరతాత్మనాం। గురునిందా పరాణాంచ శివనిందాపరాత్మనాం॥

సత్కథాదూషకానాంచప్రాయశ్చిత్తంనవిద్యతే । తేషాంచాత్ర ధనుష్కోటౌ స్నానాచ్ఛుద్ధిర్భవిష్యతి॥

ఏవంచఃకథితంవిప్రాః ధనుష్కోటీస్తువైభవం । యశ్శ్రుత్వా సర్వ పాపేభ్యో ముచ్యతేమానవోభువీతి॥

వింటిరా మునులారా ధనుష్కోటిమాహాత్మ్యంబు స్కంద పురాణంబులో జెప్పిన విస్తారగ్రంథంబంతయు వివరించిన బహు వచనంబులు గావలెను మీరు సకల తీర్థయాత్రా సంగ్రహంబు వినగోరినవారుగావున గ్రంథబాహుళ్యంబగు సంక్షేపరూపంబుగా స్థాలీపులా న్యాయంబుగా దాని మాహాత్మ్యంబంతయు గ్రహించవలెను.

## —* క్షీరకుండ మాహాత్మ్యము. *—

(నలనీలగవాక్షాది తీర్థ విశేషములు)

మహనీయ గుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులకు సకలపురాణ వ్యాఖ్యానవైఖరీసమేతుండగు సూతుం డిట్లనియె. ఓ మునీంద్రులారా రామసేతువునంగల తీర్థంబులలో ముఖ్యంబులై వెలయు చక్ర తీర్థాదులగునరువదినాలుగు తీర్థంబుల తెరంగెరుంగించితిరి. ఇక మీద నేది వినం గోరెద రెరుగింపుండనిన శౌనకాదు లిట్లనిరి. ఓపౌరాణికోత్తమాచక్రతీర్థ సమీపంబుననుండు క్షీరకుండతీర్థంబున కానామధేయంబెట్లుగల్గె. తద్వైభవంబేలాగు సవిస్తరంబుగా నెరుగింపు మని వేడిన సూతుం డిట్లనియె.

# ౧౦౨ శ్రీసేతురామేశ్వర మాహాత్మ్యము.

ఓమునీంద్రులారా దేవీపురపశ్చిమంబున ఫుల్లగ్రామంబున నొకప్రదేశంబు గల దచటనుండి శ్రీరామచంద్రుండు లవణసముద్రంబులో సేతు బంధన ప్రారంభముగావించె తత్తీరంబున దర్శనస్పర్శన కీర్తన ధ్యానంబు లొనర్చినమాత్రంబున సకలపాపక్షయకరంబగు క్షీరగుండంబుగలదు దానిప్రభావం బెరింగించెద పూర్వకాలంబున వేదోక్తాచారసంపన్నుండగు ముద్గలుండను మునీంద్రుండు దక్షిణసాగరప్రాంతస్థిత ఫుల్లగ్రామ సమీపంబున నారాయణప్రీతికరంబగు యజ్ఞంబుగావింపుచుండ.

శ్రీమన్నారాయణుండు పీతాంబరధరుండై శంఖచక్ర కౌస్తుభాది భూషణ భూషితుండై శ్రీదేవీ భూదేవిసహితుండై ముద్గలునకు ప్రత్యక్షుండైన సాష్టాంగుండై యిట్లని స్తుతించె.

లక్ష్మీవిరాజితోరస్కుండును కాలమేఘసమప్రభుండును పీతాంబరవిరాజితుండును కౌస్తుభాలంకృతుండును శంఖచక్రగదాపద్మ విరాజిత చతుర్భుజుండును విజితానందరోముండగు పుండరీకాక్షుంగాంచి భక్తిపరవశుండై పులకాంకిత విగ్రహుండగుచు ఓరమానాయకా నీవుసకల జగన్నిర్మాతవు తత్పాలకుండవు తత్సంహార్తవు మత్స్యరూపివి కమఠావతారుండవు వరాహానారసింహ వామనజామదగ్న్య రాఘవబలభద్రకల్క్యాది రూపధారివి విజ్ఞానస్వరూపుండవు నిన్నుగొనియాడ నాదరంబే నిర్లజ్జుండ కృపణుండ క్రూరుండ పిశునుండ డాంబికుండ పరదార పరద్రవ్య పరక్షేత్రలోలుడవు నన్నుంగరుణాదృష్టి నవలోకించి రక్షింపుమని వేడిన.

ముద్గలః॥ ప్రథమ జగత్సృష్టిః పాలకాయతతఃపరం । సంహార్త్రేచతతఃపశ్చా న్నమోనారాయణాయతే॥

నమోతత్వ స్వరూపాయ కమఠాయచిదాత్మనే। నమోవరాహ వపుషేనమఃపంచాస్యరూపిణే॥

వామనాయనమస్తుభ్యంజమదగ్నిసుతాయతే। రాఘవాయనమస్తుభ్యంబలభద్రాయతేనమః॥

కృష్ణాయకలయేతుభ్యం నమోవిజ్ఞానరూపిణే। రక్షమాంకరుణాసింధో నారాయణజగత్పతే॥

నిర్లజ్జంకృపణంక్రూరం శిశునండాంబికంకృశం। పరదారపరద్రవ్యపరక్షేత్రైకలోలుపం। అసూయావిష్టహృదయంమాంరక్షకృపయాహరే॥

శ్రీవిష్ణుండు ముద్గల స్తోత్రింబునకు సంతుష్టుండై వరంబు వేడుమనిన నారాయణా మీదర్శనంబుకంటే నెక్కువవరం బేమియున్నదైనను నాకుసాయుంప్రాతఃకాలములయందువయోహోమంబు జేయునిచ్ఛగలిగినదనిన విష్ణువు విశ్వకర్మనురప్పించిస్ఫటికశిలా కుట్టిమంబగుసరస్సును కల్పించుమని కామధేనువును రప్పించి క్షీరంబుతోనింపుమని యాజ్ఞ యిచ్చిన తత్ప్రకారంబున జరిగించిరి. దానిచేదానికిసరిగాక్షీరకుండంబనినామంబుగల్గె నచ్చట స్నానంబు జేసినవారికి మహాఫలంబు మరియు గాయత్రీసావిత్రీతీర్థంబులు మహాత్తమంబులు వాటిలో నవగాహనం బవశ్యకరణీయంబు.

ఓమునీంద్రానీయజ్ఞంబున ప్రత్యక్షరూపంబున హవిర్భోజనంబుగావింప నేతెంచితిననిన ముద్గలుండు సంతోషంబునొంది యిట్లనియె. ఓ రమానాయకా నే ధన్యుండనైతి మత్పత్నియు సుతులును కృతార్థులైరి నాజన్మంబును తపంబును వంశంబును ఆశ్రమంబును సాఫల్యంబు నొందె యోగీంద్రులు మనంబున నిరంతరంబును దలంచుచుండు నీవుసాక్షాత్కారంబు నొందితివి మదీయక్రతుకాలంబు సఫలంబయ్యెననుచుఆవాహనాసనాది షోడశోపచారంబులం బూజించిన హరియును ప్రీతుండయి హవి

స్సనుభుజించి తృప్తిం బొందె నంత నగ్నియు సకలామర సంఘంబులు చరాచరాత్మకంబులగు జగంబులన్నియు తృప్తింబొందె నాసమయంబున లక్ష్మీ కాంతుండు ముద్గలుం గాంచి ప్రీతుండయి వరంబు వేడు మనిన నతం డిట్లనియె.

ఓరమానాయకా నీవుప్రత్యక్షంబునొంది భుజించుటవలనం గృతార్థుండనైతి నింకవరం బొందెడ్డి గలదయినను నీయందు నిశ్చలంబును నిష్కపటంబగు భక్తింబ్రసాదింపుము మరియును ప్రతిదినంబును ప్రాతస్సాయంకాలంబుల వయోహోమంబు గావించుట శ్రుతి చోదితంబు గాన నే తత్ప్రీతింగోరి సురభిక్షీరంబున నిత్యంబు హోమంబు గావింప గోరెద నేనిర్ధనుండ నాకెట్లు సురభిక్షీరంబు గల్గునట్లు ప్రసాదింపుమని వేడిన నారాయణుండు అమృతాశనుండగు విశ్వకర్మనురావించి స్ఫటికశిలా భేదంబుల నొకసరోవరంబు నిర్మింపుమని యాజ్ఞాపింప నతం డట్లొనర్ప సురభి రావించి యితండు మద్భక్తుండు మత్ప్రీతిం గోరి నిరంతరంబు వయోహోమం బొనర్పం గోరుండన నీవీసరోవరంబును సాయం ప్రాతః కాలంబులం నచుదెంచి పయః పూరంబుల పూరింపు మితండు దాన హోమంబుగావించుచుండుననిన సురభియు నంగీకరించె మాధవుండు ముద్గలుంగాంచి యిట్లనియె.

ఓతపోధనా నీవీసరోవర తీర్థంబగు సురభిక్షీరంబుచే నిత్యంబును సాయంప్రాతఃకాలంబుల మత్ప్రీతింగోరి హోమంబు గావింపుము గాన నేసంతుష్టినొందెద నీతీర్థంబు క్షీరకుండంబని లోకంబున ఖ్యాతిబొందు నీతోయంబున స్నానంబుగావించిన వారలు పంచమహా పాతకంబులవలన నుపపాతకంబులవలనను బాసి పరిశుద్ధులగుదురు. నీవును దేహాంతంబున ముక్తబంధనుండవయి నన్నుం బొందెద వని యానతిచ్చి తిరోహితుం

డమ్యె. నంత నా మునీంద్రుండును నారాయణుం గూర్చి ప్రీతుండై యనేకశతసంవత్సరంబులు సురభిక్షీరంబున హోమంబు గావించుచు దేహాంతంబున విష్ణుసాయుజ్యంబు కొందె ఓ మునీంద్రులారా క్షీరకుండ తీర్థంబున కానామంబుగల్గిన తెరంగెరుంగించితి పూర్వ కాలంబున కాశ్య పునిభార్యయగు కద్రువు కపటంబుజేసి సపత్నియగు వినతం బరాజితం గావించి దోషంబునొంది పిమ్మట భర్తృవాక్య చోదితయై యాతీర్థంబున స్నానంబొనర్చి పరిశుద్ధురాలయ్యె నెవ్వరైనను పరిశుద్ధ మానసు లగుచు నందు స్నానంబుజేయుదురో వారలకు వేదశాస్త్రంబులు యోగ జప తపోనియమంబులు తీర్థంబునిషేవణంబులేల నా తీర్థబిందు సంయుక్తం బగు గాలిసోకినను బ్రహ్మలోక ప్రాప్తిం బొందుదురు. మరియు నాతీర్థో త్తమంబున స్నానంబు జేసినవారలు సూర్యాగ్ని సమానతేజులై వెలయు దురు యెన్నటికిని వైతరిణ్యాది నరకంబులం బొందరు యేనరుండైనకామ ధేనుసమంబగు నా తీర్థంబు గల్గియుండియు నితర తీర్థంబుల సేవింపం బోవుట గోక్షీరంబు సిద్ధంబై యుండ యర్కక్షీరంబు గోరుటకు సమానం బగు నేభుజాస్నానంబు గావించివచ్చెద వినుండాతీర్థంబునందు స్నానంబు గావించిన వారల కలభ్యం బేదియును లేదు ముక్తియుం గరస్థంబై యుండు సత్యంబు సత్యంబు సత్యంబు యేనరుండైన నీ యధ్యాయంబు పఠించు వినునతండు క్షీరకుండ తీర్థస్నానఫలంబునొందు నిశ్చయంబు.

మరియు ఋణవిమోచనతీర్థంబుగలదు దానిలో స్నానంబు జేసి దేవర్షి పితృతర్పణంబులు జేసినవారికి ఋణగత యవిమోచనం బగును. తదుపరి జపతీర్థంబున స్నానంబు జేయవలెను తదుపరి నలతీర్థంబున నవ గాహనంబు మహాపుణ్యంబు. తదుపరి సుగ్రీవ తీర్థంబును, నీలతీర్థంబును, గవాక్ష తీర్థంబును, గజ, గవయ, శరభ, కుముద, సార, పనసాది వానర కల్పితంబులగు తీర్థంబు లనేకంబులు గలవు. విభీషణ తీర్థంబు

# ౧౦౾ శ్రీ సేతు రామేశ్వర మాహాత్మ్యము.

మహాపాతకనాశనకరంబు మహాత్మ్యంబు మునీంద్రులారా సకలతీర్థంబుల ప్రభావంబును వినుపించితిని

—* కద్రూపాప శాపవిమోచనము. *—

మహనీయ గుణగరిష్ఠులగు శౌనకాదిమునీంద్రులు సకలపురాణార్థ విశారదుం డగు సూతుని కిట్లనిరి. ఓ పౌరాణికోత్తమా కద్రూ వినత లేవరితనూజలు కద్రూ వేల ఛలంబున సపత్నిం బరిభవించెపిమ్మట క్షీరకుండ తీర్థంబున స్నానంబు జేసి యెట్లు ఆదోషంబువలన విముక్తయయ్యె. నా తెరంగంతయు సవిస్తరంబుగా నెరుఁగింపు మనిన సూతుం డిట్లనియె. ఓమునీంద్రులారా పూర్వంబున ప్రాజాపతి పుత్రికలగుకద్రూవినతలుకశ్యపు బరిణయంబై తత్ప్రసాదంబుఁబొంది యుండిరందు కద్రువు శేష వాసుక్యాద్యనేక పన్నగంబులంబడసె వినత అరుణ గరుడులను పుత్రుల నిర్వురం గాంచె యిట్లుండ కద్రు ఒకసమయంబున నంతికంబునసంచరించుచునుచ్చైశ్రవుంగాంచి కపటంబు జేయం దలంచి వినతం బిలిచి ఓ వినతా యీ యశ్వంబు నీలవాలంబై ప్రకాశించెడు జూడుమయనిన నాబిడ ఓ కద్రూ ఈయశ్వరాజంబు శ్వేత వాలంబై యుండ నీలవాలంబని యేల వచించెద వనియె నిట్లాయిర్వురు వివాదంబు జేసి పరాజయంబు నొందిన వారలు దాసీభావంబు నొందునట్లు ప్రమాణంబుగావించిరంత కద్రువు నిజ తనూజులగు సర్పరాజంబుకడకుంబోయి ఓపుత్రులారా నే దాసింగాక నుండునట్లు శ్వేతంబగు నుచ్చైశ్రవు వాలంబు నీలంబుగా జేయుండన వార లంగీకరింపకయుండ కద్రువు రోష మూర్ఛితయై జనమేజయుండు సేయు సర్పయాగంబున నాశనంబు నొందుడని పుత్రులకు శాపంబొసంగ వార లలో కర్కోటకుండనువాడు దీనుండై జననిపాదంబులపయింబడియోతల్లీ నేనుచ్చైశ్రవువాలంబు నీలంబుగా జేసెద భీతిబొందకుమని యాతండంబు స్వభోగంబుచే నుచ్చైశ్రవు వాలం బంజన క్రమంబుగా జేసె నంత

కద్రూవినతలు యుగాంత కాలంబున యోగనిద్రా విరాజితుండగు ఆది నారాయణునకు శయనంబును శశాంక శంఖ మాణిక్య ముక్తారావణ కారణంబగు సముద్రోపాంతంబున నుండు నుచ్చైశ్శ్రవంబుం జేరి రంత వినత కృష్ణవాలంబగు దేవరాజ వాహనంబుగాంచి సంక్షోభితయై కద్రువునకు దాసియై యుండ తార్క్ష్యుండండంబు వెడలి గిరిసామగ్రి శరీరుండై హుతాశనుంబోలె దేజరిల్ల నాతని దేహ మాహాత్మ్యంబున కచ్చెరువంది నిర్జరు లనేక విధంబుల బొగడిరి. భువనత్రయంబును భీతిబొందె నంత నతండు నాబి బృష్ఠంబు నెక్కించుకొని మాతృసమీపంబు జేరె. కద్రువు వినతం గాంచి ఓచేటికా నేనానాలయంబునకు బోవంగోరెద నీవును నన్ను వహింపుము నీపుత్రుండగు గరుడుండు మత్పుత్రుల వహించునని యాజ్ఞాపింప వినత గరుడుంగాంచి యో నందనా యీసర్పంబులు మోయుమనిన నతండు జననీ వాక్యంబుల నంగీకరించి యాసర్పంబుల వహించె. వినతయు కద్రువను వహించె నంత తార్క్ష్యుండు సహస్రాంశురథసమీపంబునకు వేగంబున బోయిన చండకిరణరశ్మిమండలంబుల వేడిమికోర్వనోపక నురగంబులు నుర్విం గూలిన కద్రువ సహస్రాక్షు ననేకవిధంబులం బొగడి తత్ప్రసాదాసాదిత జలాసారంబుల పుత్రుల కెల్ల శాంతి గావించె నంత సరీసృపంబులు గరుడుంగాంచి యిట్లనిరి.

ఓరీ చేటిపుత్రా ద్వీపాంతరముల జూడ మాకభిప్రాయము గలదు గాన మమ్ము వహించి యచటికిం బొమ్మనిన నాతండిట్లు గావించి యొకసమయంబున వినతం గాంచి యిట్లనియె ఓ జననీ నే నీయురగంబుల మోయుటకును నీవు కద్రువను మోయుటకును గారణంబేమి మరియు నన్నీయురగంబులేల చేటీపుత్రుండా యని వచించెద రిది యంతయు నిజం బెఱుగింపుమనిన వినత యిట్లనియె. ఓ తనయా నేపూర్వంబున క్రూరయగు భగినిచే లఘువునపరాజితనై దాసినైతి తత్కారణమున నీవును చేటీపుత్రుండవని

పిలువంబడుచు నీయురగముల మోపెదవు నేనీ కద్రువను మోయుచున్న దాన నేనేమిసేయుదునని ఖిన్నయై యెరుంగించిన తాత్పర్యకాంక్షీ దాస్యా బేలాగునం బాయు నిందుకు జేయందగిన కార్యం బెద్ది యనిన వినత నీ విప్పుడ సర్పముల కడకుంబోయి యీదాస్య విమోచనంబున కుపాయం బడుగుమనిన నతండాక్షణంబు సర్పములకడకుంబోయి ఓ యహీంద్రులారా మీ రేదియైనం గోరిన నది దెచ్చియిచ్చెదను నాకీదాస్య విమోచనము గావింపుండనిన పన్నగము లమృతంబుగోరిన నాతండట్ల దెచ్చి యిచ్చెద నని వచించి జననీసమీపమునకుంబోయి యాతెరంగంతయు నెరుంగించి యమృతాపహరణమునకుంబోయెద నాకలి వొడమెడు భక్ష్యం బొసంగు మనిన వినత యోపుత్రకా సముద్రమధ్యమునునుండు దుశ్చరిత్రులగు శబరులం భుజింపుము వారలయందొక విప్రుండు శబరీసంగకౌతుకియైయుండు నతం డగ్నియుం బోలె బ్రహ్మతేజంబున కంఠంబు దహించు వాని నెరింగి పరిత్యజించుము నీశరీరంబాతయు మరుదాది దేవతలు రక్షింతురు గాకయని యాశీర్వదించి యంపిన గరుడండాక్షణంబ శబరాలయమునకుం బోయి వారలనెల్లఁ భక్షింపుచుండ నొక బ్రాహ్మణుండు గిరిధరిం బ్రవేశించు విహంగముల విధంబున వివృతంబగు గరుడుని కంఠబిలంబునం బ్రవేశించు శబరులలోనుండి కంఠంబు దహింప వైనతేయుం డెరింగి యో విప్రుండా నీవు పాపకారివియైనను వధ్యుండవు కావు కాన త్వరితముగ కంఠము వెడలుమనిన నతండు మద్భార్యయగుశబరిని వెడలింపుమని వేడిన గరుడుం డట్లొనర్చె నంత నావిప్రుండు నిషాదీ సహితుండై యథేచ్ఛం జనియె. నంతఖగోత్తముండా శబరులనెల్ల భక్షించి యతి వేగమున నిజ జనకుండగు కశ్యపమునీంద్రుం జేరి యోతపోధనా మదీయ మాతృ దాస్య నివాసార్థంబై యమృతంబు దేవం బోయెద నా కాహారం బొసంగుమని వేడిన కశ్యపుం డిట్లనియె.

మౌనిసత్తమా! పూర్వకాలంబున బ్రాహ్మణవంశసంభవులగు సుప్రతీక విభావసులను భ్రాతలిర్వురు విత్తవిరోధంబుచే పరస్పర శాపంబులం బొందిరి వారలలో సుప్రతీకుండు షడ్యోజనోచ్ఛ్రాయంబున తద్ద్విగుణాయామవిస్తర సంయుతంబగు గజంబయ్యె విభావసుండును త్రియోజనోచ్ఛ్రాయంబున దశయోజన విస్తృతంబగు కూర్మంబయ్యె నిట్లాయిర్వురు పూర్వవైరంబున పరస్పరజయంబుఁగోరి యాసరోవరంబున యుద్ధంబుగావించుచున్నారు వారల భక్షించితృప్తుండవై యమృతంబు దేవం బొమ్మని యాజ్ఞాపింప గరుడుండు దక్షిణంబు మహాకాయంబులగు గజకచ్ఛపంబుల నఖంబులంగొని యొక తీర్థసమీపంబునకుంబోవ తత్తీరజంబులు మహోచ్ఛ్రాయంబగు రౌహిణేయంబను నగంబా గరుడుంగాంచి యోయీ శతయోజనాయతంబగు మదీయశాఖపై యిగ్గజకచ్ఛపంబుల భుజింపు మనిన నతం డట్లొనర్ప యాశాఖపయిం గూర్చుండ నది భగ్నంబయ్యెనంత నా శాఖ నవలంబించి యధోముఖులై తపంబొనర్చు వాలఖిల్య మునీంద్రులంగాంచి యిదిభూమింబడిన ఈ మునిసంఘంబులకు బాధయగునని దానంగొని యంబరంబునంబోవుచు జనకాజ్ఞచే నిర్జనంబగు నగంబున నాశాఖ విడిచి గజకచ్ఛపంబుల భక్షించి తృప్తుండై యమృతాహరణార్థంబై బోవుచుండ దివంబున మహోత్పాతంబులయ్యె నంత నింద్రుండు బృహస్పతింగాంచి యోతపోధనా యీయుత్పాతంబులకుఁ గారణం బెఱింగింపు మనిన నతండిట్లనియె. ఓపాకశాసనా పూర్వంబున భవజ్జనకుండగు కశ్యపుండు యజ్ఞంబు గావింప సకల సురసంఘంబులు మునీంద్రులును యజ్ఞభారంబులంగొని యరుదెంచుచుండ నీవాసమయంబున గోష్పదజలంబుల మజ్జనంబు గావించు వారలును అంగుష్ఠప్రమాణదేహులును యజ్ఞసంభారయుతులగు వాలఖిల్య మునీంద్రులంగాంచి పరిహాసంబు జేసితివిగాన నా మునీంద్రులు క్రోధజ్వలితాననులై యింద్రశత్రుండగుపుత్రుండు కశ్యపున

కునయించుచునని హెవాకుంబు గావించిరి గావున నికుంకు వృక్షుండై యుద్భవించి యిప్పుడు సుధాహారణంబుగోరి యరుదెంచుచున్నవాడు గావున నీయుత్పాతంబు లమ్యోకునని వాచస్పతి యెరిఁగించిన యింద్రుండాక్షణంబ యమృతరక్షకులరావించి గరుడుం డమృతంబు గోరివచ్చుచున్నవాడు వీర లతిప్రయత్నంబుం బక్షింపుడని యాజ్ఞాపింప వారలియ్యకొని యాయుధ పాణులై యుండ పక్షీంద్రుండును నచటికి మహావేగంబున నంబోవ వారలు భీతిల్లి యస్త్రశస్త్రంబులుఁ గొని యుద్ధంబు సేయుచుండ సుపర్ణుండు కొందర తుండాగ్రంబున కొందర పక్షంబుల ఖండించుచు పక్షవిక్షేపంబు గావింప ధూళి యాకసంబు గప్పె నంత త్రిదశప్రేరితుండగు పవమానుం డా ధూళిభుజంబు నిరసించిన ఖగేంద్రుండు క్రోధదీప్తుండై రుద్రవసు మరుదాది సురసంఘంబుల నెల్ల పక్షతుండంబులం బీడింప వారలును భీతులై పలాయనంబు నొందిరంత పురోభాగంబున జ్వలించుచునగ్నింగాంచి నదీజలంబుచే శాంతింబొందించి యొకభ్రమచ్చక్రంబుఁజూచి సంక్షిప్తాంగుండై తదంతరాళంబున బ్రవేశించి నతిభయంకరరూపంబులై జనంబుల దర్శనమాత్రంబున భస్మంబుగావింప నోపు యహీంద్రద్వయంబు గాంచి వానిశిరంబుల కాలంద్రొక్కి యమృతంబెత్తుకొని యంతరిక్షంబునం బోవుచుండ రమానాథుండే తెంచి యోవైనతేయా నీవ్రతాపంబునకు మెచ్చితి వరంబు వేడుమని యానతిచ్చిన ఖగేంద్రుండు ప్రీతుండగు రమానాథుం గాంచి యోకమలామనోహరా నాకెల్లప్పుడు జరా మరణంబులు లేక యుండునట్లును నీవాహనంబును కేతనంబగునట్లును ప్రసాదింపవే యని వేడిన నారాయణుం డంగీకరించి యావరంబొసంగి యంతర్ధానగతుం డయ్యె నంత నాఖండలుండేతెంచి యాగరుడుని పక్షంబులపై కులిశంబు వేచిన నతండు నవ్వుచు పాకశాసనుంగాంచియిట్లనియె యోపురుహూతా త్వత్కులిశ పాతంబువలన నాకువేదన గలుగనేరదు అయిన నొక పర్ణం

బొందంగెన దానిఁడిది సహోద్యోగంబగునని యొకపర్ణంబొసంగ సకలసుర మునిసంఘంబు లాతపపర్ణంబులసుస్థిరత్వంబునకు మెచ్చిసుపర్ణుండని పొగడి రంత గరుడుం డింద్రునితో మఱలనిట్లనియె. యోపురందరా నేసచరాచరా త్మకంబులగు సకలలోకంబుల వహింపఁజాలుదు భవాదృశ సహస్రంబు లైనను నాకు యుద్ధంబున లక్ష్యంబుగారు నీవేమిసేయనోపుదు వనిన నిర్జర నాయకుం డతనిసామర్థ్యంబున కాశ్చర్యంబునొంది శాంతంబుగానతనితో యిట్లనియె.

ఓఖగేంద్రుఁడా అజయుండ వమృతుండవగు నీకమృతంబేల నీవిను రులకిచ్చిన వారలు జరామరణవర్జితులై మాకంటె నధికులై మమ్ముబా ధింతురుగాన సురలకిమ్మని వేఁడ నింద్రుంగాంచి యోసురనాయకా నే యమృతంబుగొనిపోయి యురగులకిచ్చి నామాతృదాస్యంబుబాపెదఁబిమ్మట వారలుపయోగింపకమున్న నీవాయమృతంబు గొనుమనిన దేవేంద్రుండు ప్రీతుఁడై వరంబువేఁడుమనిన సుపర్ణుండుకపటంబుచే మజ్జనని దాసింగాఁజేసిన యురగంబులెల్ల నాశనంబగునట్లు గావింపుమని వేఁడిన నింద్రుండావరంబొ సంగె నంత గరుడుం డమృతంబు గొని యురగుల కడకుంజని యోపన్న గంబులారా యమృతంబు తెచ్చి కలశంబులపై నుంచితి మీరలింకమజ్జనం బుగావించి పానంబొనర్పుండు మజ్జననీదాస్యంబు బాసెననిన సర్పరాజంబు లంగీకరించె నింద్రుండంతరి యమృతంబుగొని గగనంబునకు బోయి యథా స్థానమునం దుంచె నాసమయమున భుజగంబు లమృతంబుగానక నదియుంచిన దర్భలనాకుటవలన జిహ్వాంబుల కుశాగ్రతాడితంబులై ద్వివిధములయ్యె. నాటంగోలె పాములెల్ల ద్విజిహ్వాలనబరగె నమృతస్థితింజేసి దర్భలుపవిత్రం బులయ్యె నివ్విధమున గరుడుండు జననీదాస్యము వాపి కపటముననీజనని దాసింగాఁజేసికొనిన కద్రువుంగాంచి కోపమునభర్తృపరిచర్య కర్హగాక యుండుమని శాపంబొసంగి యదృచ్ఛంబోయెనంత కద్రూవినతలుభర్తృ

సమీపమునకుబోవ నామునిపుంగవుండు క్రమ్మఱంగాంచికోపసంరక్తలో
చనుండై యోదురాత్మికా వినతంగపటమునం బరాజితం జేసితివిగాన మత్సరి
చర్యకుండగవు యేమనుజుండైనను రేయింగనయైనను పరులంగపటము
గావించి జయమునొందుదురో వారలుమహాపాతకులనం బడుదురు తత్సం
భాషణముగావించిన నరుండు బ్రహ్మహత్యా సురాపాన స్వర్ణస్తేయాది
దోషములంబొందు పిమ్మట నరకమునం బడుదురు. మరియును ఛలజేత్రు
పంక్తి భుజించువాడతి దారుణ నరకమునొందు మరియు నతని దర్శనము
గాంచిననరుండు పాపశాంతికై సూర్యునైన జలమునైన పావకునైనవిలో
కింపవలయు యెచటనతండు వసించునచట నివాసముగావించిన వారలెల్ల
నరకప్రాప్తులగుదురుగాన మత్సరిభావమునకుండకుమని కద్రువనుధిక్కా
రము జేసి స్వేచ్ఛశీలయగు వినతం బరిగ్రహించె నిట్లుకశ్యప మహామునీం
ద్రుచే నిరసింపంబడి యతని పాదపతితయై విలపింపుచున్నను నతండంగీ
కరింపకపోయిన వినతయిట్లనియె. ఓమునీంద్రా మద్భగినిం దయాళుండ
వై రక్షింపు మజ్ఞానమున పాపము గావించె క్షమింపుము లోకమున భవా
దృశులగు సాధులెల్ల దయాళువులై యుందురుగదా యనివేడిన వినతం
గాంచి కశ్యపుం డిట్లనియె.

ఓవినతా యీపాపమునకు శాంతియొనర్చినంగాని యీదురాచా
రింగైకొన నే ముమ్మాకు వచించెద నిశ్చయంబనిన వినతయిట్లనియె.
ఓమునీంద్రా యీపాపమునకు నిష్కృతి గావించి తత్పరిచర్యార్హ
ఎట్లగునది వచింపవేయని వేడిన నతండు కొంతదడవు చింతించియిట్లనియె.
దక్షిణసముద్రతీరమున విముక్తిదంబగు పుల్లగ్రామమునపాపవినాశంబగు
క్షీరసరంబున నెకతీర్థముగలవు కద్రువచటికింబోయి స్నానంబొనర్చిన
మాత్రమున దోషవిక్తియగు నట్లుగావింపక ప్రాయశ్చిత్తా యుతము

లొనర్చిన నీకోపము నశింపదని శర్యాపుండు వచించిన క్రతువుపుత్రసహాయుఁడై కతిపయదిన ములక్షీరసరంబునకుంబోయి విజతేంద్రియుఁడు ప్రియతముఁడై సంకల్పపూర్వకముగాస్నానంబొనర్చితిధిక్రమంబుపవాసముండి చతుర్దివసమునఆదరపూర్వకముగ స్నానముజేయుచుండఁ అశరీరవాణియిట్లనియె. ఓవనితా ఈతీర్థమునస్నానముజేయుటంజేసి గడచిన శాపమునశించె భర్తృశుశ్రూషణమునకహాయిఁరాలవైతివిఛలకిచ్ఛ దోషము నశించె నింక భర్తృసమీపమునకుఁ బొమ్మతండు నిన్నుఁబరిగ్రహించునని వచించిన క్రతుప్రియాయుశరీరవాణికివందనముగావించియాతీర్థమునకు ప్రదక్షిణము జేసి పుత్రసహితయై భర్తృసమీపమునకుంబోయె నంతనామునీంద్రుండు క్షీరసరోవరములస్నానముగావించివిధూతపాపుఁడగు క్రతువంగాంచి ఆత్మశుశ్రూషణమున కంగీకరించెను ఓమునీంద్రులారా క్రతుశాపవిమోక్షణంబగు వృత్తంబెఱింగించితి యెవ్వండయిన క్షీరసరోవరమున స్నానం బొనర్చిన ముక్తిఁబొందు మరియును యేమనుజుండయిన యీ యధ్యాయము భక్తియుక్తుండై పఠించు వినునతండు క్షీరకుండ స్నానఫలమును అశ్వమేధాదియజ్ఞఫలముపు గంగాది సర్వతీర్థఫలమునుం బొందు నిశ్చయంబని శౌనకాది మునీంద్రులకు సూతుండెఱుంగించెను.

## —* కపి తీర్థ మాహాత్మ్యము. *—

### (రంభా శాపవిమోచనము)

మహాసీయ గుణగరిష్ఠులగు శౌనకాది మునీంద్రులకు సకలపురాణాభిజ్ఞుండగు సూతుండిట్లనియె. ఓ మునీంద్రులారా పూర్వంబున రావణాదులగు నక్తంచరులు మరణంబుఁబొందిన పిమ్మట వానరులందరు గంధమాదనంబున కరుదెంచి సర్వలోకోపకారార్థంబై యొక తీర్థంబు నిర్మించి యీతీర్థంబున స్నానంబు గావించిన మానవులువిధూతపాపులయి నరక దారిద్ర్యంబు నొందక ముక్తిఁబొందుదురు యీతీర్థంబునవెవ్వండైన

నిరంతరంబు స్మరింపుచుండు నతండచ్యుత పరంపరంబనొంది పిమ్మట పరమ పదంబు నొందు నీతీర్థంబునకు సదృశంబు లేక యుండునని వరంబు లొసంగి రామచంద్రుకడకుంజని నమస్కార పూర్వకంబుగా నో రఘు నాయకా యీతీర్థంబునకు నుత్తమంబగు వరంబొసంగవే యని వేడిన రామచంద్రుండు ప్రీతుండయి యీకపితీర్థంబునస్నానంబొనర్చినవారలు గంగాది సర్వతీర్థస్నానఫలంబును అగ్నిష్టోమాదియజ్ఞ ఫలంబునుగాయ త్ర్యాది మహామంత్ర జప ఫలంబునుంబొందుదురని వరంబొసంగె నంత శశిశేఖరుండును నలువయు సహస్రాక్షుండును యముండును వరుణుం డును ఆదిత్యాంకును మరియునుంగల నిలింపులును అత్రియు భృగుకుత్సుం డును గౌతముండును పరాశరుండును కణ్వుండును అగస్త్యుండును సుతీ క్ష్ణుండును విశ్వామిత్రుండును నారదుండును మొదలగు మహర్షులందరు యారామదత్త వరంబగు తీర్థంబనేక విధంబులం గొనియాడి యందు స్నానమొనర్చి యీతీర్థంబు కపీంద్రులచే నిర్మితం బగుటం జేసి కపి తీర్థంబను ఖ్యాతిం బొందునని వచించిరి గాన నది సకల తీర్థోత్తమం బయి వెలయుచుండు నాకపితీర్థంబున ముక్తిం గోరువారందరు స్నాన మొనర్పవలయు. పూర్వంబున రంభ కౌశిక శాపంబున శైల రూపము నొంది యాతీర్థంబున స్నానమొనర్చి మరల నిజరూపంబునొందె ననిన శౌనకాది ఋషు లిట్లనిరి

ఓపౌరాణికోత్తమా విశ్వామిత్రునిచేత రంభను శైలమగునట్లు శాపమొసంగె. పిమ్మట శిలాభూతయగు యాసురాంగన యట్లాతీర్థంబునకుపోయి స్నానమొనర్చె నిదియంతయు సవిస్తరంబుగ నెరింగింపు మని వేడిన సూతుం డిట్లనియె. పూర్వంబున కుశికాన్వయంబున విశ్వామిత్రుండను భూపలలామముండుదయించి యొకానొక సమయంబున సేనా పరివృతుండయి సకల దేశంబుల సంచరించుచు వసిష్ఠాశ్రమంబునకు పోవ

నామహాత్మ్యంబు కామధేనుప్రభావంబున నతనికాతిథ్యంబొసంగిన తృప్తి
డయి కామధేను ప్రభావంబెఱింగి దానిం దనకిమ్మని వేడిన వసిష్ఠుండంగీ
కరింపకపోయె నంత కౌశికుండు బలాత్కారంబున కామధేనువు గ్రహిం
పంబోయి తద్విసృష్టులగు మ్లేచ్ఛాధికులచే పరాజయంబు నొంది మహా
దేవునారాధించి తత్ప్రసాదంబున సకల దివ్యాస్త్రంబులుం బడసి మరలవసి
ష్ఠాశ్రమ సమీపంబునకుబోయి బ్రహ్మాస్త్రాదిదివ్యాస్త్రంబులనెల్ల బ్రయోగింప
నామునీంద్రుండు బ్రహ్మదండంబుచేనని యెల్ల వారించిన విశ్వామిత్రుండు
పరాజితుండగుచు బ్రాహ్మణ్యంబునకై తపమొనర్ప గోరి పూర్వదక్షిణ
పశ్చిమ దిక్కులయందు ఘోరంబగుతప మొనర్చి యచ్చటవిఘ్నంబునొంది
యుత్తరాశంబునకుం జని హిమవంతంబున పావనాకనియందు కౌశిక నదీ
తీరంబున జితేంద్రియుండును నిరాహారుండును జితశ్వాసుండును జితక్రో
ధుండును గ్రీష్మంబున పంచాగ్నిమధ్యస్థుండును వర్షాకాలంబుల అకాశ
గుండును శిశిరంబుల జలమధ్యస్థుండునునై యత్యుగ్రంబగు తపంబు దివ్య
వర్ష సహస్రంబులు గావింపుచుండ యింద్రాదులగు నిర్జరులు
భీతిగలిగి రంభంగాంచి యిట్లనిరి. ఓకామినీమణీ హిమవచ్ఛైలంబున
కౌశికీ నదీతీరంబునం దుగ్రతప మొనర్చు విశ్వామిత్రుని కడకుం జని
తత్తపంబునకు విఘ్నమొనర్పుమనిన నదిసురలంగాంచి ఓ త్రిదశపుంగవు
లారా విశ్వామిత్ర మహామునీంద్రుండతి క్రూరుండు నన్నుంగాంచి శాప
మొసంగుగాన నేభయంబు నొందెద మీరలు దయాపరులయి నన్నీకా
ర్యంబున నియోగింపక రక్షింపుండనిన జంభారి యిట్లనియె ఓవనితా
భీతినొందకుము నీవతిసుందర రూపంబు నొంది యామునీంద్రు మోహిం
పం జేయుము నేనును నీ వెంట నరుదెంచెద ఈమన్మథుండును కోకిలాలాప
మధురుండగు వసంతుండును నరుదెంతురనిన రంభయు విశ్వామిత్రాశ్ర
మంబునకుబోయి మనోహర విచేష్టితంబులుగావింప మదనుండును మనం

బున నానందంబు గావించె నంత మునిపుంగవుండా రంభం గాంచి సంశ
యంబు నొంది శతక్రతుకృతంబు విఘ్నంబుగా నెరింగి క్రోధ సంరక్త
లోచనుండయి యిట్లనియె.

ఓరంభా నీవతిదారుణంబగు శిలారూపంబునొందివర్ష శతాయుతం
బులుండుము పిమ్మటనొకబ్రాహ్మణునిచే రక్షింపంబడిస్వరూపంబు నొందె
దవనిశాపంబొసంగె నాక్షణంబనదియుశిలారూపంబునొందిబహుకాలంబు
విశ్వామిత్రాశ్రమ సమీపంబుననుండె నంతనామునీంద్రుండును మహత్త
రంబగు తపంబుగావించి వసిష్ఠవాక్యంబునరాజన్యదుర్లభంబగు బ్రాహ్మ
ణ్యంబుజెందె నాయాశ్రమంబున నగస్త్యశిష్యుండగు శ్వేతుండనుమునీం
ద్రుండు చిరకాలము మోక్షముగోరి తపంబుగావింపుచుండ నంగారక
యను నొక రక్కసి మేఘస్వన మహాస్వనయగుచు మూత్రరక్త పురీషా
దుల వర్షింపుచు మరియు ననేకవిధంబుల నామునీంద్రునిబాధింపనతండు
క్రుద్ధుండయి కౌశికసుత కోపమొందిన శిలంగొని వాయవ్యాస్త్ర సంయో
గ్యంబు గావించి యారక్కసిపైనైవ నదియు నానిశాచరినను గమించె.
నానక్తంచరియు భీతింబొంది దక్షిణసముద్రతీరంబుననుండు కపితీర్థంబున
మునింగిన నాశిలయు నసుద్రుతరయై యచటికింబోయి యా రాక్షసిశిరం
బునంబడియె. నంతరంభయు కపితీర్థమజ్జనప్రభావంబునశిలారూపంబువిడిచి
నిజరూపంబునొంది కుసుమధారావర్షితయుదివ్యవిమానారూఢయుదివ్యాం
బర విరాజితయు హారకేయూరకటకవరాభరణ భూషితయు ఊర్వశ్యాది
సఖీపరివృతయు నగుచు మారా కపితీర్థమహాత్మ్యంబనేకవిధంబులంబొగడి శశి
భూషణుండగు రామనాథుసేవించి యమరావతికింబోయెనారాక్షసియు పూ
ర్వంబున ఘృతాచియను వేశ్యారత్నంబదియునుకుంభజన్మశాపంబునరాక్ష
సీరూపంబునొందియుండి యప్పుడాతీర్థంబున స్నానం బొనర్చినకతంబున
నిజరూపంబునొందె. ఓమునీంద్రులారా యివ్విధంబున ఘృతాచీ రంభ
లిద్దురు అగస్త్య శిష్యుండగు శ్వేతమునీంద్రు ప్రసాదంబున రాక్షసి శిల

రూపంబులవిడిచి కపితీర్థప్రభావంబుననిజరూపంబులంబొందిరిగానజనుండు సకలప్రయత్నంబుల నందు స్నానంబుగావింపవలయునని శౌనకాది మునీంద్రులకు సూతుం డెరుంగించెను

మరియు గాయత్రీ సావిత్రీ తీర్థంబులు మహాత్త్యంబులు వాటిలో నవగాహనం బవశ్యకరణీయంబు.

మరియురుణవిమోచనతీర్థంబుగలదు. దానిలో స్నానంబు జేసి దేవర్షి పితృతర్పణంబులు జేసినవారికి ఋణగతయువిమోచనంబగును.

తదుపరి దేవ తీర్థంబున స్నానంబు జేయనలెను. తదుపరి నలతీర్థంబున నవగాహనంబు మహాపుణ్యంబు.

“ తదుపరి సుగ్రీవ, తీర్థంబును, నీల, తీర్థంబును, గవాక్ష, తీర్థంబును, గజ, తీర్థంబును, గవయ, తీర్థంబును, శరభ, తీర్థంబును, కుముద, తీర్థంబును, సార, తీర్థంబును, ”

పనసాది వానర కల్పితంబులగు తీర్థంబు లనేకంబులు గలవు. విభీషణతీర్థంబు మహాపాతక నాశనకరంబు మహోన్నతంబు మునీంద్రులారా సకల తీర్థంబుల ప్రభావంబును వినుపించితిని.

వింటిరా మునీంద్రులారా రామేశ్వర మాహాత్మ్యంబు॥

శ్రీరామలింగ స్వామి దర్శన సేవా కైంకర్యాదుల వలన
వచ్చే ఫలముల వివరణ.

మరియు రామలింగప్రభావంబు మహోన్నతంబు జెప్పెద సావధానచిత్తులై వినుండు శ్రవణమాత్రంబున సకల పాపంబులు నశించును శ్రీరామచంద్రులచే ప్రతిష్ఠించబడిన రామలింగంబును నే మనుజుండైన దర్శించెనేని వానికి పునర్జన్మంబు లేదు ముక్తుండగును. మునీంద్రులారా రామ లింగ మాహాత్మ్యంబు నెవ్వారు వర్ణించగలరు నాకు తోచి నంత వివరించెద.

# ౧౧౭ శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.







నందికేశ్వరులు. శ్రీరామలింగస్వామి. నందికేశ్వరులు.

తదుక్తం స్కాందే॥ శ్లోకాః. రామప్రతిష్ఠితంలింగం యః పశ్యతి వరస్యకృత్। నరవరోముక్తిమాప్నోతి శివసాయుజ్యరూపిణీం॥

సచ్చిదానందమద్వైతం సాంబంరుద్రం ప్రయాతివై । రామేశ్వరాఖ్యంయల్లింగం రామచంద్రేణపూజితం॥

తస్యస్మరణమాత్రేణయమపీడాదినోభవేత్ । రామలింగేశ్వరంలింగంయేచ్ఛ్వయంతి సకృన్నరాః॥

కిందానైః కింవ్రతైస్తేషాం కింతపస్యాభిః కిమధ్వరైః । రామేశ్వరమహాలింగంమాపన్నార్తిహారంనృణాం।శ్రోతవ్యంకీర్తితవ్యంచస్మర్తవ్యం ముముక్షుభిః। ఇతి॥ వింటిరాముసీంద్రులారా,

ఏమనుజునకైన ధనుష్కోటితీర్థస్నానంబును రామనాథ సందర్శనంబునుగల్గు నతనికి గంగాస్నానంబువలన కార్యంబులేదు యేమానవుండైన ఘటికాద్వయకాలంబు రామనాథుని జింతించు నతండిరువదియొక కులంబు నుద్ధరించి శివలోకముననుండు నెవ్వండైన నొకదినంబున రామనాథుని దర్శించిన నతం డిహంబునధనవంతుండై యుండియంతమున రుద్రత్వంబునొందు రామనాథమహాలింగ సేవవలన గలుగనిఫలం బితర ధర్మంబుల నెన్నడైననుగలుగదు ఎవ్వాడైనజీవితకాలమధ్యంబున నొకానొకప్పుడైన రామనాథదర్శనము సేయనినతండుపితృబీజసంభవుండుగాడు శంకరుండని చెప్పంబడు యేమనుజుండైన రామనాథాలయంబు దారవులచేనొనర్చ

నతండు త్రికోటి కులసంయుతుండై స్వర్గ సుఖంబులం బొందు, నెవ్వం డైన యష్టకంబులచే గావించునతండు వైకుంఠంబునొందు, శిలాసమూహ ములనొనర్చునతండు బ్రహ్మపదంబునొందు. నెవ్వండైన స్ఫటికాది శిలా భేదంబులం గావించునతండు విమానవరంబునొంది శివలోక సుఖంబులం బొందు నేమనుజుండైన తామ్రంబుల నొనర్చునాతండు శివధ్యానస్థి తుండై శివసామీప్యంబుఁ గొందు, నేమనుజుండు రజితంబుల నొనర్చు నతండు శివసారూప్యంబునొంది మహాదేవుచెంతంబున నిరంతరంబు మోదిం చుచుండు, నెవ్వండైన భక్తియుతుండై స్వర్ణంబుచే నొనర్చునతండు శివసాయుజ్య రూపిణియగు ముక్తిఁబొందు, లోకంబున హేమంబున నా శివాలయంబుఁ గావించిన ధనాఢ్యుండును మృత్సమూహంబుల నాయాలయం బుగావించిన దరిద్రుండును వీరిరువురును సమానఫలంబు నొందుదురు.

యెవ్వండైన రామనాథాభిషేక సమయంబున రుద్రాధ్యాయం బును చమకంబును పురుషసూక్తంబును త్రిసువర్ణంబును పంచశాంతియు పవమానాదికంబును జపించునతండు నరకంబునొందడు. యేనరుండైన పంచగవ్యంబుల రామనాథమహాలింగ స్నానంబుగావించునతండా క్షణంబున కల్పజన్మార్జిత పాపంబులం దొలఁగు. మధుస్నానంబు జేయించిన మను జుండు పాపరాశిం బాసి బ్రహ్మలోకంబునొందు. ఘృతస్నానంబుగావించిన మనుజుం డఖిల జన్మకృతపాప సమూహంబులం బాయు. క్షీరస్నానంబు గావించిన మర్త్యుండేకవింశతికులోద్ధారణంబొనర్చి శివలోకంబునొందు. దధిస్నానంబు జేయించిన నరుం డఖిలపాప వినిర్ముక్తుండయి విష్ణులోకంబు నందు తిలతైలాభ్యంగనంబొనర్చినమానవుండు కుబేర గృహంబున వసించు. ఇక్షు రసంబుల స్నానంబు చేయించిన మనుజుండు చంద్రలోకంబునందు. లికుచామ్ర రసా సారంబున మజ్జనంబు జేయించిన నరుండు పితృలోకం బునందు నారికేళంబుల స్నానంబుగావించినమానవుండు బ్రహ్మహత్యాది

మహాపాతకంబుల నాశనంబు జేయు. మరియు రామనాథాభిషేకార్థంబై మృద్ఘటం బెవరుండొసంగునతం డిహంబున చిరాయువై సకలసమృద్ధులం బొందు. తామ్రకుంభంబొసంగిన మనుజుండు దేవేంద్రత్వంబు నొందు. రౌప్యకుంభ ప్రధానంబు గావించిన జనుండు పరమేష్ఠిలోకంబు నొందు. హేమకుంభదానంబు చేసినవాం డీశ్వరలోకము నొందు. రత్నకుంభదానంబుగావించిన మానవుండు శివసారూప్యంబు నొందు. ఏమనుజుండయిన గోదానంబు గావించునతం డశ్వమేధ ఫలంబు నొంది దేహాంతంబున ఈశ్వర లోకంబున కరిగి శివరూపధారియై వెలయు. మహాక్షేత్రంబగు రామేశ్వరంబున రామనాథసన్నిధియందు వసించునతండు ముక్తిం బొందు జనంబుల కాయువు త్వరితంబుగ నరుగు. లోకంబున రామనాథ మహాలింగంబు పూజించి వీక్షించిన వినిన స్మరించిన వారలకు దుర్లభం బెద్దియు లేదు. రామనాథ సేవింపం బోవుచుండు మనుజుం గాంచిన సకలపాపములు భీతిం బొందు. రామనాథు వీక్షించువారికి వేదములు శాస్త్రములు తీర్థయాత్రలేల, ఏవరుం డయిన చందన, కుంకుమ, కోష్ఠ, కస్తూరి, గుగ్గుల, సరళాదుల నొసంగు నతండు ధనాఢ్యుండగు ముక్తాభరణ వస్త్రాదుల నొసంగువాడెన్నండును దౌర్గత్యంబు నొందడు. యెవ్వడయిన సమాహృతంబులగు గంగాతోయంబుల రామనాథ మహాలింగాభిషేకంబు జేయునతం డీశ్వరునకుం బూజ్యుండు. నిందుకు సందియంబు లేదు. ఏపర్యంతంబు మనుజులకు జరామరణంబు గల్గు నందాక సకలలోక వంద్యుండును పూజ్యుండును, స్తుత్యుండును నగు రామనాథుని భజింపవలయు, సకలపురాణంబుల శాస్త్రముల రామనాథపూజాసదృశంబగు ధర్మంబు లేదు గాన భక్తియుక్తులై మహా కారుణికుండగు రామనాథేశ్వరు భజించు వారలు భూలోకంబున పుత్రదార యుతులయి బహుభోగంబులం బొంది దేహాంతంబున శాశ్వతంబగు ముక్తిం బొందుదురు. ఓమునీంద్రులారా రామనాథప్రభావం బెరుం

గించితిరి. ఇంక నేపుణ్యకథ వినగోరెదరో వచింపుమనశౌనకాదులుఓసూతా

—* శ్రీరామలింగస్వామి ప్రతిష్ఠాకథను మునులడుగుట. *—

శ్రీరామలింగప్రతిష్ఠ శ్రీరామచంద్రుండెవ్విధంబునజేసె దానికథ సవిస్తారంబుగా వినుపింపుమని యడిగిన సూతుండు ప్రీతుండయి ముని వ్రాతంబుతో నిట్లనియె.

ఓమునీంద్రులారా శ్రీరామచంద్రుండు సుగ్రీవాది వానరసైన్యంబుతో సముద్రంబుదాటి సువేలాద్రిపై విడిసిజేసియున్నయడ రావణాసురుండు సౌధంబుపై కెక్కి సైన్యంబుల జూచుచుండ సుగ్రీవుండు సహింపజాలక వాయువేగంబుతోపోయి రావణాసురునికిరీటంబులు దన్నినవి నభఃపాతంబులయ్యె సతండుగృహంబులోనికి పోయి రాక్షససైన్యంబులంబంపిన పోరు ఘోరంబయ్యె నతికాయ మహాకాయ ధూమ్రాక్ష తామ్రాక్ష నరాంతక దేవాంతక ప్రభృతి మూలబలంబులు మడిసిన పిమ్మట శ్రీరామభద్రుండు రావణ కుంభకర్ణుల వధించినబ్రహ్మాస్త్ర పాతితుండగు దశగ్రీవునిం గాంచి విద్యాధరాది సకలదేవ సంఘంబులు మునీంద్రులు బహు సంతోషించి రాఘవేంద్రుని స్తుతియించి రింద్రాదులుపుష్పవర్షంబు గురిపించిరి.

అంత శ్రీరామచంద్రుండు విభీషణునకు పట్టాభిషేకంబుజేసి సీతా సౌమిత్రీసమేతుండయి కపిసైన్యంబులతోడరాగ గంధమాదన పర్వతంబునకు వచ్చిన నగస్త్యాది మునీంద్రులు సంతోషించి వినుతించిరి

ఓరఘునాయకా నీవు లోకానుగ్రహకారివిరావణవధంబుగావింప భూతలంబునం జనించినవాడవు తాటకదేహసంహారివి గాధిజాధ్వర రక్షకుండవు మారీచ సుబాహుప్రాణహారివి అహల్యా ముక్తిసంధాయివి పాదపంకజ రేణుండవు హరకోదండ భంజనుండవు మైథిలీ పాణిగ్రహణోత్సవశాలివి రేణుకాపుత్ర పరాజయకారివి పితృవచనంబుసత్యంబుగావింప

౧౨౨ శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.

వైదేహీ లక్ష్మణసహితుండవై యరణ్యంబున కరుదెంచితివి భరతునకు పాదుకాయుగళంబొసంగి శరభంగ మహామునీంద్రునకు కైవల్యంబొసం గితివి విరాధ ప్రాణనాశనంబు గావించితివి గృధ్రరాజ సఖుండవైతివి మాయామృగ మారీచగర్వంబు వారించితివి కబంధుంబు మార్చితివి శబరీ పూజనంబంగీకరించితివి సుగ్రీవ సఖ్యంబుగావించి వాలింబరేత తిలయుంబ కనిచితివి మహాగంభీరంబగు సముద్రంబున సేతుబంధనంబు గావించి రావ ణాది సకలరాక్షస పుంజంబుల వధించి లోకత్రయంబు సుఖంగాంచితివి, మఱియును సంసారాంబుధివి సంతారపోతః పదాంబుజ ద్వయుండవు భక్తార్తి సంహారివి సచ్చిదానందరూపుండవు సర్వలోకసృష్టిస్థిత్యంత హేతు భూతుండవు కరుణామూర్తివి సభక్తరక్షణదీక్షితుండవు మమ్ములగావవే యని పలువిధంబులం ప్రార్థించి యగస్త్యాదులూరకయుండిరి.

ఓ తపోధనులారా నే సర్వమానవులచే విశుద్ధికొరకు సేవనీయుం డను దృష్టిగోచరంబగు జంతువు మోక్షభాజనంబగుఅట్లయినను శాంతులు నిరహంకారులును యధాలాభసంతుష్టులును సర్వభూత దయాళులును ఊర్ధ్వరేతులగు మునీంద్రులకు నిరంతరంబు నమస్కరింపుచుందు గాన బ్రహ్మణ్యదేవుండనైతి మిమ్మొక కార్యంబు వేడెద రావణవధంబునంగలిగిన పాతకంబునకుం బ్రాయశ్చిత్తం బెఱుంగింపు డనిన మునీంద్రు లిట్లనిరి. ఓ జగన్నాథా ప్రొనసత్యవ్రతా మహాపుణ్యంబును విముక్తిదంబగు నీ గంధ మాదనపర్వతంబున లోకోపకారార్థంబుగ శివలింగప్రతిష్ఠ గావింపుము దానచేద శౌనవధ దోషంబునశించు లింగస్థాపన పుణ్యంబువచింప చతు ర్ముఖుండయిన సమర్థుండుగాడు యీగంధమాదనంబున నీచేస్థాపితంబగు శివలింగదర్శనంబున జనంబులకు కాశీలింగావలోకన ఫలంబుకన్న కోటి గుణిత ఫలంబుగల్గు నిక్కము సందియంబులేదు మరియు నా లింగంబు భవన్నామంబుచే రామలింగంబని ఖ్యాతింబొంది కాష్ఠపుంజంబులదహ

ముఖుం బోలె సకలపాపంబుల నాశనంబు జేయుచుండుగాన ఓకరుణాకరా విగ్రహాలింగస్థాపనంబున కాలవ్యయంబు జేయకుమని మునీంద్రులు పలికిన రామచంద్రుండు ద్విముహూర్తకంబగు పుణ్యకాలంబు నిశ్చయించి మహాబాహుండగు హనుమంతుంగాంచి యిట్లనియె.

ఓహనుమంతా నీవతిత్వరితగమనంబున కైలాసంబునకేగి యొకదివ్యలింగంబును దెమ్మని శ్రీరాముండానతిచ్చిన తత్క్షణంబున మహావాయువేగంబున నెగసి కైలాసంబునకరిగి తపోనిష్ఠంజేయ పార్వతీ సహితుండై శివుండు ప్రత్యక్షయ్యుండై లింగంబొసంగిన మారుతి యేతెంచుచుండె.

అగస్త్యాది మునీంద్రులు యాజ్ఞీకంబు జేయించ జానకీకృతంబగున లింగంబును, శ్రీరామచంద్రుండు జానకీ సహితుండయి సంకల్పంబు జేసి జ్యేష్ఠశుద్ధ దశమీ బుధవాసరంబున హస్తానక్షత్రసంయుక్తగరజీకరణవ్యతీపాత యోగపంచాంగ శుద్ధిజూచి కన్యారాశియందు చంద్రుండును వృషభరాశియందు సూర్యుండును విలసిల్ల మహాపుణ్యస్థలంబగు గంధమాదనపర్వతంబుమీద వైదేహీకృతసికతామయ లింగంబును బ్రహ్మహత్యాది నివారణార్థంబు ప్రతిష్ఠించె.

తదుక్తం స్కాందపురాణే॥ శ్లో॥ రామరామమహాబాహో కాలోహ్యత్యేతిసాంప్రతం। జానక్యాయత్కృతంలింగం సైకతంలీలయావిభో॥

తల్లింగంస్థాపయస్వాద్యమహాలింగ మనుత్తమం। శ్రుత్వైతద్వచనం రామోజానక్యా సహసత్వరం॥

మునిభిస్సహితః ప్రీత్యాకృతకౌతుక మంగళం। జ్యేష్ఠమాసేసితేపక్షే దశమ్యాంబుధహస్తయోః॥

గరజీవవ్యతీపాతే కన్యాచంద్రేవృషేరవౌ। దశయోగేమహాపుణ్యే గంధమాదనపర్వతే॥

సేతునాదమహాదేవం లింగరూపధరంహరం। ఈశానంకృత్తివసనం గంగాచంద్రకళాధరం॥

రామోపిస్థాపయామాస శివలింగమనుత్తమం। లింగస్థంపూజయామాసరాఘవస్సాంబమీశ్వరం॥

లింగస్థస్సమహాదేవఃపార్వత్యాసహాశంకరః। ప్రత్యక్షమేవభగవాన్ దత్తవాన్వరముత్తమమితి॥

వింటిరా మునీంద్రులారా యీవిధంబున రామచంద్రుండు ప్రతిష్ఠించిన సైకతలింగంబును నేమానవుండు దర్శించినను కడువినినను రామనాధసేవాఫలంబును కైవల్యంబును లభించును.

ఓ మునీంద్రులారా ఇవ్విధంబున శ్రీ రాఘవుండు సైకత లింగంబును స్థాపించి పూజించు చుండగా హనుమంతుండు లింగద్వయంబును దెచ్చి శ్రీరామునకు సమర్పించి వందనం బాచరించి సీతా దేవిచే నిర్మింపబడిన సైకత లింగమును శ్రీ రాములు పూజించుటచూచి రోషావేశంబుతో నత్యంత క్రోధోద్రేకుడై దుఃఖలోచనుండై వృధాయాసుండై దీనరక్షకుండగు శ్రీరామ చంద్రులతో నిట్లనియె.

ఓ దేవా నేనుజాతుండ లోకంబున క్లేశంబునకై జనించితి నేక్రూరకర్ములగు నక్తంచరానీకంబులచే ననేకవిధంబుల ఖిన్నుండనైతి నావంటి పుత్రుని నే వనితయుంగాంచకయుండిన మేలు నేభవసాగర నిమగ్నుండనై భవదీయ సేవచేతను యుద్ధంబు చేతను బహుప్రకారంబుల ఖిన్నుండనై యనంత దుఃఖంబు నొందితి సుగ్రీవుండు భార్యార్థంబై విభీషణుండు రాజ్యార్థంబై నిన్ను సేవించిరి నే నిర్హేతుకంబుగ నిన్ను సేవించు చున్నవాడ యనేకవానరానీకంబుతో నన్నుకైలాసంబునకుంబోయి లింగంబుదెమ్మని యాజ్ఞాపించితివి నేను త్వరితంబుగ కైలాసంబుజేరి పినాకింబొగడి తత్ప్రసాదప్రాప్తంబగు లింగంబుగొని యరుదెంచితి నీవిప్పుడు సైకతలింగస్థాప

నంబు జేసి దేవమునిప్రభృతులంగూడి పూజించెదవు నేనైకైలాసంబుననుంచి దెచ్చినలింగంబు వ్యర్థంబయ్యె నేనుందభాగ్యుండ భూభారంబునకై జన్మించితి ఈ దుఃఖంబు సహింపజాల నేనేమి సేయుదు నీచే నవమానితుండనైతి శరీరంబు విసర్జించెదనని యనేకవిధంబుల వచించి క్రోధ శోకాకులుండై నమస్కరించిన రఘునాథుండు నవ్వుచు సర్వదేవ మునీంద్రులు చూచుచుండ నాతనినాశ్వాసింపుచు నిట్లనియె.

ఓఆంజనేయా నీయొక్కశక్తి నాకుదెలుసును జాతుండును జాయమానుండును మృత్యువాతంబడకపోరు సమస్తజీవములుతాను జేసినకర్మములచే నిరయంబై నరకంబు నొందుదురు. నిరంజనుండును నిరామయుండునైన పరమాత్మ నెరుంగుము.

ఓ ఆంజనేయా నేను సర్వంబు నెరుంగుదు జాతుండును జాయమానుండు మృతిం బొందుదురు. సర్వజంతువులు స్వకర్మంబుల మృతిం బొంది నరకంబు నొందుదురు పరమాత్ముండు నిర్గుణుండై ప్రకాశించుగాన నీతత్వంబెరింగి శోకింపకుము. లింగత్రయ నిర్ముక్తంబును నిరంజనంబును నిరాశ్రయంబునునిర్వికారంబునగు పరమాత్మనెరుంగుము. తత్వజ్ఞానబాధకంబగు శోకంబు నొందకుము యెల్లప్పుడు జ్ఞానంబునొంది యుండుము సంతతంబును స్వయంప్రకాశంబగు పరమాత్మం భజింపుము తత్వజ్ఞానవిరోధకంబగు దేహాదులయందు మమత యుంచకుము నిరంతరంబు ధర్మంబుభజింపుము ప్రాణిహింస గావింపకుము సజ్జనులసేవింపుము ఇంద్రియంబుల నిగ్రహింపుము ఇతరదోషంబులెంచకుము. వశిష్ఠాదులం బూజింపుము అశుభంబుమాని సత్యంబ నిరంతరంబు పలుకుము ప్రత్యగ్బ్రహ్మైక్యతాజ్ఞానంబు లేకపోవుటవలన వస్తుజాలంబులయందు మోహంబు గల్గెడు శోభనా శోభనంబులభ్రాంతి యదార్థంబుగ గల్పింపంబడు పదార్థంబులం దెల్ల మోహాతిశయంబున శోభనంబు లధ్యాస్తంబు లగు

## ౧౨౬. శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.

భ్రాంతచిత్తులగువారలకు రాగంబుజనించు దేవ తిర్య గ్మనుష్యాదులలో రాగద్వేషాదులంగూడు మానవులు ధర్మాధర్మవశంగతులై నిర్ణయంబు నొందుదురు అతిశోభనంబులగు చందనాగరు కర్పూరాదులచే శరీర స్పర్శమున మలినంబునొందు నాశరీరంబెట్లు సుఖకరంబగు మరియు భక్ష్యభోజ్యాదిపదార్థములచే శరీరసంగమువలన శిష్టంబగు నా శరీరంబెట్లు సుఖకరంబగు మరియు సుగంధియు శీతలంబగు తోయంబే యంగ స్పర్శంబున మూత్రంబగు నాగాత్రంబెట్లు సుఖకరంబగు

ఓయాంజనేయా నేబంప సరోవరంబున జానకీనన్వేషార్థంబు సంచరించుచుండ నీవగుపించి సుగ్రీవసఖ్యంబొనరించి బహుయోజన విస్తారంబుగల నుదధియు నాయాసంబున తరించి సీతంజూచి నా యానవాలం దిచ్చి లంకగాల్చి మరియు ననేక యద్భుత కార్యంబులందుం జేసి జానకి యంగుళ్యంబుదెచ్చి నాకిచ్చి నాదుఃఖంబుదీర్చిన ఆపద్బాంధవుండవు.

ఓ నాయనందనా పరమార్థం బెరుంగించెద వినుము, సంసారగతంబున కించిత్సౌఖ్యం బయినను లేదు మానవుం డజ్ఞానంబు జేసి జన్మంబునొంది పిమ్మట వార్థిక్యంబును మరణంబునుంబొంది మరలం బుట్టుచుండు అజ్ఞాననివృత్తిగల్గెనేనిసుఖంబుగల్గు నదిజ్ఞానంబువలనంగలుగు గాని కర్మాదులవలనం గలుగనేరదు. వేదవాక్యం బగు జ్ఞానంబె పరబ్రహ్మంబని ఎరుంగుము ఆజ్ఞానంబు విరక్తునకుంగలుగుగానియితరునకుం గలుగదు ఆచార్యప్రసాదంబున యాజ్ఞానంబుగలుగు యేమనుజునకయినను మనంబున కామాదులు వర్తించుచుండు నతండు మృతుండగు ఎవ్వాడయిన జ్ఞాననిష్ఠుండయియుండు నతండుపరబ్రహ్మంబునొందు లోకంబున మేలుకొన్నవానిని నిద్రించువానిని భుజించువానినిచరించువానిని కృతాం

తుండు క్రూరుడై సంహారింపుచుండు సర్వంబును క్షయంబులగు వృద్ధి తంబులగు నవియెల్లను పతనంబు నొందు సంయోగంబులు విప్రయోగంబు నొందుజీవితంబు నిధంబు నొందు లోకంబున వృక్షఫలంబునకు పతనంబుకంటె భయంబెల్లను లేకయుండు నట్లు సకలజనంబులకు మరణంబుకంటె మరియొక భయంబుగలుగదు మరియును దృఢ స్తంభంబగు గృహంబెల్లు కొంతకాలం బునకు జీర్ణంబయి నశించునట్లు మానవులు జరామృత్యు వశంగతులయి నాశనంబు నొందుదురు లోకంబునమానవుల కహోరాత్రి గమనంబున నాయుర్వ్రియంబగుచుండు ఆత్మంగూర్చి శోకింపు మితరులపై శోకింప నేల లోకంబున మనుజుం డెచటనున్నను యెక్కడికి బోయినను మృత్యు వనుసరించి వధించు శరీరంబు వయఃప్రాప్తంబగుచుండ శిరోగుహంబులు శ్వేతంబులగు జరయు శ్వాసకాసలు నాక్రమించు అర్ణవంబున కాష్ఠద్వ యంబు సంయోగంబునొంది కొంత కాలంబునకుపిమ్మట వియోగంబునొందు కరణి నీమార్గంబుననుండు మనుజుండును సంచరించుటనుం గలసి కొంత దవ్వరిగి పిమ్మట యథేచ్ఛ జనువిధంబునను భార్యాపుత్రక్షేత్ర ధనాదికం బులు సంయోగ వియోగంబులంబొందుచుండు నదిస్థిరంబుగా దందురు చింతింపం దగదు మనుజుండు జన్మించిన మృత్యువుం జనించి కాలం బెరింగి వధించు నందు కేమియుం బ్రతీకారంబు లేదు.

గావున నాంజనేయా నీవు బుద్ధిమంతుండవు నీకు తెలియనియర్థం బులు లేవుగాని వత్సా మత్సరంబున నెవుశ్ననహించి కుత్సితంబులగు భీభత్స కార్యంబులు నేయకు మతీమ ర్త్యంబులగు కృత్యంబులు మృత్యుంజయు నిపై జెల్లుగా నివ ర్తింతువను గాని ప్రవర్తింపవుగావునకురత్నంబులుమాను మంకుదన శంకలేక లోకశంకరు శంకసురఘుంకించిన కింకరుల్కై కేవంక దగు లునుగాని శంశాక శేఖరుండు దలంకడని శ్రీరామచంద్రుం డుపదేశించిన నేదదీరిలేచి నమస్కారంబులు నేయుచు స్తుతియించె.

హో శ్రీరామచంద్రా! ఆశ్రితపారిజాతుండవు, సీతామనోహరుడవు, దీనజనావనుండవు, వైకుంఠనాథుండవు అఘవినాశుండవు సూరివినుతుండవు, సర్వగీర్వాణ వంద్యుండవు, నగు నీకు మ్రొక్కెద ననుచు ననేక విధంబులసీతారాముల స్తుతించిన ప్రసన్నులై సకలము నీంద్రులువినుచుండ శ్రీరామభద్రుండు వానరశ్రేష్ఠాద్యైవాది దేవుడను దివ్య ప్రభావుండును, సదాశివుండగు సాంబమూర్తికి యపరాధంబు జేసుటచే నింత హానికరంబయ్యెనింతటినుంచి నీవెప్పుడు శివద్రోహంబు సేయకు శివద్రోహి కనేక భవంబులు దురితంబులు భరితంబులయి నిరతంబు బాధించు వేధించు ఛేదించు క్రోధించు సాధించు విరోధించు నిరోధించు ననుచు బోధించిన నాంజనేయుం డంజలి బద్ధుండయి యుండిన వత్సా నీవు దొరలి పొరలిన

—* హనుమత్కుండ ప్రభావము. *—

(హనుమల్లింగ ప్రతిష్ఠాదిమాహాత్మ్యము.)

గుంటహనుమత్కుండంబని త్రిలోక విశ్రుతంబై నిందులో స్నానంబులు జేసినవారికి పంచమహాపాతకంబులయిన భగ్నంబులౌను, నీవుకదిలించుటచే గంగాధరుని జటాజూట విశ్రుత గంగాజలంబులచే నీకుండంబు నిండె గావున గంగా యమునా కావేరి గోదావరీ గోమతీ మొదలగు నదుల కంటె పవిత్రాతితరంబై పుణ్యలోకంబు లొసంగు నీ హనుమత్కుండ సన్నిధిని సవిధానంబుగా శ్రాద్ధంబొనరించి తిలతర్పణంబు జేసినవారి పితరులు తృప్తులయి పుణ్యలోకంబులు జేరగలరు దురాచారుం డెవ్వడేని జేయడేని వాని జన్మంబు వృథాజన్మంబగును జీవన్మృతునిభంగి నిహలోక పరలోకంబుల వికలుండగును ప్రకటంబిదియని నమ్మవలయు నని చెప్పి నీవు దెచ్చిన లింగంబు ప్రతిష్ఠించుమని జెప్పిన రామలింగేశ్వర స్వామి కుత్తర ప్రదేశంబున హనుమల్లింగంబు ప్రతిష్ఠితం బయ్యె. నిప్పటికి రామలింగస్వామికి మారుతిశాల వేష్టనంబునవళిత్రయంబు నిదర్శనంబిచ్చుచున్న

దని చెప్పిన శౌనకాది మహర్షులు మహాశ్చర్యంబు నొంది సంతోషించి సూతా యీకథ బహువిచిత్రంబు బహుపవిత్రంబు పాపలతాలవిత్రం బీకథ యేపురాణంబులో వివరింపబడియె ననియడిగిన సూతుండు మునీంద్రులారా వ్యాసప్రోక్తంబయిన స్కాందపురాణంబులో కథ యిదియనిన సంతసించి లోకద్రోహియగు రావణాసురుని జంపుటచే బ్రహ్మహత్య సంభవించెనని చెప్పితి విది యాశ్చర్యంబు బ్రాహ్మణుని వధించిన బ్రహ్మహత్య సంభవించుగాని రాక్షసుని జంపిన బ్రాహ్మణహత్య కేమి కారణంబని

—* రావణాసురుని జన్మప్రశంసా బ్రాహ్మణ్యసిద్ధిహేతువు. *—

యడిగిన మునులారా రావణుండు బ్రాహ్మణుండు చతుర్ముఖ బ్రహ్మకు అగస్త్యుండను కుమారుం డతనికి విశ్రవసుండు తనయుండయి మహా తపోనిష్ఠాగరిష్ఠుండయి తపంబు సేయుచు నిల బిలా సంయోగంబున కుబేరుండను మహాధనాఢ్యుం డగు పుత్రునింబడసిన నదిజూచి సుమాలి యను రాక్షసుండు తత్సమానంబున తపంబు సేయుచు కుబేరసదృశుండగుదౌహిత్రునిం బడయగోరి విచారించి తనపుత్రియగు కైకేసిని బిలిచియిట్లనియె.

ఓతనయా నీవు విశ్రవసుం బ్రేమించి పుత్రుం బడయుము. వాఁడు మహాబలాఢ్యుఁడగునన నామె నట్లు విశ్రవసుంజేరి నమస్కరింప నా తపస్వి యాయమవృత్తాంత మెల్ల దెలిసికొని ఓసాధ్వీ నీకోరికసిద్ధించును గాని సాయాహ్నంబున సమాగమం బగుటవలన నీ కుద్భవించు పుత్రులు క్రూరులు కుచ్ఛితులుగా నుందురన, నావనిత భయాక్రాంతురాలయి గడగడవడకుచుండ నాతపోధనుండు దయాళుండయి నీకు మూడవ కుమారుండు యోగ్యుడు విష్ణుభక్తుండుగా జననంబయి నీ వంశమును పావనము జేయు. మరియు జననకాలంబున నారావం బొనర్చుటవలన రావణాసురుండనియతనికి పేరులోకవిశ్రుతంబయ్యె. తదనంతరంబున మహాదంష్ట్రిండును మహాకాయుండును లోకభయంకరుండును దురాచారుండును దుశ్శీ

లుండు నగు కుంభకర్ణుండు సంభవించె తమవరిశూర్పణఖ యుద్భవించె. నాపై వేదశాస్త్రమార్గ ప్రవర్తనుండును ధర్మశీలుండును బుద్ధిమంతుం డగు విభీషణుండు బుట్టె గావున రావణాసురుండు బ్రహ్మ బీజోత్పన్నుం డగుటచే బ్రహ్మహత్యసిద్ధించె. మునీంద్రులారా శ్రీరామభద్రుండు శివలింగ ప్రతిష్ఠాపనంబు జేసుటచే బ్రహ్మహత్యా విమోచ నియమ తీర్థంబును కల్పితంబయ్యె. ఆతీర్థంబులో నవగాహనంబు జేసినవారికి మహాపాపం బులు భస్మంబులగునని చెప్పిన శౌనకాది మహామును లత్యాశ్చర్యానంద భరితులయి సూతు ననేక విధంబుల గొనియాడిరి.

### శ్రీరామచంద్రులు బ్రహ్మహత్యా విమోచన తీర్థకుండ భైరవ ప్రతిష్ఠాదులు జరిగించిన మాహాత్మ్యము.

ఆవలికథ యానతీయ వేయని మును లనుగ పౌరాణిక శ్రేష్ఠుం డిట్లనియె. నోమునులారా మీదజెప్పిన స్థలంబున నొక బిల ముండంగని దానిపై శ్రీరామచంద్రుండు మంటపంబుగట్టించి క్షేత్రసంరక్షణార్థంబై భైరవప్రతిష్ఠ గావించె నా బిలమందే బ్రహ్మహత్య మగ్నంబయియున్నది మరియు రామనాథ మహా లింగంబునకు దక్షిణంబుగా శివార్ధ శరీరిణి యగు పార్వతియు పార్శ్వంబుల సూర్య చంద్రులును పురోభాగంబున నందికేశ్వరుండును యున్నవారు రామేశ్వరలింగంబునకు పూర్వభాగంబు మొదలుకొని యష్టదిగ్భాగంబుల నింద్రాదిదిక్పాలకు లెనమండ్రుగురును కాపున్నవారు మరియు విఘ్నేశ్వర షడానన వీరభద్రాదు లచ్చటచ్చట నివసించి రామనాథక్షేత్ర రక్షణజేయుచున్నారు మునీంద్రులారా శ్రీరామచంద్రుడు రామలింగప్రతిష్ఠ జేసి పూజార్థంబయి బ్రాహ్మణుల నిలిపి వారికి యనేక భూషణాంబరాదు లొసంగి యనేకంబులగు నగ్రహారంబు లిచ్చినిలిపె మరియు శ్రీరామలింగ మహావిభవం బొక్కటి విన్నవించెద సావధాన చిత్తులయి వినుండు పూర్వకాలంబున శంకర నామధేయుం డగు

పాండ్యదేశాధిపుండు వేటమార్గంబున ననేక సైన్యంబుతో వేటకాండ్ర వెంబడించుకొని మహాఘోరంబగు విపినంబులో ననేక క్రూరమృగంబుల సంహరింపుచు భల్లూకవ్యాఘ్రంబులగు వరాహశరభ సారంగాది మృగంబుల హింసింపుచు చలరేగి వేటలాడుచు నతని సమానంబగు నొక శరంబు వ్యాఘ్రంబుపై వైచిన నది దప్పించుకొనిపోయె నాబాణంబు నొక్కముని దంపతులకుదగిలి యావృద్ధులిద్దఱు మృతిజెందిరంతట వారి పుత్రుండు మహా క్రోశంబున దుఃఖింపుచుండ నచ్చటి ఋషి గణంబులు నోదార్చు నొక్క మహాకలకలంబగు ధ్వని వెడలిన రాజువిని విషణ్ణుండయి నచ్చటి కేగజూచిన వృద్ధ బ్రాహ్మణ మిథునంబు మరణంబు నొంది పడియున్న చింతా క్రాంతుండయి నేనింత పాపాత్ముండ జీవించిన ఫలంబేమి యీ శరీరంబేల నగ్ని హోత్రంబులో బడవైచి భస్మంబుగావింతుననియుద్యుక్తుండయి లేచి యోహావ్యవాహ బ్రహ్మహత్యానివృత్తికొంకీ దేహంబు నీలో వైచి భస్మంబుగావింతు బ్రాహ్మణదంపతులమరణంబువలన బ్రహ్మహత్యయు స్త్రీహత్యయు రెండుసంఘటించెె. హో మునీంద్రులారా వినుండు నవద్వారంబులుగలిగి చర్మమాంసాస్థి మేధోమజ్జాది దుర్మలిన సిక్తంబై బుద్బుదాకారంబై కామక్రోధ లోభ మదమాత్సర్య మోహాది యుక్తంబయి పరద్రవ్యపరదారాసక్తంబయిన యీదేహంబు కాల్చుటే మేలని నిశ్చయించితినని వినిపించి విలపించి మంత్రులపుత్రుల బిలిపించి రప్పించి రాజ్యభారం బప్పగించి కాష్ఠంబులు దెప్పించి యగ్ని జ్వాల గావింపుడని యారాజు యాజ్ఞాపించిన మంత్రులురోదనంబు జేయుచు నగ్ని ప్రజ్వాలనంబు గావించిన రాజు స్నానాదిక్రియలు నిర్వర్తించి పరిశుద్ధుండయి మునీంద్రులకు నమస్కారంబులు గావించి మహాదేవుని మనస్సులో ధారణావశంబున నిల్పి యగ్నిహోత్రంబులో జొర నిశ్చయించు సమయంబున నాకాశంబున లోక విదితంబుగా నొక ధ్వని వినబడియెను.

## ౧౩౨ శ్రీ సేతు రామేశ్వర మాహాత్మ్యము.

ఓరాజా అనలంబున దేహంబు వృద్ధినొందు చునే యుండుటనుగాన నిర్నిమిత్తమరణంబు నీకేల ప్రత్యహంబును సేతు స్నానంబు సేయుచు శ్రీరామలింగస్వామిని దధిక్షీర మధు ఘృతంబుల నభిషేకంబులు సేయుచు గంధపుష్పాక్షతంబుల భక్తిపూర్వకంబుగా నర్చింపుచును సంపన్నంబు లగు నన్నంబులు భక్ష్యభోజ్యాదిపదార్థంబులునివేదించుచునుండినపాపంబు భస్మంబగు నిర్నిమిత్తంబుగా నగ్నిలోబడిన దేహంబే భస్మంబౌను గాని పాపంబులు సంచితంబులయి వదలకనేయుండునని యశరీరవాణి వినబడిన మునీంద్రు లాశ్చర్యంబునొంది.

శ్లో॥ గచ్ఛశీఘ్రంమహారాజరామసేతుంవిముక్తిదం । రామనాథ స్యమాహాత్మ్యమజ్ఞాత్వాస్మాభిరీరితిమితి॥

ఇవ్విధంబున బ్రాహ్మణోత్తము లుపదేశించిన రాజేంద్రు డనుజ్ఞ గొని గంధమాదనంబునకుబోయి యాకాశవాణి వినిపించిన ప్రకారంబు సేతుస్నానంబును రామలింగార్చనంబును యథా శాస్త్రంబుగా జరిగించిన సంవత్సరాంతంబున రామనాథస్వామి కటాక్షించి ప్రత్యక్షంబయిన నారాజు బహువిధంబుల స్తోత్రంబులు జేయ నారంభించె.

ఓ రామనాథా, ఓ ఉమానాయకా, నన్నుంగావుము కృపాళుండవై బ్రహ్మహత్యనివారింపుము. స్త్రీహత్యావిమోచనము జేయుము ఓ త్రిపురనాశకా నీవు మహాదేవుడవు, కాలకూటవిషాదివి దయాసింధుండవీ స్త్రీహత్యం బాపుము వో విరూపాక్షా నన్నుం గృపా దృష్టిం నవలోకించి మదియ్యంబులగు పాపంబులనాశనంబు జేయుము. ఓకామాంతకా ఓరాఘవేశ్వరా త్వత్కటాక్ష వీక్షణంబున నన్నుం బరిశుద్ధునిగా జేయుము. నుమార్కండేయభయత్రాతా, వో మృత్యుంజయా, వో యవ్యయా, నన్ను నిష్పాపుం జేయుము. ఓశంకరానన్ను వేదోక్తాచార యోగ్యుంగా జేయుము. ఓదేవా నీవుసూర్యదంతంబులహరించితివి రామదేవుండవు, దేవదేవుండవు

అనంత సచ్చిదానంద స్వరూపుండవు, వృషభ ధ్వజుండవు, రామనాథుం డవు నీకనేక వందనంబులు గావించెద మదియ్య పాతకంబుల హరించి నన్నుం గావవే యని స్తుతించు నా భూపాలకు ముఖంబుననుండి యతి భయంకర రూపంబును, రక్తశిరోరుహయు, నీలవస్త్రధరయు క్రూరయగు బ్రహ్మహత్య వెడలినంగాంచి

పరమ శివుండు పార్థివా నీ బ్రహ్మహత్యలు రెండును విడిచ వెనుగదా జడవకు నుడివడిననీశరీరంబుబడలిక దీరునునీదేశంబు జేరినీరాజ్యం బు పాలించుమని యనుగ్రహించిన భక్తవత్సలా నీ పాదంబులపై భక్తి వదలకుండ నీస్తోత్రంబు విన్న జదివినవారి కిహపర సౌఖ్యంబులు గృప నేయుమని గోరిన ననుగ్రహించి యంతర్ధానంబు నొందె మునీంద్రు లారా యివ్విధంబున స్కాందపురాణంబులో జరిగిన వృత్తాంతంబుమీకు పవిత్ర్యయార్థంబు స్వల్పాత్స్వల్ప తరంబుగా సూచించితి ఈ విధంబున పాండ్యేశుండు పవిత్రుండయి రామ నాథస్వామిచే నాజ్ఞగైకొని స్వసై న్యంబుతో పట్టణంబు ప్రవేశించి యథాసుఖంబుగా రాజ్యపరిపాలనంబు గావించెనని జెప్పినవిని మునీంద్రులు మహానందభరితులయి మహాశ్చర్యం బునొంది సూతా రాజుచే మృతినొందిన బ్రాహ్మణమిథునంబుకేమి గతి యయ్యెనని యడిగిన మునులారా మృతినొందిన తల్లి దండ్రుల జూచి వారికుమారుండు మహాఖేదనంబుసేయ నచ్చటి మునులేతెంచిరాజహ కృత ద్రోహంబునకు చింతించుచు నతని నోదార్చి యో కుమారా వీరికి దుర్మరణంబు సిద్ధించిన దిందుకు నీవు దుఃఖించినవినియోగంబులేదు దైవ కృత్యంబులకు మనుష్యులేమిజెయ్యగలరుజాతస్యమరణంధృవంబనిశాస్త్రం బెరుంగవాయని బహుప్రకారంబులనోదార్చిన తనతలిదండ్రుల కగ్నిసంస్కా రంబు నిర్వర్తించి యస్థి సంచయనంబు జేసి మునుల యాజ్ఞాక్రమం బున హాలాస్య నగరంబు బయలుదేరి రామేశ్వరంబుజేరి సేతువులో నస్థి

స్థాపనంబు గావించి సపిండీకరణాది పరలోక క్రియలు గావించిన వారాత్రి స్వప్నంబున నతని తల్లిదండ్రులు విమానా రూఢులయి శంఖచక్ర గదాది ధారులయి వైకుంఠనగరంబునకు బోయినట్లు కన్నులకు ప్రత్యక్షంబయిన సంతోషించి హాలాస్యనగరంబుకుజేరి వృత్తాంతంబంతయు బ్రాహ్మణులకు వినిపించిన సంతోషించిరి మునీంద్రులారా రామనాథమాహాత్మ్యంబు సవిస్తారంబుజెప్ప నెవ్వరికి శక్యంబు గాదని సూతుండువినిపించిన సంతోషించి సూతా రామలింగ ప్రతిష్ఠచేసిన తదనంతరంబునజరిగిన వృత్తాంతంబువినుపింపుమని యడిగినమునీంద్రులారా స్వామిని ప్రతిష్ఠించిశ్రీరామచంద్రుండు సౌమిత్రియు జానకియు సుగ్రీవుండు మొదలగు సమస్త సైన్యంబులు స్తోత్రంబులు జేసిరి సక్రమంబుగా వినవలయును.

శ్రీ రామ లింగ స్వామిని,

శ్రీ రామ చంద్రుండు, దేవఋషి, మునులు, వానరులు మొదలగు

సమస్తమయినవారలు స్తోత్రంబులు జేసిన

శ్లోకంబులు.

శ్రీరామచంద్రః॥ శ్లో. నమోమహాత్మనేతుభ్యంమహామాయాయ శూలినే। స్వపదాంబుజభక్తార్తి హారిణేసర్వహారిణే॥

నమోదేవాది దేవాయ రామనాథాయసాక్షిణే। నమోవేదాంత వేద్యాయయోగినాం తత్వదాయినే॥

సర్వదానంద పూర్ణాయ విశ్వనాథాయ శంభవే । నమోభక్త భయచ్ఛేదహేతుపాదాబ్జరేణవే॥

నమస్తేఖిలనాథాయనమస్తాత్పరాత్మనే । నమస్తేద్భుతవీర్యాయ మహాపాతకనాశినే॥

కాలకాలాయ కాలాయ కాలాతీతాయతేనమః । నమోవిద్యాధిహంత్రే తేతే నమఃపాపహరాయచ॥

నమస్సంసార తప్తానాం తాపనాశనహేతవే । నమోమద్భ్రిష్ట హాత్యాయమా నాశినేగరళాశినే॥

నమస్తేపార్వతీనాథ కైలాసనిలయావ్యయ। గంగాధరవిరూపాక్ష రక్షమాంసకలాపదః॥

తుభ్యంపినాకహస్తాయనమో మదనహారిణే । భూయోభూయో నమస్తుభ్యం సర్వావస్థాసుసర్వదేతి॥

—*ఇవ్విధంబున శ్రీరామచంద్రుండు స్తుతించినవెనుక లక్ష్మణుండు*—

నమస్తేరామనాథాయ త్రిపురఘ్నాయ శంభవే । నమఉగ్రాయ భీమాయమహాదేవాయసాక్షిణే।

సర్వజ్ఞాయవరేణ్యాయవరదాయవరాయతే। శ్రీకంఠాయ నమస్తుభ్యం పంచపాతకభేదినే॥

నమస్తేస్తుపరానందసత్యవిజ్ఞానరూపిణే । నమస్తేభవరోగఘ్న స్థాయూనాంపతయేనమః।

పతయేతస్కరాణాంతే వహానాంపతయేనమః। గణానాంపతయే తుభ్యం విశ్వరూపాయసాక్షిణే॥

తత్రతత్రవదద్వంద్వేభవశోభక్తిరస్తుమే। అసన్మార్గేగతిర్మాభూద్భవతఃకృపయావిభో॥

పార్వతీజీవితేశాయగణేశస్కందసేవినే। నమస్తేసూర్యచంద్రాగ్నిలోచనాయకపర్దినే॥

నమశ్శివాయసోమాయమార్కండేయభవచ్ఛిదే।నమస్సర్వప్రపంచస్య సృష్టిస్థిత్యంతహేతవే॥ ఇతి॥

ఇవ్విధంబున లక్ష్మణుండు స్తోత్రంబు జేసిన తదనంతరంబు సీతాదేవియు॥

శ్లో॥ పరమకారుణ శంకరధూర్జటే గిరిసుతా స్తనకుంకుమ శోభిత। మమ పతౌపరి దేహిమతింసదానవిషమాంతరవృత్తిరుపగోచరాం॥

గంగాధరవిరూపాక్ష నీలలోహితశంకర । రామనాధ నమ స్తుభ్యం రక్షమాం కరుణానిధే॥

నమ స్తే దేవదేవేశనమ స్తేకరుణాకర । నమ స్తేభవభీతానాంభవభీతి విమర్దన॥

నాధత్వదీయచరణాంబుజచింతనేన నిర్ధూతయ భాస్కరసుతాద్భయమాశుశంభో। నిత్యత్వమాశుగతవాన్ నమృకండుపుత్రః కింవానసిధ్యతి తవాశ్రయిణాంపరేశ॥

పరేశపరమానందశరణాగతపాలక । పాతివ్రత్యంమమసతా దేహి తుభ్యంనమోనమః॥

దేవదేవజగన్నాధం రామనాధకృపానిధే । తత్పదాంభోరుహగతా నిశ్చలాభ క్తిర స్తుమే । నమస్సద్భావ రూపాయ రామనాధాయ శంభవే॥

—* ఇవ్విధంబున సీతాదేవి స్తుతించిన వెనుక నంగదుండు. *—

శ్లో. యస్యభాసా జగద్భాతియస్ప్రకాశం వినాజగత్ । నభాసతే నమ స్తస్మై శ్రీరామనాధాయశంభవే॥

జాంబవాన్॥ సర్వానందో యదానందో నచతేపరమార్థతః। రామనాధనమస్తుభ్యం పరమానందరూపిణే॥

నీలః॥ యద్దేశకాలదిగ్భేదై రభిన్నంసర్వచాద్వయం తస్మై రామేశ్వరాయాస్మై నమోభిన్నస్వరూపిణే॥

నలః॥ బ్రహ్మవిష్ణుమహేశాన నాదవిద్యావిజృంభిత । నమో విద్యావిహీనాయ తస్మైరామేశ్వరాయతే॥

కుముదః॥ యత్స్వరూపపరిజ్ఞానా త్కార్యాణాం పరమాణవః। కల్పితాః కారణత్వేన తార్కికైః పరమాస్తికైః॥

తమహంపరమానందం రామనాథంమహేశ్వరం। ఆత్మరూపతయా నిత్యముపాస్తేసర్వసాక్షిణం॥

గవాక్షః॥ అజ్ఞానపాశబద్ధానాంపశూనాం పాపమోచనం। రామేశ్వరంశివంశాంతముపైమిశరణంసదా॥

గవయః॥ నమామిజగదాధారంచంద్రచూడ ముమాపతిం। రామనాథశివంవందే సంసారమయభేషజం॥

శరభః॥ అంతఃకరణమాత్మేతి యదజ్ఞానాద్విమోహితైః।భజ్యంతే రామనాథంతమాత్మానం ప్రణమామ్యహం॥

గంధమాదనః॥ రామనాథముమానాథం గణనాథంత్రియంబకం। సర్వపాతక శుద్ధ్యర్థ ముపాస్తేజగదీశ్వరం॥

సుగ్రీవః॥ సంసారాంభోధిమధ్యేమాం జన్మమృత్యు జరాగ్రహే। పుత్రదారధనక్షేత్రవీచిమాలాసమాకులే॥

మజ్జద్బ్రహ్మాండపండేచ పతితంసప్తసాగరే। క్రోశంతం రక్షమాం నాథ రామనాథనమోస్తుతే॥

విభీషణః॥ సంసారవనమధ్యేమాంవినిష్టంనిజమార్గతః। శోభనాం పదవీశంభో దేహిరామేశ్వరాధునా॥

సర్వేవానరాః॥ నింద్యాస్వద్యేషుసర్వత్రజనిత్వాయోనిషుప్రభో। కుంభీపాకాదినరకేపతిత్వాచపునస్తథా॥

జనిత్వాచపునర్యోసాకర్మశేషేణకుత్సతి। సంసారేపతితానస్మాన్ రామనాథదయానిధే॥

అనాథదీనవశ్యాన్ దీనాన్ క్రోశంతఃపాహిశంకర।నమస్తేస్తుదయాసింధో రామనాథమహేశ్వరమ్॥

ఇవ్విధంబున నందరు స్తుతించిన తదనంతరంబున బ్రహ్మేంద్రాదిత్యాది దేవతాసమూహంబు॥

బ్రహ్మా॥ నమస్తేలోకనాథాయ రామనాథాయశంభవే। ప్రసీదమమసర్వేశ మమావిద్యావినాశయ॥

ఇంద్రః॥ యస్యశక్తిరుమాదేవీజగన్మాతా త్రయీమయీ। తమహంశంకరంవందే రామనాథముమాపతిం॥

యమః॥ పుత్రౌగణేశ్వరస్కందౌ వృషోయస్యచవాహనః। తంవై రామేశ్వరంవందే సర్వజ్ఞాననివృత్తయే॥

యస్యపూజాప్రభావేన జితమృత్యుర్మృకండజః। మృత్యుంజయముపాస్యేహంరామనాథంసదాశివం॥

కుబేరః॥ అహీశ విలసత్కర్ణ కుండలాభరణాయచ। లతౌరణ శరీరాయనమోరామేశ్వరాయవై॥

ఆదిత్యః॥ నమస్తేస్తుమహాదేవ రామనాథత్రియంబక। దక్షాధ్వర వినాశాయనమస్తేపాహిమాంశివ॥

చంద్రః॥ నమస్తేభస్మదిగ్ధాయశూలినే సర్వకాలినే। రామనాథ దయాంభోధేసర్వపాపహరాయతే॥

అగ్నిః॥ ఇంద్రాద్యఖిలదిక్పాల సంసేవిత పదాంబుజ। రామనాథాయశుద్ధాయ నమోదిగ్వాససేసదా॥

వాయుః॥ హరాయనిజరూపాయ వ్యాఘ్రచర్మధరాయచ। రామనాథ నమస్తుభ్యం మమాభీష్టప్రదోభవ॥

బృహస్పతిః। అహంత్వాసాక్షిణేనిత్యం ప్రత్యగద్వయవస్తునే। రామనాథమమాజ్ఞాన మద్యనాశయతేనమః॥

శుక్రః॥ పంచకానామలభ్యాయమహామంత్రార్థరూపిణే। నమోద్వైతవిహీనాయరామనాథాయశంభవే॥

అశ్వినౌ॥ ఆత్మరూపతయానిత్యం యోగినాంభాసతేహృది। అనన్యభావవేద్యాయ నమస్తేరామేశ్వర॥

అగస్త్యః॥ అం దేవమహాదేవ శ్వేత్యాంశినాన్యయా॥ రామనాథాం
బికానాథ ప్రసీద వృషభధ్వజ॥

అపరాధసహస్రం మేక్షమస్వవిధుశేఖర। మహాపాపమితిప్రాప్తా దా
అహంత్వాంమమమోచయ॥

సుతీక్ష్ణః॥ క్షేత్రాణిరత్నాని ధనాని దారాః మిత్రాణి వస్త్రాణి
గృహాశ్చపుత్రాః। నైవోపకారా యహి రామనాథమహ్నాం ప్రయచ్ఛత
మతో విరక్తిం॥

విశ్వామిత్రః॥ శ్రుతాని శాస్త్రాణ్యసకృచ్ఛ్రుతాని త్రయ్యప్యధీతా
విఫలానినూనం। త్వఈశ్వరేచేన్నభవేద్ధిభక్తిః శ్రీరామనాథే శివదేవశిరోహారే॥

గాలవః॥ దానానియజ్ఞాని మహాన్తపాంసిగంగాదితీర్థేషు నిమ
జ్జనాని। రామేశ్వరత్వాంననమంతియేతువ్యర్థానితేషా మితినిశ్చయోత్ర

వశిష్ఠః॥ కృతానిపాపాన్యఖిలానిలోకాస్త్వమేవరామేశ్వర భక్తి
యుక్తః॥ సమేతచేత్తానిలయంప్రజేయుర్యథాంధకారోరవితేజసైవ॥

అత్రిః॥ దృష్ట్వాపిరామేశ్వరమేకదాపిస్పృష్ట్వా నమస్కృత్యభవంత
మీశ। పునర్నగర్భంసనరఃపయాయాత్కింత్వద్ద్వయంతే లభతేన్వయాం॥

అంగీరసః॥ యోరామనాథంమనసోభవంతముపేత్యబంధూన్ స్వ
గృహస్స్మరేత। సంతారయేత్తానపి సర్వపాపాత్కిమద్భుతంతస్య కృతా
ర్థతాయాం॥

గౌతమః॥ శ్రీరామనాథేశ్వరనాథ సేతరన్యత్రభూతం పరమేశ
తత్వం। త్వత్పాద మూలంభజతాంనృణాం యేసేవాప్రకుర్వంతి హి తేపి
ధన్యాః॥

శతానందః॥ వేదాంతవిజ్ఞానరహస్యవిద్భిర్విజ్ఞేయమేతద్ధీ ముముక్షు
భిస్తు। శాస్త్రాణిసర్వాణి విహాయదేవత్వాత్ సేవనం యద్రఘువీరనాథ॥

భృగుః॥ రామనాథతవపాద పంకజద్వంద్వవందన విధూతకల్మషః
నిర్భయంవ్రజతీసత్ సుఖాద్వయంత్వాంస్వయంప్రభుమతీవచిద్ఘనం॥

కుత్సః॥ రామనాథ తవపాదసేవ సంభోగమోక్ష వరదంనృణాం।
రౌరవాదినరకప్రణాశనంకఃపుమాన్నభజతేరసగ్రహః॥

కాశ్యపః॥ రామనాథతవపాదసేవినాంకింవ్రతైరుతతపోభిరధ్వరైః
వేదశాస్త్రజపచింతయాచకింస్వర్గసింధుపయసాచకింఫలం॥

అంగిరాః॥ రామనాథత్వమాగత్య శీఘ్రంమమోత్క్రాంతి కాలే
భవాన్యాచసాకం మాంప్రాపయస్వాత్మపదారవిందం విశోకం విమోహం
సుఖంచిత్స్వరూపం॥

గంధర్వాః॥ రామనాథత్వమసాకం మజ్జతాం భవసాగరే । అపా
రేదుఃఖకల్లోలేనిత్యంత్వంనాగతిర్హినః॥

కిన్నరాః॥ రామనాథభవారణ్యే వ్యాధివ్యాఘ్రభయానకే । త్వా
మంతరేణనాస్మాకంపదవీదర్శకోభవేత్॥

యక్షాః॥ రామనాథేంద్రియారాతి ర్బాధకోదుస్సహస్సదా। తం
విజేతుంసహాయస్త్వమస్మాకంభవధూర్జటే॥

నాగాః॥ అచింత్యమహిమానంత్వాం రామనాథవయంకథం । స్తో
తుమల్పధియశ్శక్తాభవిష్యామోంబికాపతే॥

కింపురుషాః॥ నానాయోనౌచజననం మరణంచాప్యనేకశః । వినా
శాయతదజ్ఞానం రామనాథనమోస్తుతే॥

విద్యాధరాః॥ అంబికాపతయేతుభ్యమసంగాయమహాత్మనే।నమో
స్తురామనాథాయప్రసీదంవృషభధ్వజ॥

పనసః॥ రామనాథగణేశాయ గణబృందార్చితాంఘ్రయే। గంగా
ధరాయశర్వాయ నమస్తేపాహినస్సదా॥

విశ్వే దేవాః॥ జ్ఞప్తిమాత్రైకనిష్ఠానాముక్తిదాయ సుయోగినాం। రామనాథాయసాంబాయ నమోస్తుప్రకృశంకరః॥

మహతః॥ పరతత్త్వాయతత్త్వానాంతత్వభూతాయవస్తుతః। నమస్తేరామనాథాయస్వస్వభావాయశంభవే॥

సాధ్యాః॥ స్వాతిరిక్తవిహీనాయజగత్స్ఫూర్తిప్రదాయినే। రామేశ్వరాయదేవాయనమోవిద్యావిభేదినే॥

వానరాః॥ సచ్చిదానందసంపూర్ణంద్వైతవస్తువివర్జితంబ్రహ్మాత్మానంస్వయంభాసమాదిమధ్యాంతవర్జితం

అవిక్రియమసంగంచపరిశుద్ధంసనాతనం। ఆకాశాదిప్రపంచానాం సాక్షిభూతంపరాత్పరం॥

ప్రమాతీతంప్రమాణానామపిబోధప్రదాయినం। ఆవిర్భావతిరోధాన సంకోచరహితంసదా॥

నిర్లేపంపరమానందం నిరస్తసకలక్రియం। భూమానంద మహాత్మానం చిన్మాత్రంభోగవర్జితం॥

రామనాథవయంసర్వేసర్వపాతకశుద్ధయే। చింతయామస్సదాచిత్తేస్వాత్మానందబుభుత్సవః॥

రక్షాస్మాన్కరుణాసింధోరామనాథనమోస్తుతే। రామనాథాయ రుద్రాయ నమస్సంసారహారిణే॥

బ్రహ్మావిష్ణ్వాదిరూపేణవిభిన్నాయస్వమాయయా॥

విభీషణః॥ వరదాయవరేణ్యాయ త్రినేత్రాయ త్రిశూలినే। యోగధ్యేయాయనిత్యాయరామనాథాయతేనమః॥

ఇ అనుచు నివ్విధంబున సీతా లక్ష్మణ సహితుండగు శ్రీరామ చంద్రుండును నంగదాది కపులును బ్రహ్మాది దేవతలును బృహస్పతి శుక్రాది మహామునులును స్తుతించిన రామలింగేశ్వరస్వామి సంతోషించి

శ్రీరామ చంద్రులు మొదలగు వారి నుద్దేశించి రామ నాథేశ్వరుండో శ్రీ రామచంద్ర మహాబాహో యో జానకీరమణ ప్రియ యో మహాబాహో లక్ష్మణ యో జానకీ యో సుగ్రీవ యో యంగద యో ఆంజనేయ యో వానరులారా యో చతుర్ముఖ యో యింద్ర యో బృహస్పతీ యో శుక్ర యో అగస్త్య యో విశ్వామిత్ర యో దేవతలారా మునీంద్రులారా ఓ మహా ద్విజ లందరు వినండి.

ఈ యధ్యాయంబు వ్రాసిన జదివిన వినిన వినిపించిన వారందరికి మాదర్శనంబు జేసి మా సేవలు జేసిన ఫలంబులభించు నొకవత్సరంబు సేతు ధనుష్కోటి స్నానంబు జేసిన పుణ్యంబు లభించగలదని రామనాథస్వామి గంభీరంబుగా శ్రీరామభద్రాదులకందరికి వినిపించిన నందరు కృతాంజలు లయి సంతోషంబున గ్రహించిరి మునీంద్రులారా సేతు మాహాత్మ్యంబును రామలింగస్తోత్రంబును చదివిన విన్నవారలు పునరావృత్తి శాశ్వత బ్రహ్మ లోకంబు నొందగలరు సందేహంబు లేదు సత్యంబు సత్యంబని వినిపించిన సూతా మమ్ముల పునీతులం జేసితివి నీ ఋణంబు దీర్చజాలము మా సంతోషంబే నీకు పరమాశీర్వాదంబని పలికి ముందు వృత్తాంతంబు వినుపించుమని కోరిన సూతుండిట్లనియె.

—* సేతుమాధవస్వామి మహాప్రభావ వృత్తాంతము. *—

మునీంద్రులారా బహువినోదంబగు చిత్రకథగలదు వినిపించెద సావధానచిత్తులరై వినుండందువలన సంసారతారకంబును మనోహ్లాదంబు గలుగునని జెప్పిన మహాసంతోషంబుతో మునీంద్రులడిగిన సూతుండిట్లనియె.

పూర్వంబున పుణ్యనిధియను నరేంద్రుండు సోమకులంబునజన్మించి హాలాస్యేశ్వర భూషితంబగు మధురం బాలింపుచు నొకానొక సమయం బున చతురంగ బలంబు లంతఃపురజనంబులు తోడరాగ నిజపుత్రు రాజ ధురంధరుంగావించి రామసేతువునకుం బోయి యచట గంధమాదనంబున

నివసించి ధనుష్కోటియందును మరియు గలతీర్థంబులందును నిత్యంబును స్నానము గావింపుచు బహుకాలంబుండి పిమ్మట విష్ణుప్రీతికరంబగుయజ్ఞంబు జేసి తదనంతరంబు బృథ స్నానంబొనర్చి సపరివారంబుగను భార్యాసమేతుండై రామనాథుం బూజింపుచుండె నాకాలంబున నిందిరాదేవి విష్ణుదేవునితో వినోద కలహంబు గావించి యొకసమయంబున జేసి యాపుణ్యనిధి నరేంద్రుభక్తి బరీక్షింపంగోరి విష్ణుప్రేరితయై వైకుంఠంబు నుండి గంధమాదనంబున కేతెంచి యష్టవర్ష కన్యారూపంబు నొంది ధనుష్కోటితీరంబున సంచరించుచుండె నాసమయమున నరేంద్రుండు ధనుష్కోటి స్నానంబు జేయంగోరి సఫలుండై యరుదెంచి స్నానంబు జేసి తులాపురుషాది దానంబులు గావించి మరలి స్వకీయగృహంబునకుం బోవుచుండి అష్టవర్షయు శుచిస్మితయు చారు విలోచనయు బింబోష్ఠియు తనుమధ్యమయునగు నొకకన్యకం గాంచి, ఓబాలికామణీ నీ వెవరికూతురవే ఇచటనున్నదాన వెరిగింపుమని యడిగిన నాకన్యయిట్లనియె ఓనరేంద్రా నాకుం దల్లి దండ్రులు బాంధవులు లేరు. నేను భర్తృరహితనై యున్నదాన యెవండయిన నన్నుం బలాత్కారంబునం గ్రహించు నాతని శపించదవేలి నాగృహంబున నిన్ను జనకుంగా దలంచుచు పుత్రికనై యుండెద ననిన నృపుండట్లొనర్చెదనని నంగీకరించి నాకొక బుత్రుండు గలండుగాని పుత్రికలు లేరు వోకన్యామణీ మద్గృహంబున కరుదెంచి యంతఃపురంబున నాభార్యకుం బుత్రికవై యుండు నే పురుషునియందు నీ కిష్టంబుగల్గు నాతని కొసంగెదనని యాకమలలోచన నొడంబరచి స్వగృహంబునకుం గొనిపోయి వింధ్యావళియను స్వభార్యహస్తంబున నిడి యోపత్నీ నీకన్యకను నిరంతరంబును మనకుం బుత్రికయనిభావించి రక్షింపుమనిన నదియు నంగీకరించె. ఇట్లా కన్య పుణ్యనిధి నరేంద్రునిచే రక్షింపంబడుచు సుఖంబుండె నంతఁ గొంత కాలమునకు జగన్నాథుండగు విష్ణుదేవుండు గరుడారూఢుండయి

వైకుంఠంబు వెడలి రమాదేవిని వెదకుచు సకల దేశంబుల సంచరించి ఎందుం గానక గంధమాదనంబు జేర సేతుసమీపంబున సంచరింపుచుండెనపుడా కన్యారత్నంబు సఖీసమేత యగుచు యాభవనోద్యానంబున పుష్పంబులం గోయుచుండంగాంచి విష్ణుదేవుండు విప్రరూపము నొంది గంగాజలము స్కంధంబునందును దక్షిణకరంబున కుశగ్రంధి పవిత్రంబును ఛత్రంబును వహింపుచు భస్మోద్ధూళిత సర్వాంగుండును త్రిపుండ్రావళి శోభితుండును ధృత రుద్రాక్ష మాలికుండును, శివనామపారాయణుండును స్తోత్ర నీయుండును, నగుచు గంగా స్నానంబు గావించు విప్రవేషంబు ధరించి యచట నుండ నాకన్య యా విప్రుంగాంచి భీతినొందె అంతవాసుదేవుండు పుష్పంబులు గోయుచున్న నిజవల్లభంగాంచి సత్వరుండయి కరంబుల గ్రహింప నా కన్యయు సఖీ పరివృతయై యాక్రోశింప నారవం బాలించి తల్లియగు వింధ్యావళియును తండ్రియగు పుణ్యనిధియును మరియు పరిజనంబులును హృదయంబులు కరతలంబుల మోదుకొనుచు కోపోద్దీపిత మానసులయి ధర్మాధర్మ విచక్షణంబు సేయక నాబ్రాహ్మణుని బల్కారంబున బట్టి నిగళనిర్బంధిత పాదద్వయుని జేయుచు రామనాధాలయ మంటపంబులోని కీడ్చుకొనివచ్చి బద్ధునిం జేసి కన్యనోదార్చి గృహంబులోని కనిచి తాను నంతఃపురంబు ప్రవేశించి శయనించి యుండ స్వప్నంబున నావిప్రునిశంఖ చక్రగదాపద్మ వనమాలావిరాజితుండును కౌస్తుభాలంకృతోరస్కుండును పీతాంబరధారియు కాలమేఘ నిభయు గరుడోపరిసంస్థితుండును చారు మందస్మితుండును మకరకుండల విరాజితుండును విష్వక్సేన ప్రభృతి పరివారసేవితుండును శేషశాయియు నారదాది స్తుతుండునునయిన విష్ణుంగా జూచి నిజపుత్రికను ధృత పంకజహస్తయు నీలకుంచితమూర్థయు విష్ణువక్షస్థలయు సమున్నతపయోధరయు దిగ్గజాభిరక్తాంగియు శ్యామయుపీతాంబరావృతయు స్వర్ణ పంకజమాలాలంకృత మూర్థయు అనఘ్యార్ఘరత్నఖచిత

దివ్యాభరణ విరాజితయు హారతారభూషితయునై వెలయు రమాదేవిం గాంచి తల్పంబున నుండి లేచి కన్యాగృహంబు జేరి తాను స్వప్నంబు గనినవిధంబున నుండు స్త్రీం గాంచి సూర్యోదయంబున మంటపంబు జేరి యచట హరిరూపుండగు విప్రుం గాంచి యా దేవదేవు మహా భయభక్తివినయ గౌరవంబు లుప్పొంగ నాభూసురోత్తమునిముందుగ నిలిచి మంగళతరంబగు స్తోత్రంబు సేయం దొడంగె.

దండకము॥ దేవాదిదేవా మహాదేవ నీవా క్రియాజ్ఞాన శూన్యుండ మూఢుండ మూర్ఖుండ నేరాజనంబున్ మదాంధుండనై నీ ప్రభావంబు గానంగలేనైతి నేనెంత మోహంబుతో నీకు ద్రోహంబు గావించితిన్ స్వామి నీకెంత క్రౌర్యంబు నే జేసితిన్ ఓరమాధీశ దుష్టుండ గానా మరేమీ యదెంతెంత యో నా మహాపాపంబు కంతంబు లేదంచు చింతింతునయ్యా సరే నీ మహాత్వంబు కంతంబు నే గాంతునా శ్రీ శివా శేశవిశ్వేశ దేవేశ యోగీశ మానీశులే జూడ నీజాడ గానంగలేరన్న విం మునాకందునా పొందునా భక్తమందార మందార బృందారకానందసంధాయి వివేకదా దేవ నాపాప బృందంబులం బాపలేవా మహాయోగ నిద్రావిమన్నించు శ్రీదేవి భూదేవి పాదంబులొత్తంగ శేషాహితల్పంబుపై లోకరక్షాధురీణుండవై యుండి పాలింపవా మొర్రలాలింపవా ప్రీతిలాలింపవా భూమిలేలింపవా సూరిబృందావనా శౌరిబృందావనాధ్యక్షవక్షీంద్రవాహా జగత్సాక్షి వివేకదా నాదు విక్షేపముంమాన్పలేవా మహాత్మాను భావా సదా వేద వేదాంత విజ్ఞాన ప్రజ్ఞాధురీణుల్భవన్మాయ దాటంగలేరయ్య సంసారదావాగ్నిలో ప్రమ్మందితిం గ్రందితిం గుందితిం మందుడం వందనై కొందలం బందితిం సుందరాంగా రమామందిరానంద కందా ముకుందా సదానంద గోవింద పాదారవిందంబులం జూపు కుం దేంమ మందార సందోహకీర్తీ చిదానందమూర్తీ బుధాంతరాత్మానువర్తీ జగచ్చక్రవర్తీ నమస్తేనమస్తే నమస్తేనమః॥

వ. అని యివ్విధంబున భగవంతుని స్తుతియించిసమీపవర్తినియగు మహాలక్ష్మినిఁజూచి రాజోత్తముండు స్తోత్రంబుసేయనుపక్రమించె.

శ్లో॥ నమోదేవిజగన్మాతేవి ష్ణువక్షస్థలాలయే। సిద్ధ్యైపుష్ట్యై స్వధాయైచ స్వాహాయైసతతంనమః॥

సంధ్యాయైచ ధాత్ర్యై భూత్యైనమోనమః। శ్రద్ధాయైచవమేధాయై సరస్వత్యైనమోనమః॥

యజ్ఞవిద్యేమహావిద్యే గుహ్యావిద్యేతిశోభినే।ఆత్మవిద్యేచదేవేశముక్తిదేసర్వదేహినాం॥

త్రయీరూపేజగన్మాతః । జగద్రక్షావిధాయినీ । రక్షమాంకృపయాదృష్ట్యాసృష్టిస్థిత్యంతకారిణి। భూయోభూయోనమస్తుభ్యంబ్రహ్మసూత్రేమహేశ్వరి॥

అనుచు నివ్విధంబున లక్ష్మీనారాయణుల నిద్దర నేకచిత్తంబుతో స్తుతించి పుణ్యనిధి తన యపరాధ క్షమంబు జేసుకో దలంచి మహా వినయంబుతో. వోరమానాయకా నీవుగరుడధ్వజుండవు, శార్ఙ్గపాణివి, పుండరీకాక్షుండవు,శ్రీపతివి,కౌస్తుభాలంకృతుండవు, శ్రీవత్సలక్షణుండవు, దైత్యసంఘవిదారివి, అశేషభువనావాసనాభి పంకజశాలివి, మధుకైటభవిదారివి, రావణాంత కుండవు, ప్రహ్లాదరక్షకుండవు, ధరిత్రీపతివి నిర్గుణుండవు, అప్రమేయుండవు,బుద్ధిసాక్షివి, శ్రీనివాసుండవు, పరాత్మకుండవు, నారాయణశబ్దవాచ్యుండవు, పంకజనేత్రుండవు,పంకజశాలివి, పంకజాంఘ్రివి,సకలలోక నాథుండవు, దయామూర్తివి, నిన్నెరుంగక నిగళపాశబద్ధుం జేసియపరాధంబు గావించితి దయాళుండవై రక్షింపుమని యనేక విధంబుల వేడినరమాదేవిని యిట్లని స్తుతించె.

ఓ దేవీ నీవువిష్ణువక్షస్థలనివాసివి, అబ్ధిజవు హరిప్రియయు రాలవు సిద్ధి పుష్టి స్వధాస్వాహా ప్రధాధాత్రీ భూతి రూపురాలవు, శ్రద్ధయు మేధయు

సరస్వతియు నీవయజ్ఞవిద్యా గుహ్యావిద్యాత్మవిద్యారూపిణివి ముక్తిదా యినివి, త్రయీరూపిణివి, జగన్మాతవు, సృష్టిస్థిత్యంతకారిణివి నీకనేకవందనం బులు నన్నురక్షింపుమనిరమాదేవిం బ్రార్థించివిష్ణుదేవుంగాంచియిట్లనియె.

ఓరమానాయకా యజ్ఞానంబున నిగళపాశబద్ధుం జేసి యపరాధం బొనర్చితి లోకంబులెల్ల నీ శిశువులు సుతాపరాధంబు క్షమింపం దగు మఱియును నీకపరాధులగు వైశ్యులకు స్వరూపంబొసంగితివినిన్నుంజంప వరుదెంచిన పూతనం గాచితివి నాయపరాధంబు సహించి నన్ను గృపా దృష్టిచే రక్షింపుమని యనేకవిధంబులం వేడినంబ్రీతుండయి విష్ణుదేవుండు మేఘ గంభీరరవంబుగా నిట్లనియె. ఓరాజేంద్రా నన్ను బంధించినందుకై భీతిబొందకు నేభక్తుల వశ్యుండనై యుండుదు నీవు మత్ప్రీతికరంబగు యజ్ఞంబుగావించి నాభక్తుండవయితివిగాన నీకు వశ్యుండనయి పాశ బద్ధుండనయి నేనిరంతరంబు భక్తాపరాధంబుల సహించియుందు నీ భక్తి బరీక్షింప నీలక్ష్మింబంపితి నీవు రక్షించితివిగాన నీకు బ్రీతుండనయితి ఈ దేవిమత్స్వరూపమైయుండు నెవ్వడీలక్ష్మికిం భక్తుడాతండు మద్భక్తుండు యెవ్వడు విముఖుండగు నాతండు మద్ద్వేషియగు నీవుభక్తియుతుండవయి ఈరమం బూజించితివిగాన నా కపరాధము జేసియు నన్నుం బూజించిన వాడవు పూర్వంబు నాకును నీదేవికిని యొక సంకేతంబు గలిగె. దాన లక్ష్మిదేవిని భగవద్విలాసంబునకుం బంపితి నీవును సంరక్షించితివి భీతిం బొందకు ప్రీతింబొందితి మీవనిత సత్యంబుగ లక్ష్మిదేవియనివచించెనంత రమాదేవియు సంప్రీతచిత్తయై నరేంద్రుం గాంచి తండ్రిని జేరం బిలిచి నన్ను పెంచిన మోహంబున మీయింట నిలిచి యుండుదు నీవునుమాతల్లి వింధ్యావళియు నిహలోక సౌఖ్యంబు లనుభవించి యాపై నా సమీపం బునకు రాగలరని వరంబిచ్చి సేతుమాధవస్వామివక్షస్థలంబులో నివాసంబు గావించె తదనంతరంబున సేతుమాధవుండా రాజు నుద్దేశించి.

# ౧౪౭ శ్రీ సేతు రామేశ్వర మాహాత్మ్యము.

ఓ పుణ్యనిధీ నీవు బంధించిన నిగళంబులతో నీ మంటపంబుననే సేతురక్షణార్థంబుకై నిలిచియుండుము రామనాథుండయి శంకరుండు లోక శంకరుండయి యుండు బ్రహ్మేంద్రాది దేవతలు సర్వకాలంబులు మాసేవలో నిలిచియుందురు సేతు స్నానంబుజేసి రామలింగాభి షేకం బును పూజానైవేద్యాదులు జరిగించినవారికి పునర్జన్మంబు లేదని యాన తిచ్చి మాధవస్వామి యర్చా విగ్రహరూప ప్రకాశమానుండయ్యెపుణ్య నిధి భార్యాసమేతంబుగా మధురానగరంబుజేరి మీనాక్షీ సోమ సుందరే శ్వరుల సేవ లొనరింపుచు బహుకాలంబు రాజ్య భోగంబు లనుభవిం చుచు నుండె

అంత కొన్ని దినంబులకు పుత్రునకు పట్టాభిషేకంబుజేసి రామేశ్వ రంబుజేరి సేతు స్నానంబును సేతుమాధవ రామనాథ స్వాముల పూజ లొనరించుచు పుణ్యవశంబున సతియును పతియును పరమపద ప్రాప్తు లయిరి మునీంద్రులారా యాత్రాపరులు ప్రత్యహంబును సేతు మాధవ రామనాథ దర్శనంబులు జెయ్యరేని వారి యాత్రా ఫలంబు నిష్ఫలం బగును గంగా యాత్ర జేయదలంచినవారు ముందుగాసేతుమాధవస్వామి సన్నిధిలో సంకల్పంబుజేసి బయలుదేరవలెనని సిద్ధాంతంబు వింటిరామునీం ద్రులారా సేతు మాధవ రామనాథ స్వాముల చిత్ర ప్రభావంబు లత్యద్భుతంబులు.

రామేశ్వరం బుక్కాపావు నాగలింగం పిళ్ళగారిచే రచింపబడిన

## శ్రీ సేతుమాధవస్వామి స్తోత్రము.



ద్విపద. శ్రీమించరామేశ్వరమాధవేశా - స్వామిర్దయానిధేసగుణ సంకాశా - సోమార్కకోటిభాసురచిద్విలాసా - శ్రీ మానినీమానచిత్తాబ్ధి వాసా - నారదాదిమునీంద్ర నయగానవినుత - నారాయణానంత నాగేం ద్రశయనా - పదివేదములసామిప్రహ్లాదవరదా - పన్రెండు ఆళ్వార్లప తనప్రతాపా - రూపసుందరమార రూప దేదీప్య - ఆపదోద్ధారకా అఖి లాంతరాత్మా - కంబుకంఠీరళశుభాకారదధిచోరా - డాంబీక శ్రీ రామేశ్వర సేతుమాధవేశా॥

## —* సేతు రామేశ్వర యాత్రాక్రమంబు. *—

రామనాథ యాత్రా ప్రకారంబును స్నానదానాది క్రియా విశేషంబులు మంత్రంబులు వినిపించెద. యాత్రికుండు స్నానసంధ్యాది నిత్యకృత్యంబులు దీర్చుకొని భస్మత్రిపుండ్రధారియైనను లేక గోపీచందనధారణంబుయిన జేసి సేతు యాత్రార్థంబు శ్రీ రామలింగేశ్వర రామచంద్రులనుద్దేశించి సంకల్పంబు జేసి యథాశక్తి దానంబులిచ్చి బ్రాహ్మణ భోజనంబొనరింపుచు బయులు దేరిదీనాంధకృపణులకన్నంబు బెట్టుచువస్త్రంబు లిచ్చుచుయథాయోగ్యదానంబులనగా సన్యాసులకునువర్ణాదిధనంబివ్వకూడదు. వానప్రస్థులకు వస్త్రంబులివ్వగూడదు గృహస్థులకు భిక్ష వేయగూడదు. బ్రహ్మచారులకు తాంబూలంబు లివ్వగూడదు మరిచియైననిచ్చెనేని దాతకు నరకంబు సంప్రాప్తించును.

తదుక్తంస్కాందే॥శ్లో॥యతయేకాంచనందైవవానప్రస్థాయవాససీ। గృహస్థాయచభిక్షాంచతాంబూలంబ్రహ్మచారిణే । అవిచార్యైవ యో దద్యాద్దాతాచనరకంవ్రజేత్॥

ఈప్రకారంబుగా జెప్పియున్నది గనుక విచారించి యివ్వవలెను.

## —* దశదానవివరణ *—

గోభూతిలహిరణ్యాద్యాజ్య వాసోధాన్యగుడాన్యచ । రౌప్యం లవణమిత్యాహు దశదానాప్రకీర్తితాః॥

## —* గోదానమంత్రః. *—

గవామంగేషుతిష్ఠంతి భువనానిచతుర్దశ। తస్మాదస్యప్రదానేనఅతశ్శాంతింప్రయచ్ఛమే॥

## —* భూ దా న మం త్రః *—

సర్వసస్యాశ్రయాభూమిః వరాహేణసముద్ధృతా। అనంతసస్యఫలద అతశ్శాంతిప్రయచ్ఛమే॥

## —* తిలదానమంత్రః. *—

తిలాః పాపహరానిత్యం విష్ణోర్దేహసముద్భవః। తిలదానాదస్మాంమే పాపంనాశయ కేశవ॥

# ౧౫౦ శ్రీ సేతు రామేశ్వర మాహాత్మ్యము

—* హిరణ్యదానం. * —

హిరణ్యగర్భగర్భస్తం హేమబీజంవిభావసోః । అనంతపుణ్య ఫల దం అతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* ఆద్యదానం. *—

కా౹౹ ధేనోస్సముద్భూతం సర్వక్రతుషు సంస్థితం । దేవానామా జ్యమాహారం అతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* వస్త్రదానం. *—

శీతవాతోష్ణసంత్రాణాంలజ్జాయాఃలక్షణంపరం దేహాలంకరణం వస్త్రం అతశ్శాంతంప్రియచ్ఛమే॥

—* ధాన్యదానం. *—

ధాన్యంకరోతిదాతారం యిహలోకేపరత్రచ । ప్రాణినాం జీవనం ధాన్యం అతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* గుడదానం. *—

ఇక్షుఖండసముద్భూతంసర్వప్రాణిమనోహరం। సర్వపాపక్షయం దస్మాత్ అతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* రౌప్యదానం. *—

రుద్రనేత్రసముద్భూతం రజితంపిత్రువల్లభం । తస్మాదస్య ప్రథా నేన అతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* లవణదానం. *—

రసానామగ్రజంశ్రేష్టం లవణంఫలవర్ధనం। తస్మాదస్య ప్రధానేన అతశ్శాంతింప్రియచ్ఛమే॥

మరియు శివవిష్ణు నామంబు లుచ్చరింపుచు వాహనంబు లెక్కక పాదుకలు తొడగక యష్టాక్షరి పంచాక్షరిమంత్రంబులను రామమంత్రం బును జపించుచు నియతాహారుండయి కామక్రోధాదులు విడచి పురాణ శ్రవణంబు సేయుచు సేతుమూలంబు ప్రవేశించి.

ప్రథమమందు పాషాణదానంబుజేసి సముద్రావాహనంబు జేసి సముద్రునికి నమస్కారంబుగావించి సముద్రునియాజ్ఞ గైకొని స్నానంబు

జేసి సంధ్యావందన దేవర్షి పితృతర్పణంబులు యథా శాస్త్రంబుగా జరిగించవలెను.

—* సేతుస్నానవిధిమంత్రతంత్రాదిప్రకరణము. *—

—* పాషాణదానమంత్రః. *—

పిప్పలాదాత్సముత్పన్నేకృత్తే లోకభయంకరి। పాషాణం తేమయా దత్తమహాపరాధంప్రకల్పయ॥ ఇతి॥ పాషాణదానం॥

—* అథ సాన్నిధ్యప్రార్థన మంత్రః. *—

విశ్వాచీత్వం ఘృతాచీత్వం విశ్వయోనే విశాంపతే। సాన్నిధ్యంకురు మే దేవసాగరేలవణాంభసీ॥ అని సాన్నిధ్యంబునకు పోవలయును.

—* అథ నమస్కార మంత్రః. *—

నమస్తేవిశ్వగుప్తాయ నమోవిష్ణు అపాంపతే। నమోహిరణ్యశృంగాయ పతీనాంపతయేనమః॥ తదుపరి॥ సముద్రాయవయూనాయ। అని గొప్పగా నుచ్చారణజేసి నమస్కారము చేయవలయును.

—* అర్ఘ్యమంత్రః. *—

సర్వరత్నమయశ్రీమన్ సర్వరత్నాకరాయచ। సర్వరత్నప్రదాన త్వం గృహాణార్ఘ్యం మహోదధే॥ ఇతి॥ అర్ఘ్యంబు లివ్వవలెను.

—* అనుజ్ఞాపనమంత్రః. *—

అశేషజగదాధార శంఖచక్ర గదాధర। దేహి దేవ మమానుజ్ఞాం యుష్మత్తీర్థనిషేవణే॥ ఇత్యనుజ్ఞాపనం॥

—* ప్రార్థనామంత్రః. *—

ప్రాచ్యాదిశివసుగ్రీవం దక్షిణస్యానలంస్మరేత్। ప్రతీచ్యాం మైంద నామానముదీచ్యాంద్వివిధంతథా॥

రామంచ లక్ష్మణంచైవ సీతామపి యశస్వినీం। అంగదం వాయు తనయంస్మరేన్మధ్యే విభీషణం॥

# ౧౫౨ శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.

పృథివ్యాం యానితీర్థాని ప్రవిశన్తి మహోదధౌ। స్నాతస్య మే ఫలం దేహి సర్వస్మాత్త్రాహి మాం హరః॥

హిరణ్యశృంగ మిత్యాభ్యాం ద్వాభ్యాం నారాయణం స్మరేత్। ధ్యాయేన్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు॥

బ్రహ్మలోకమవాప్నోతి జాయతే నేహ వై పునః। సర్వేషామపి పాపానాం ప్రాయశ్చిత్తం భవేత్తతః॥

ప్రహ్లాదం నారదం వ్యాస మంబరీషం శుకం తథా। అన్యాంశ్చ భగవద్భక్తాన్ చింతయే ద్దేశమానస॥ ఈమంత్రంబు జదివి ధ్యానంబు జేయవలెను.

వేదాదయో దేవవిశిష్టయో నిష్పరిత్పతి స్సాగర రత్నయోనిః అగ్నిశ్చ వాయుశ్చ ఇళా చ తేజో రేతోధవిష్ణోరమృత స్య యోనిః॥ ఇదంతే అన్యాదిక సమానమద్భిర్యాః కాశ్చ సింధుం ప్రవిశంత్యాపః సర్పోజీర్ణామివత్వచం జహామి పాపం శరీరాత్స శరీరశుష్కో అభ్యుచ్ఛేతస్యోః॥ అనియామంత్రంబు జదివి స్నానంబు జేయవలెను.

—* ప్రథమ స్నాన మంత్రః. *—

సముద్రాయ వయూనాయేతిన మస్కుర్యాత్పునర్ద్విజాః। సర్వతీర్థమయం శుద్ధం నదీనాం పతిమంబుధిం॥ ఇది జదువుచు ప్రథమస్నానము చేశేది.

—* ద్వితీయస్నానమంత్రః. *—

ద్వాసముద్రావితిపునః పోత్చార్యస్నానమాచరేత్। బ్రహ్మోదరసంస్థానికరస్పృష్టానితేనివే॥

దేవీపట్టణమార్గేణ పవిశేద్యది మానవః। అధాతునవ పాషాణ మధ్యే సేతౌ విముక్తిదే॥

స్నానమంబు నిధౌకుర్యాత్స్వపాపౌఘ పనుత్తయే। దర్భశయ్యాపదవ్యా చేద్గచ్ఛే త్సేతు విముక్తిదం॥ ఇతి॥

పిప్పలాదంకలింకణ్వాం కృతాంతంజీవితేశ్వరం । మన్యుంచకాళరాత్రించవిద్యాంచాహర్గణేశ్వరం॥

వసిష్ఠం వామదేవంచ పారాశర్యముమాపతిం । వాల్మీకింనారదంచైవ వాలఖిల్యాన్మునీంస్తథా॥

నలనీలంగవాక్షంచగవయంగంధమాదం। మైందంచద్వివిదంచైవదధిముఖంశరభంతథా॥

సుగ్రీవంచహనూమంతం వేగదర్శనమేవచ । రామంచ లక్ష్మణంసీతాంమహాభాగాంయశస్వినీం॥

ఈ ప్రకారంబుగా వారి వారి నామంబులు ద్వితీయాంతంబులుగాని చతుర్థ్యంతంబులుగాని యుచ్చరించుచు దేవర్షిపితృతర్పణంబులు శ్రద్ధాయుక్తుండయి ప్రసన్నవదనుండయి పవిత్రింబుబెట్టుకొనిచెయ్యవలయును తర్పణంబులు జేసి నమస్కరించి యార్ద్రవస్త్రంబువిడచి పొడివస్త్రంబు గట్టుకొని తిల తండులాదులచే యథావిధి పితృశ్రాద్ధంబు జేసి పిండప్రదానంబు జేసెనేని సంపూర్ణశ్రాద్ధంబగును

మరియు శరీర దార్ఢ్యంబు లేక ధనాఢ్యత్వుండయ్యేనేని షడ్రసోపేతంబుగా భూసురులకు భూరిభోజనంబు గావించి గోభూతిల హిరణ్యాదిదానంబులు యథేష్టంబుగా నిచ్చెరేని పితృదేవతలకు సంతృప్తిగల్గును పుణ్యలోకంబులు దొరుకును మునీంద్రులారా సేతు మూలంబున పాషాణదానాది తర్పణాంతంబువరకు విధిపూర్వకంబుగా సమస్తకర్మలు జరిగించి తదుపరి చక్రతీర్థంబునకుబోయి స్నానాది క్రియలు నిర్వర్తించి సేతునాథుండగు నారాయణుం బూజించి పశ్చిమమార్గంబునంబోవు మనుజుండు దర్భశయనుని సేవించి పిమ్మట కపితీర్థంబు జేరి తదుపరి సీతాసరోవరంనుఋణవిమోచనతీర్థంబునకునుబోయి అచ్చటచ్చటస్నానదానాదులు యథావిద్యుక్తంబుగాజరిగించి శ్రీరామచంద్రుల కభివందనంబుగా

వించి లక్ష్మణతీర్థంబునకుబోయి శిరోమాత్రంబు వపనంబుగావించి వెనక కాలంబులో తాను జేసిన పాపంబులు దలంచుకొనుచుస్నానంబు జేసి మరియు రామతీర్థంబునకరిగి రామేశ్వరాలయంబు జేరి యచ్చటపాప వినాశిని, గంగా, యమునా, సావిత్రి, గాయత్రీ, సరస్వతీతీర్థంబులలో హనూమత్కుండంబులో బ్రహ్మకుండంబులో యథా శాస్త్రంబుగా స్నానదానాదులు జరిగించి తదుపరి మహాఘనాశనకరంబును నాగనిర్మితంబగు నాగతీర్థంబులో నగస్త్యతీర్థంబులో యథావిధి స్నానాదులు జరిగించి యగ్నితీర్థంబునకు జేరి విధివత్ప్రకారంబుగా శ్రాద్ధంబు జేసి విత్తశాఠ్యంబు గాకుండ దానంబు లొనరించిన వారికి సకలపాప నివృత్తిగలుగును.

మునీంద్రులారా చక్రతీర్థంబాది సమస్తతీర్థంబులను క్రమంబుగా సేవించి యాపై రామలింగేశ్వర సేతు మాధవ స్వాములదర్శించి పూజా నమస్కార స్తోత్రంబులు చక్కగాజరిగించి తదుపరి ధనుష్కోటకిబోయి పాషాణ దానాది క్రియలు పూర్వోక్తంబుగా యథా విధి జరిగించి యథాశక్తి సమస్త దానంబులు జేసి కోటి తీర్థంబు జేరి స్నానంబుజేసి రామనాథస్వామి కభిషేక పూజా దూపదీప నైవేద్యంబులు లక్షణంబుగా జరిగించి బ్రాహ్మణ భోజనంబు తృప్తిగా జేసి రామేశ్వరునికి దండప్రణామంబులు గావించి బహువిధంబుల స్తోత్రంబుజేసి సేతు మాధవస్వామి సమీపంబునకు బోయి పూర్వోక్తంబుగా పూజాదులు గావించి మరలి రామలింగస్వామి సన్నిధికిబోవలయును.

ఇవ్విధంబున రామలింగేశ్వర స్వామి స్తోత్రంబు మనోవాక్కాయకర్మంబు లేకీకరణంబుగా స్తుతియించి మహాభక్తితో యథాశక్తిదీనాంధ కృపణాదులకు దానంబులు సేయుచు శివనామ స్మరణంబు గావింపుచు బయలుదేరి స్వగృహంబు వేశించి బ్రాహ్మణ భోజనంబు జరిగింప్రచిన వారికి రామనాథుండు ప్రసన్నుండగు సకల భాగ్యంబులు జేకూరును.

పుత్రపౌత్రాభివృద్ధిగలుగును మహోన్నతుండగునతనికి సర్వాభీష్ట సిద్ధి గలుగు పునరావృత్తిరహిత శాశ్వత పుణ్యలోకంబు దొరుకునని జెప్పిన మునీంద్రులపారంబగు సంతోషంబు నొందిరి సూతుండు మరియును మునీంద్రులారా యీయాత్ర జేయుశరీరశక్తి లేనివారీ సేతుమాహాత్మ్యంబు భక్తి యుక్తులై జదివిన విన్నవారికి యాత్రాఫల సిద్ధిగలుగుట కెంత మాత్రంబు సందేహంబు లేదని వినిపించి వెండియు తత్ప్రభావంబు విస్తరింపఁగోరి చెప్పఁదొడంగె

సకలదివ్యక్షేత్రములకంటె సేతుధనుష్కోటి మాహాత్మ్యం
బధికంబని నిరూపించుట.

మునీంద్రులారా ఈ ధనుష్కోటిలో స్నానంబుజేసి రామలింగ మహాదేవ పూజ గావించి దేవాలయంబులో స్వామి సన్నిధిని నియత వ్రతంబుతో నాద్య మంత్రంబగు త్ర్యంబక మంత్రం బష్టోత్తర సహస్రంబు జపించినవారికి కాశీనివాస ఫలంబుగలుగును మరియు పూర్వోక్తప్రకారంబుగా త్రిదినంబు జపించినవారికి పుండరీక పురయాత్రా ఫల సిద్ధి గలుగును. మరియు నెవ్వారయిన ధనుష్కోటిలో మాఘమాసంబున త్రిదినం బరుణోదయంబునకు స్నానంబుగావించి రామలింగస్వామి దేవాలయంబు జేరి పంచాక్షరీ మంత్రంబు నియతవ్రతుండయిజపించిన మధ్యార్జున కుంభకోణ గౌరీ మాయూర శ్వేత కానన హాలాస్య గజారణ్య వేదారణ్య నైమిశారణ్య శ్రీశైల శ్రీరంగ వృద్ధాచల చిదంబర వల్మీక శేషాద్రి వరుణాచల శ్రీదక్షిణకాశి కాళహస్తి వేంకటాద్రి కాంచీపుర బ్రహ్మపుర వైద్య నాథాది శివ విష్ణు క్షేత్రంబు లనేకంబులు సేవించిన ఫలంబు లింతలో దొరుకును

విప్రోత్తములారా సనాతనంబగు ద్వాసముద్రావితియునుస్మృతి యును యుద్ధారణియను తద్విష్ణోః పరమంపదం బను శృతులును మరియు ననేక పురాణేతిహాసాది ప్రోక్తంబగు సేతు మాహాత్మ్య ఫలంబు దొరు

తును మరియు సూర్య చంద్రగ్రహణ కాలంబుల విష్ణు వాయనంబుల సంక్రాంతు లమావాస్యా సోమవారంబున ధనుష్కోటిస్నానంబున జేసిన వారికి వారి పితృ దేవతలు తృప్తిబొందుదురు వారు శివ సాయుజ్యంబు నొందుదురు మరియు సూర్యుండు మకరరాశిస్థితుండయి యున్న సమయంబున సూర్యోదయ కాలంబులో ధనుష్కోటిలో స్నానంబు జేసిన వారికి పంచమహా పాతకంబులు బాసిపోవును గంగాది పుణ్య నదీస్నాన ఫలంబు దొరకు నశ్వమేధ యజ్ఞఫలంబు దొరకును కృచ్ఛ్రచాంద్రాయణ వ్రతఫలంబును చతుర్వేదపారాయణఫలంబును గలుగును.

మరియు నర్ధోదయ మహోదయకాలంబుల ధనుష్కోటిలో స్నానంబుదానంబు జేసినవారికి కష్టంబులు నష్టంబులై ఎంత దుష్టుండయిన నెంత పాపిష్టుండయిన శిష్టులకు దొరికెడి యుత్కృష్ట లోకంబులు దొరుకును. మరియొక్క విచిత్రంబు జెప్పెద లోకంబులో నెచట నయిన తటాకాది జలప్రదేశంబుల స్నానంబులు సేయుచు నయినను సకల దురిత పరిహారార్థం రామసేతు ధనుష్కోటి స్నాన మహం కరిష్యే యని సంకల్పంబులో నుచ్చరించి స్నానంబు జేసెనేనియు మహా పాతకంబులు మంటగలయును. యథార్థంబుగా యథా విధ్యుక్తంబుగా ధనుష్కోటిలో స్నానంబులు జేసినవారి పాపంబులు నశించుట కేమి యాశ్చర్యంబని చెప్పిన మహానంద భరితులయి సూతునిం గొనియాడి సూతా ధనుష్కోటియను శబ్దంబున కర్థంబేమి యది యేరూపంబున నుండునని యడిగిన సూతుం డిట్లనియె

మునీంద్రులారా సేతుబంధనంబు జేసి లంక సాధించి విభీషణునకు పట్టాభిషేకంబు జేసిన పిమ్మట విభీషణుండు రామచంద్రునితో దేవా యీ సేతుమార్గంబుండిన లంకకనర్థంబు సంభవించునని విచారగ్రస్తుండయి ప్రార్థించిన రామభద్రుండు కటాక్షించి తన ధనుష్కోటితో పదియోజనంబుల వెడల్పు భిన్నంబు జేయుటచే నది ధనుష్కోటి యను సార్థక

క నామంబు నొందె నక్కడ రేఖారూపంబుగా ప్రత్యక్షంబుగా నిదర్శనం బిచ్చుచున్నది తదుక్తం॥

స్కాందపురాణే॥ శ్లో॥ ధనుష్కోటిరితిఖ్యాతా రేఖాసా పాపనాశినీ। విభీషణప్రార్థనయాకృతారామేణధీమతా॥

ధనుష్కోట్యాంసుపుణ్యాయాంతస్యాంస్నాత్వాసభక్తికం। దద్యాద్ధనానివిప్రాణాంక్షేత్రాణాంచగవాంతథా॥

తిలానాంతండులానాంచధాన్యానాంపయసాంతథా। వస్త్రాణాం భూషణాదీనాం మాషాణామోదనస్యచ॥

దధ్యాంఘృతానాంవారీణాం శాకానామప్యదశ్వినాం। శుద్ధానాం శర్కరాణాంచ సస్యానాంమధునాంతథా॥

మోదకానామపూపానామన్యేషాందానమేవవా। రామసేతౌ ద్విజాః ప్రోక్తంసర్వాభీష్టప్రదాయకం॥

అతోదద్యాద్రామసేతౌ విత్తశాఠ్యవివర్జితం। దత్తంహుతంచ తప్తంచజపంచనియమాదికం॥

శ్రీరామధనుష్కోటౌ వనంతంఫలదంభవేత్। తేనదేవాశ్చతుష్యంతిపితరస్తథా॥

తుష్యంతిమునయస్సర్వే బ్రహ్మావిష్ణుశివాస్తథా। శ్రీరామ ధనుష్కోటౌ రేఖాయాఃపశ్యతేపరః॥

అనేకక్లేశసంపూర్ణం గర్భవాసం నపశ్యతి॥

మునీంద్రులారా యీశ్లోకంబుల అర్థంబు విచారించితే తీర్థమాహాత్మ్యంబంతయు బోధపడగలదు. స్కాందపురాణాదులలో దీనిమాహాత్మ్యంబనంతంబు మీకుసకల తీర్థయాత్రాకథాబాహుళ్యంబు వినగోరితిరిగావున ముఖ్యంబుగానూచించి చెప్పుచున్నాడను మరియు సంతానేచ్ఛగలవాడు శుక్రాంగారకభానువారంబుల తప్పక స్నానంబు సేయవలెను. సేతువ్యతిరిక్తసముద్రంబులో సర్వకాలంబులు దప్ప స్నానంబు సేయకూ

# శ్రీ సేతు రామేశ్వర మాహాత్మ్యము.

డగు. అర్ధోదయ మహోదయపర్వంబులయందు సేతుస్నానంబుదివ్యంబని చెప్పినసూతా అర్ధోదయమహోదయంబులవివరణ చెప్పుమన్నను॥

—* అర్ధోదయ మహోదయ పర్వముల వివరణ. *—

తదుక్తంస్కాందే॥ శ్లో॥ సేతావర్ధోదయేస్నానం మానందప్రాప్తి కారణం। పౌషేమాసేవిష్ణుసంస్థేదినేశే భానౌవారే కించి దుద్యద్దినేశే। యుక్తాయాంచేదంగహీనాంగజాంశే కృష్ణపక్షేపుణ్య మర్ధోదయం స్యాత్ మాఘాదిందుక్షయేప్రాప్తే వారార్కే శ్రవణేయది। అర్ధోదయస్సవిజ్ఞేయః కించిజ్ఞానోమహోదయః। అస్మిన్నర్ధోదయేస్నానం సేతౌ సాయుజ్య కారణం। వ్యతీపాతసహస్రేణ దర్శమేకం సమంస్మృతం। దర్శాయుత సమంపుణ్యం భానువారేభవేద్యది। శ్రవణర్క్షయదిభవే ద్భాను వారేణ సంయుతం। పుణ్యమేతత్తద్విజ్ఞేయ మన్యోన్యస్యైవయోగతః। ఏకైకమ ప్యమృతదంస్నానదానతపోర్చనాత్। పంచస్వపిచయుక్తేషుకిము వక్తవ్య మంత్రతః। శ్రవణంజ్యోతిషాంశ్రేష్ఠ మమాశ్రేష్ఠాతిథిష్వపి। వ్యతీ పాత శ్చయోగానాంవారాణాంరవివాసరః। చతుర్ణామపి యోగోయం మకరస్థే రవౌభవేత్। తస్మిన్కాలే రామసేతౌ యదిస్నాయాత్తు మానవః। గర్భం నమాతురాప్నోతి కింతుసాయుజ్యమాప్నుయాదితి॥

వింటిరా మునీంద్రులారా అర్ధోదయమహోదయ పర్వంబుల మాహాత్మ్యంబును వాటి లక్షణంబు లత్యద్భుతంబు లని చెప్పి మఱియు నిట్లనియె.

లోకములో సకల పుణ్య క్షేత్రములలో స్నానములు
జేసినా వదలని పాపములు సేతుదర్శన
మాత్రంబున పోవునని.

శ్లోకాః॥ ప్రతిజ్ఞామకరోద్రామః సీతాలక్ష్మణసంయుతం। స్నానకాలేమనుష్యాణాంమహాపాతకకోటయః॥

తేషుణా దేవ నశ్యంతి యస్యాంత్యేస్యచ్యుతంపదం । నిమిషంనిమిషార్ధంవానేత్రౌతిష్ఠతియోనరః । తద్దృష్టింగోచరంగంతు మశక్తాయమకింకర ఇతి॥ అపిచ॥

రామ సేతౌ ధనుష్కోటిం రామంసీతాంచలక్ష్మణం । రామనాథం హనూమంతంసుగ్రీవ ప్రముఖాన్కపీన్॥

విభీషణంనారదంచ విశ్వామిత్రం సముద్భవం వసిష్ఠంవామదేవం చజాబాలిమథకాశ్యపం॥

రామభక్తాన్ తథాచార్యాన్ చింతయన్మనసాసదా । సర్వ దుఃఖాత్ప్రముచ్యేత సయాతిపరంగతిం॥

సత్యక్షేత్రేహరిక్షేత్రేకృష్ణక్షేత్రేచనైమిశే। సాలగ్రామేబద్రరాజం చహస్తిశైలేవృషాచలే॥

శేషాద్రౌ చిత్రకూటేచ లక్ష్మీక్షేత్రేకురంగంచ। కర్ణికేకుంభకోణేచ మోహినీపురఏవచ॥

వింధ్యే శ్వేతాచలేపుణ్యే పద్మనాభే మహాస్థలే । పుల్లాఖ్యే ఘటికాద్రౌచసారక్షేత్రేహరిస్థలే॥

శ్రీనివాసహరిక్షేత్రే భక్తనాథహరిస్థలే। అళిందాఖ్యే మహాక్షేత్రే కుంభకోణేచవారుణే॥

మధురాయాం హరిక్షేత్రే శ్రీరంగే పురుషోత్తమే । అరంగే పుండరీకాక్షేతథాన్యత్రహరిస్థలే॥

స్నానేనయాని పాపాని నవశ్యంతిద్విజోత్తమాః। తానిసర్వాణినశ్యంతి సేతుస్నానేననిశ్చితం॥

యేవానమశ్శివాయేతి మంత్రం పంచాక్షరంశుభం । నవదంతినపఠంతినశ్రుణ్వంతిమునీశ్వరాః॥

నమోనారాయణాయేతి ప్రణవేనసమన్వితం మంత్రమష్టాక్షరంవాపినజపంతిస్మరంతివా॥

# ౧౬౦ శ్రీ సేతురామేశ్వర మాహాత్మ్యము.

యేవా శ్రీరామచంద్రస్య షడక్షరమమంతథా। నజపంతినశ్రుణ్వంతినస్మరంతిమునీశ్వరాః॥

తేషాంపాపానినశ్యంతిరామసేతునిమజ్జనాత్। బ్రహ్మావిష్ణుశ్చరుద్రశ్చ కీర్త్యతంతేత్ర త్రిమూర్తయః। ఇదం పవిత్రంపాపఘ్నం శ్రుతిభిర్యావబృంహితం॥

సమ్మతంసర్వధర్మాణాంద్వైపాయనమునిప్రియం। శ్రోతవ్యంపఠితవ్యంచఆత్మనశ్శ్రేయఇచ్ఛతా॥

—* పురాణమును వినిపించిన పండితునకు సత్కరించవలసిపద్ధతి. *—

శ్లో॥ శ్రావకాయాచదాతవ్యం యత్కించిత్కాంచనాదికం। వస్త్రంహిరణ్యధాన్యంచ భూమింగాంచయథాబలం॥

స్వస్యశక్త్యానురోధేన విత్తశాఠ్యంనకారయేత్। పూజితేశ్రావకేతస్మిన్పూజితాస్తుత్రిమూర్తయః॥ ద్వైపాయనము ఖాంభోజాత్సుకృతం శుభదంశివం॥

అనుచు నిర్విఘ్నంబున సూతుండు శౌనకాది మహామునులకు సేతుమాహాత్మ్యంబును శ్రీరామలింగేశ్వర చరితంబును సకలతీర్థయాత్రా పరిహారంబును వినిపించెను.

—(*) గణపతి దరిశనము (*)—

రామేశ్వరరస్తా ఒక మైలు దూరమున ఉంటున్నది. రామేశ్వరయాత్ర చేశినవెనక కోటితీర్థములో స్నానముచేశి బయలుదేరునపుడు ఆ క్షేత్రములోచేసిన మలమూత్ర ఉచ్ఛిష్ట శేష పాపనివర్తికిగాను అవశ్యముగ పైగణపతి దరిశనము చెయ్యవలయును.

శ్రీ సే తు రా మే శ్వ ర మా హాత్మ్య ము.

సంపూర్ణము.

---



శ్రీరస్తు

# మహాసంకల్పదీపిక.

## పుణ్యకాల వివరము.



చైత్రఆశ్వీజమాసములలో విషువత్పుణ్యకాలము పుట్టుటకుముందు యెనిమిదిగడియలున్ను తరువాత యెనిమిదిగడియలవరకున్ను పుణ్యకాలము గనుక ఆసమయమునందే స్నానయోగ్యము.

ఆషాఢమాసములో దక్షిణాయనపుణ్యకాలము పుట్టుటకుముందు ౧౬ గడియలున్ను పుష్యమాసములో నుత్తరాయణ పుణ్యకాలము పుట్టిన వెనుక ౧౬ గడియలకున్ను. పుణ్యకాలము.

కార్తీక వైశాఖ శ్రావణ మాఘమాసములలో విష్ణుపద పుణ్యకాలము పుట్టుటకుముందు ౧౬ గడియలు

జ్యేష్ఠభాద్రపదమార్గశిరఫాల్గుణ మాసములయందు షడశీతిముఖ పుణ్యకాలం పుట్టిన వెనుక ౧౬ గడియలు.

సూర్యగ్రహణంబున స్పర్శకాలంబున్ను చంద్రగ్రహణంబున విమోచన కాలంబునను అర్ధోదయమహోదయ విశేష కాలంబులయందును పుణ్యకాలవిశేషములని యెరుంగునది.

—* సేతు రామేశ్వర యాత్రాక్రమంబు. *—

రామనాథ యాత్రా ప్రకారంబును స్నానదానాది క్రియావిశేషంబులు మంత్రతంత్రంబులు వినిపించెద. యాత్రికుండు స్నానసంధ్యాది నిత్యకృత్యంబులు దీర్చుకొని భస్మత్రిపుండ్రధారియైనను లేక గోపీచందనధారణంబును జేసికొని సేతుయాత్రార్థంబు శ్రీరామలింగేశ్వరరామచంద్రుల నుద్దేశించి సంకల్పంబు జేసి యథాశక్తి దానంబులిచ్చి బ్రాహ్మణ భోజనం బొనరింపుచు బయలుదేరి దీనాంధకృపణుల కన్నంబు బెట్టుచు వస్త్రంబు లిచ్చి మరియు శివవిష్ణు నామంబు లుచ్చరింపుచుం వాహనంబు లెక్కక పాదుకలు తొడగక యష్టాక్షర పంచాక్షరమంత్రంబులను రామమంత్రంబును జపించుచు నియతాహారుండై కామక్రోధాదులు విడచి పురాణశ్రవణంబు సేయుచు సేతుమూలంబు ప్రవేశించి.

# ౧౬౨ శ్రీ సేతు రామేశ్వరమాహాత్మ్యము.

దీనాంధ కృపణుల కన్నంబు బెట్టుచు యోగ్యులకు దశదానము చేసి సేతుయాత్రకు బయలుదేరవలయును.

యోగ్య దానంబులనగా సన్యాసులకు సువర్ణాది ధనంబివ్వకూడదు. వానప్రస్థులకు వస్త్రంబులివ్వగూడదు గృహస్థులకు భిక్ష వేయగూడదు. బ్రహ్మచారులకు తాంబూలంబులివ్వగూడదు మరచియైననిచ్చెనేని దాతకు నరకంబు సంప్రాప్తించును.

తదుక్తంస్కాందే॥శ్లో॥యతయేకాంచనంచైవవానప్రస్థాయవాససీ। గృహస్థాయచభిక్షాంచతాంబూలంబ్రహ్మచారిణే । అవిచార్యైవ యో దద్యాద్దాతాచనరకంవ్రజేత్॥

ఈప్రకారంబుగా జెప్పియున్నది గనుక విచారించి యివ్వవలెను.

—* దశదానవివరణ *—

గోభూతిలహిరణ్యాద్య వాసోధాన్యగుడాన్యచ । రౌప్యం లవణ మిత్యాహు దశదానా ప్రకీర్తితాః॥

—* గోదానమంత్రః. *—

గవామంగేషుతిష్ఠంతి భువనానిచతుర్దశ। తస్మాదస్యప్రదానేనఅత శ్శాంతింప్రియచ్ఛమే॥

—* భూ దా న మం త్రః. *—

సర్వసస్యాశ్రయాభూమివరాహేణసముద్ధృతా। అనంతసస్యఫలదం అతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* తిలదానమంత్రః. *—

తిలాఃపాపహరాన్నిత్యం విష్ణోర్దేహసముద్భవః। తిలదానాదస హ్యాంమే పాపంనాశయ కేశవ॥

—* హి ర ణ్య దా న ం. *—

హిరణ్యగర్భగర్భస్తం హేమ బీజం విభావసోః। అనంతపుణ్య ఫల దంఅతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* ఆద్యదానం. *—

కామధేనోస్సముద్భూతంసర్వక్రతుషుసంస్థితం। దేవానామాజ్య మాహారం అతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* వస్త్రదానం. *—

శీతవాతోష్ణసంత్రాణం లజ్జాయాః రక్షణావరం। దేహాలంకరణం వస్త్రంఅతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* ధా న్య దా నం *—

ధాన్యంకరోతి ధాతారం యిహలోకేపరత్రచ । ప్రాణినాంజీవనం ధాన్యం అతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* గు డ దా నం *—

ఇక్షుఖండసముద్భూతంసర్వప్రాణిమనోహరం। సర్వపాపక్షయం తస్మాన్ అతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* రౌప్యదానం. *—

రుద్రనేత్రసముద్భూతం రజితంపితృవల్లభం తస్మాత్కాదస్య ప్రదానేన అతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* లవణదానం.*—

రసానామగ్రజంశ్రేష్టం లవణంఫలవర్ధనం। తస్మాదస్య ప్రదానేన అతశ్శాంతింప్రియచ్ఛమే॥

—* (మ హా స ం క ల్ప ము). *—

పాదౌప్రక్షాళ్యాచమ్య దర్భేష్వాసీనఃదర్భాధారయమాణః॥యత్ర పాణిస్సన్ ప్రాణాయామం కృత్వా॥

ఓం భూఃభూర్భువస్స్వరోమితిమమోపాత్తసమస్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలంచంద్రబల దైవబలం,తదేవలక్ష్మీపతేంఘ్రియుగళం స్మరామి.

ఓంఅపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపివాయస్మరే త్పుం డరీకాక్షంచ బాహ్యాభ్యంతర శ్శుచిః మానసం వాచకం పాపం కర్మణా సముపార్జితం శ్రీరామ స్మరణే నైవ సర్వ పాప వ్యపోహితీతి ననంశయః శ్రీరామ రామరామేతి తద్విష్ణు స్తథావార నక్షత్రం విష్ణు రేవచయోగం చకరణంచైవ సర్వంవిష్ణు మయం జగత్ శ్రీగోవింద, శ్రీగోవింద గోవింద అద్య శ్రీ భగవతః ఆదివిష్ణో రాది నారాయణస్య అచింత్యా పరిమిత యాశక్త్యా ధ్రియమాణస్య మహాజలౌ ఘస్య మధ్యే పరి భ్రమాణానాం అనేకకోటిబ్రహ్మాండానాం యేకతమే అవ్యక్తమహాదహంకారపృథివ్యప్

తేజోవాయురాకాశాద్యైరావరణై రావృతే అస్మిన్ మహతీ బ్రహ్మాండకరం-
డ మండలే ఆధారశక్త్యాది కూర్మాద్యనంతాద్యష్టదిగ్గజోపరి ప్రతిష్ఠితస్యో
పరితలే సత్యాదిలోక స్వర్గస్య అధోభాగే మహానాళాయమాన ఫణిరాజశేష
స్య సహస్ర ఫణామండల మండితే లోకాలోకాచలేన పరివృతే దిగ్దంత శుం
డాదండోత్తంభితే లవణేక్షు సురాసర్పి ర్దధి దుగ్ధ జలార్ణవైః పరివృతే,
జంబూప్లక్ష శాల్మలీకుశ క్రౌంచశాక పుష్కరాఖ్య సప్త ద్వీపాత్మకే, ఇంద్ర
కశేరు, తామ్ర, గభస్తి, నాగ, సౌమ్య, గంధర్వ, చారణ, భారతాదినవఖండాత్మ
కే, మహామేరుగిరి కర్ణికోపేత మహాసరోరుహాయమాణ పంచాశత్కో-
టి యోజనవిస్తీర్ణ జంబూద్వీపే సుమేరు నిషధ హేమకూట హిమవాచల
మాల్యవంత పారియాత్రకే గంధమాదన కైలాసవింధ్యాచలాది మహాశైలా
ధిష్ఠితే లవణసముద్రముద్రితే భారత కింపురుష హరివర్ష ఇలావృత రమ్యకే హిర
ణ్మయోత్తర కురు భద్రాశ్వ కేతుమాలాఖ్య నవ వర్షోపరి శోభితజంబూ
ద్వీపే భారతవర్షే భరతఖండే మేరోర్దక్షిణదిగ్భాగే కర్మభూమౌ సౌమ్యావంతి కురు
క్షేత్రసమభూమధ్యరేఖాయాః పూర్వదిగ్భాగే వింధ్యాచలస్య దక్షిణదిగ్భాగే
దండకారణ్యే గోదావర్యాః దక్షిణే తీరే సకలజగత్స్రష్టుః పరార్ధద్వయ జీవన
బ్రహ్మణః ప్రథమ పరార్ధే పంచాశదాత్మకే అతీతే ద్వితీయ పరార్ధే ప్రథ
మవర్షే ప్రథమమాసే ప్రథమపక్షే ప్రథమదివసే ద్వితీయయామే ద్వితీయ ముహూర్తే
స్వాయంభువ స్వారోచిష ఉత్తమ తామస రైవత చాక్షుషాఖ్యేషు షణ్మన
ప్వతీతేషు సప్తమే వైవస్వత మన్వంతరే అష్టావింశతితమే మహాయుగే కృత
త్రేతా ద్వాపరేషు గతేషు వర్తమానేన కలియుగే ప్రథమపాదే శాలివా
హనశకాబ్దే చాంద్ర శ్రావణ సౌరాది మాన పరిమాణ ప్రభవాదీనాం షష్టిసంవ
త్సరాణాం మధ్యే వర్షే అయనే ఋతౌ మాసే పక్షే తిథౌ, వాసరే, నక్షత్రే
యోగే, కరణే, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ మమోపాత్తసమ
స్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం అనాద్యవిద్యావాసనయా ప్ర
వర్తమాన అస్మిన్ మహతి సంసార చక్రే విచిత్రాభిః కర్మగతిభిః విచిత్రాసు
యోనిషు పునః పునః అనేకతా జనిత్వా కేనాపి పుణ్యకర్మ విశేషణ ఇదానీం,
తనమానుష్యే ద్విజజన్మవిశేషం ప్రాప్తవతః మమజన్మాభ్యాసవశాత్ జన్మప్ర
భృతి ఏతత్క్షణ పర్యంతం బాల్యే వయసి కౌమారే యౌవనే వార్ధకేషు
జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థాసు మనో వాక్కాయ కర్మభిః చక్షుశ్శ్రోత్రాది దిక్

వాగాగ్రైః వ స్త్రాణి పాదపాయూపస్థైః చకృతానాం జన్మాంతరేపరికాళ కృత్ మహా పాతక చతుష్టయ వ్యతిరిక్తానాం రహస్య కృత బ్రహ్మ హత్యాది సమాహిత కానాం సంకరీ కరణానాం జాతిభ్రంశ కర ణానాం పరికీర్తితానాం నవానాం నవ విధానాం బహూనాం బహు విధానాం సర్వేషాం పాపానాం సద్యోనశా మర్థం రామ ధనుష్కో ట్యాం భాస్కర క్షేత్రే పర్వత వర్ధని సమేత శ్రీరామలింగేశ్వరస్వామి సన్నిధౌ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్ సమేత శ్రీరామచంద్ర స్వామి సన్నిధౌ శేతుమాధవ కాలభైరవస్వామి సన్నిధౌ ఛాయాసౌజ్ఞస మేతశ్రీసూర్యనారాయణస్వామిసన్నిధౌ సమస్తహరిహర దేవతా సన్నిధౌ దేవబ్రాహ్మణసన్నిధౌమమసమస్త పాప క్షయార్థం శ్రీరామ ధనుష్కో ట్యాం మహోదధిరత్నాకరస్నాన మహంకరిష్యే అతిక్రూరమహాకాయ కల్పాంత దహనోపమాక్ భైరవాయనమస్తుభ్యఅనుజ్ఞాంధాతు మర్హసి దురాలావదుస్థితిగ్రహాసంభవంపాపంహరమమ క్షిప్రం సహ్యాశన్యేనమో స్తుతె త్రిరాత్రం జాహ్నవీతరేపంచరాత్రంతుయామినె నిత్యం పునాతు కావేరి పాపమామరణాంతికం । గంగాగంగేతియోబ్రూయాద్యోజనానాం శతైరపిముచ్యతె సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి ॥ ఇతి స్నాత్వా॥

ప్రథమమందు పాషాణదానంబుజేసి సముద్రావాహనంబు జేసి సముద్రునికి నమస్కారంబుగావించి సముద్రునియాజ్ఞగైకొని స్నానమం త్రంబుపఠించవలెను.

—* పాషాణదానమంత్రము *—

పిప్పలాదాత్సముత్పన్నే కృత్యైలోకభయంకరి। పాషాణంతేమయా దత్తమాహారార్థంప్రకల్పయ॥ ఇట్లనిపాషాణమునుసముద్రములోవైవేది.

—* అథ దర్పనం. *—

వేదాదయో వేదవశిష్టయోనిః సరిత్పతిసాగర రత్నయోనిః అగ్ని శ్చతె తేజ్యాముచ్యతేజః। రేతోవావిశ్వాఅమృతస్యనాభిః జితంతె అన్యాభి రసమానమద్భిః యధాతవప్రవింశత్యాపహా । సర్వాజీర్వామి వత్వంచమ హామి పాపంశరీరాత్ శరీరస్థోపి భేత్యాదర్పణసంకల్పశ్లోకాః॥

పిప్పలాదిందర్పయామి॥ అవిన్తతర్పయామి॥ కణ్వాంతర్పయామి॥ కృ తాంతంతర్పయామి॥ జీవితేశ్వరంతర్పయామి॥ మన్యుంతర్పయామి ॥ కాళ

రాత్రింతర్పయామి॥ విద్యాం తర్పయామి॥ అగస్త్యంతర్పయామి ॥ గణేశ్వరంతర్పయామి॥ వశిష్టం తర్పయామి॥ వామదేవం తర్పయామి॥ జాబాలింత్ప తర్పయామి॥ కాశ్యపం తర్పయామి॥ వాల్మీకిం తర్పయామి॥ నారదంతర్ప యామి॥ పరాశరం తర్పయామి॥ ఉమాపతిం తర్పయామి॥

—* అధ ప్రార్థన మంత్రః. *—

రాజాధిరాజాయప్రసహ్యాం సాహినే నమోవయంవయశ్రవణాయ కుర్మహే। సమేకామాన్ కామకామాయమహ్యాం కామేశ్వరోవైశ్రవణాద ధాకుబేరాయవైశ్రవణాయమహారాజాయనమః॥

—* ప్రార్థనా మంత్రః. *—

ప్రాచ్యాదిశివసుగ్రీవం దక్షిణస్యానలంస్మరేత్ । ప్రతీచ్యాంమైంద నామానముదీచ్యాంద్వివిధంతథా॥ రామంచ లక్ష్మణంచైవ సీతాయమపియ శస్వినీం। అంగదం వాయుతనయంస్మరేన్మధ్యే విభీషణం॥ పృథివ్యాంయాని తీర్థానిప్రావిశస్త్వామహోదధే। స్నానతస్య మేవఫలం దేహిసర్వస్మాత్రా హిమాంహసః హిరణ్యశృంగమిత్యాభ్యాంద్వాభ్యాం నారాయణంస్మరేత్। ధ్యాయేన్నారాయణం దేవం స్నానాదిషుచకర్మసు॥

బ్రహ్మలోకమవాప్నోతి జాయతేనేహవైపునః। సర్వేషామపి పాపానాంప్రాయశ్చిత్తంభవేత్తతః॥

ప్రహ్లాదం నారదం వ్యాసం మంబరీషం శుకంతథా। అన్యాంశ్చ భగవద్భక్తాన్ చింతయే దేకమానసః॥ ఈమంత్రంబు జదివి ధ్యానంబు జేయవలెను.

—* అర్ఘ్య మంత్రః *—

సర్వరత్నమయశ్రీమన్ సర్వరత్నాకరాయచ । సర్వరత్నప్రదాన త్వం గృహాణార్ఘ్యం మహోదధే॥ ఇతి॥ అర్ఘ్యంబు లివ్వవలెను.

—* అనుజ్ఞాపన మంత్రః. *—

అశేషజగదాధార శంఖచక్ర గదాధర । దేహిదేవ మమానుజ్ఞాం యుష్మత్తీర్థనిషేవణే॥ ఇత్యనుజ్ఞాపనం॥

—* అథ సాన్నిధ్య మంత్రము. *—

విశ్వాచీత్వంఘృతాచీత్వం విశ్వయోనేవిశాంపతే। సాన్నిధ్యంకురు మే దేవ సాగరేలవణాంభసి॥ అని సమీపమునకు బోవలయును.

అథ నమస్కారమంత్రాః.

నమస్తే విశ్వరూపాయ నమో విష్ణో అపాంపతే । నమో హిరణ్యశృంగాయ నదీనాం పతయే నమః॥ తదుపరి॥ సముద్రాయ వయునాయ అని గొప్పగా నుచ్చారణచేసి నమస్కారంబు చేయవలయును.

సముద్రస్నానవిధిః.

శ్లో॥ శుక్లాంబరధరంవిష్ణుంశశివర్ణం చతుర్భుజం ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే॥ ఓంభూర్భువస్సువరోం మమోపాత్త ప్రీత్యర్థం అపవిత్రః పవిత్రోవా పుణ్యకాలే మహోదధి రత్నాకర స్నాన మహంకరిష్యే॥ —* ప్రథమ స్నాన మంత్రః *—

సముద్రాయ వయునాయేతిననుస్కృత్య త్వనద్విజాః। సర్వతీర్థ మయంశుద్ధంనదీనాంపతిమంబుధిం॥ ఇదిజదువుచు ప్రథమస్నానము చేశేది.

—* ద్వితీయస్నానమంత్రః. *—

ద్వైసముద్రాయితిపునః ప్రోచ్చార్యస్నానమాచరేత్ । బ్రహాండో దరసంస్థానికరస్పృష్టానితేరవే॥ దేవపట్టణమార్గేణ తవరిజేద్యదిమానవః । అథాతు నవపాషాణమధ్యే సేతౌవిముక్తిదే॥

స్నానమంబు నిధౌకార్యాత్సర్వపాపౌఘపనుత్తయే । దర్భశయ్యా పదవ్యాచేద్గచ్ఛేత్సేతు విముక్తిదం॥ ఇతి॥

నమస్తే విశ్వగుప్తాయ నమోవిష్ణురపాంపతే । నమోజలధిరూపాయ నదీనాంపతయేనమః॥

సముద్రాయవయునాయసింధూనాంపతయేనమః। నదీనాంసర్వసాంప్రీతే బహుతావిశ్వకర్మణే । విశ్వావహామర్త్యభవ । ఇతిస్తేకతంత్వా ప్రార్థ్య॥సర్వరత్నమయశ్రీమన్ సర్వరత్నకథాకరా। సర్వరత్నప్రధానత్వంగృహాణార్ఘ్యం మహోదధే॥ మహోదధేనమః॥

ఇతి మర్ఘ్యం త్రితయంస్నాత్వా॥ ఇతిసముద్రస్నానవిధిః॥

## అథ క్షేత్రపిండ విధిః.

అర్ఘ్యమావాహనంచైవ ద్విజాంగుష్ఠనివేదనం । వికిరంపంచదానంచతీర్థేసంచవివర్జయేత్ తీర్థశ్రాద్ధం అన్యేషకృతంయదిపిండ ప్రధానేన యథాప్రకారేణ క్షేత్రపిండ మతఃపరం మహాలయవతు।

# ౧౬౨ శ్రీ సేతు రామేశ్వర మాహాత్మ్యము.

తిలతర్పణంచకుర్యాత్.

హిరణ్యేనకృతంయదిఅనంతరంశిలాతు తెనక్షేత్రికించి దర్పణంచ కుర్యాత్।

తీర్థశ్రాద్ధాంగక్షేత్రి పిండంకరిష్యేతి సంకల్ప్య॥

అస్మత్కులేమృతా యేచగతిర్యేషాంనవిద్యతే। అజస్తాయిత్వావా సర్వాః ఇదమస్తుతిలోదకం॥ ఏవందక్షిణాభిముఖస్సర్వపాచీనావీతిభూత్వా సవ్యజ్ఞాచ్ఛిలోదకంగృహిత్వాచతుర్షుస్తనేషునిచయేతు ఆబ్రహ్మణోయ పితృవంశజాతామాతుస్తదా॥ వంశభవంమదీయాః వంశద్వయేస్మిన్ మమ దాసభూతాభృతాస్తదైవశ్రిత శేవకాచ్చమిత్రాణిసఖ్యవశవశ్చవృతుఃస్పృష్టాచ్చ దృష్టాశ్చ కృతోపకారః జన్మాంతరేయ మమ సంగతాచ్య తెభ్యః స్వధాపిండ మహందదామి॥ ఇతి తిలసంయుక్తతండులం గృహీత్వా పిండ పిధానరీత్యా పిధమస్తు నేదత్వాతు॥

పితృవంశేమృతాయేచ మాతృవంశేతథైవచ।గురుశ్వశుర బంధూనాంయేదాన్యే బాంధవామృతాః యేమేకులేలుప్తపిండాః॥ పుత్రిదారావివర్జితే క్రియాలోపా హతాశ్చెవజాత్యంతాసంగవస్తదానిహూపాఅనుగర్భాచ్ఛిజ్ఞాతాజ్ఞాకులేమమ తెషాంపిండంమయాదత్తం అక్షయ్యముపతిష్ఠతు॥ అసిపత్రి వనే ఘోరే కుంభీపాకేచ రౌరవే తెషాముద్ధరణార్థాయ ఇమం పిండంతనామ్యహం। అతీతగుణకోటీనాం ఏషాందాతాకులేసహి॥ ధర్మపిండోమయాదత్తం అక్షయ్యముపదిష్టితు । ఉత్పన్నకులకోటీనాం సప్తద్వీప నివాసినం ౯ ఆబ్రహ్మభువనాల్లోకాః ఇదమస్తుతిలోదకం। అపిచతుర్థిషు తండులపిండేషు తిలోదకం॥ నినయాతు॥

ఆబ్రహ్మస్తంభపర్యంతంయత్కించత్స చరాచరం॥ మయా దత్తేన తోయేన తృప్తి నేవాభిగచ్ఛతు॥

అబ్రహ్మస్తంభపర్యంతం దేవర్షిపితృమానవాః తృప్యంతుపితరస్సర్వే మాతృమాతా మహాదయః।ఇతిపిండాన్ ప్రార్థ్యతే। ఏకేచపిత మాషేణవర్తంతే పితరోమమ॥కర శేనసర్వేతృప్తిమాయాంకుశ పుష్పైవస్తి లోదకైః ఇతిదర్భమూలేనచతురిషు పిండేషు రేఖాంతుయ్యాతు పిండాన్గృహీయ్యాజలేనిక్షిప్త్వాఆచమ్యా॥ అత తిలతర్పణం మహాలయంతం॥

ఇతి క్షేత్రపిండవిధి స్సమాప్తః.

——(*)——